# హరిభావూ ఆప్టే

( జననం – 8-3-1864; మరణం – 3-3-1919 )

మరాఠీ సాహిత్యరంగంలో ప్రముఖ కథాకారుడు. మొదటి నవల – 'మధలీ స్థితి'. 'ఆజ్‌కాలాచ్యగోష్ఠి'–అనేపేరుతో అనేక కథలురాశారు. 'కర్మణక్' అన్న పేరు గల పత్రిక నెలకొల్పారు. 'చంద్రగుప్త్'; 'రామ్‌నగర్‌చీ రాజ కన్య'; 'కాలకూట్'; 'ఉషఃకాల్'; 'గడ్ ఆలా పణ్ సింహ్ గేలా'; 'వజ్రాఘాత్' మొదలైనవి ఆయన చారిత్రక నవలలు. 'పణ్ లక్షాత్ కోణ్ ఘేతో'; 'యశ్వంత రావ్ ఖరే'; 'జగ్ హే అసే ఆహే'; 'మాయోచా బజార్' 'మీ'; 'భయంకరదివ్య' మొదలైన సాంఘిక నవలలు కూడా రాశారు. ఆయన మొత్తం ఇరవై రెండు నవలలూ, నాలుగు కథానికా సంగ్రహాలూ; ఎనిమిది నాటకాలూ మరికొన్ని వ్యాసాలూ రచించారు.

ఆధునిక మరాఠీ నవలల్లో నూతన భావయుగానికి నాంది పలికిన గౌరవం వీరికే దక్కుతుంది.

అంతర భారతీయ పుస్తకమాల

# నేను

రచన:
హరినారాయణ ఆప్టే
అనువాదం:
డి. వెంకట్రామయ్య



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా
న్యూ ఢిల్లీ

డిశంబరు 1973 (పుష్య 1895)

December 1973 (Pushya 1895)



[redacted]

Rs. 4-00

ORIGINAL TITLE : MEE (*Hindi*)
TELUGU TITLE : NENU

డిస్ట్రిబ్యూటర్సు:
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు
రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాదు

PUBLISHED BY DIRECTOR, NATIONAL BOOK TRUST, INDIA, NEW DELHI—16
AND PRINTED AT A.S.R. POWER PRESS, KOTHAPET, TENALI

# భూమిక

ప్రాచీన మరాఠీ నవలా సాహిత్యంలో ఒక నూతన భావయుగానికి నాంది పలికిన గౌరవం శ్రీహరి నారాయణ ఆప్టేకి లభిస్తుంది. హరిభావూ తర్వాత దెబ్బైఅయిదు సంవత్సరాలకాలంలో మరాఠీ నవల బాగా వ్యాప్తి చెందింది; ఆ నవలల్లో అనేక ఆలోచనా ప్రవాహాలు ప్రవేశించాయి. ఈ కారణంవల్ల కూడ హరిభావూ నవలలు మరాఠీ నవలల్లో శ్రేష్ఠమైనవిగా పరిగణింపబడతాయి. ఒక నూతనదిశకి ప్రతీకలుగా ఆయన నవలలు వెలువడ్డాయి. ఈ రకంగా ఆయన ఘనత ఆయన యుగంలోనే కాక, ఇప్పటికీ కూడ నిలిచివుంది.

మరాఠీ సాహిత్యం ప్రాచీనమే అయినప్పటికీ, మరాఠీ నవలలు పుట్టి,-వంద, నూటపాతిక సంవత్సరాలకంటే ఎక్కువ కాలేదు. పన్నెండో శతాబ్దంలో మరాఠీ బాషలో గ్రంథ రచన ప్రారంభమైంది. కాని మరాఠీ నవల పంథొమ్మిదో శతాబ్దపు ఉత్తరార్ధంలో పుట్టింది. బాబా పద్మజీ రచించిన 'యమునాపర్యటన్' (1857) మరాఠీలో మొదటి నవలగా పరిగణింపబడుతుంది. ఆ యుగానికి చెందిన సమస్యలు ఆధారంగా ఈ నవల వ్రాయబడింది.

హిందూ వితంతువుల జీవితాలు; అణచబడివున్న స్త్రీజాతి సమస్యలూ ఈనవలలో చిత్రించబడినాయి. క్రైస్తవమత ప్రాధాన్యాన్నికూడ ఇందులో వివరించడం జరిగింది. బాబాపద్మజీ స్వయంగా క్రైస్తవమతం స్వీకరించటం ఇందుకు కారణం. హరిభావూకి ముందుకాలంలో-లక్ష్మణశాస్త్రి హల్బే తన 'ముక్తమాల' (1861) అనే నవలద్వారా మరాఠీప్రజల్లో ఒక గాఢమైన చైతన్య భావాన్ని పాదుకొలిపాడు. అద్భుతమైన సంఘటనలు; చమత్కారాలు; శృంగారం; వాటి కనుగుణమైన శైలి; సజ్జనుల అంతిమవిజయం; దుర్జనుల పరాజయం - ఇవన్నీ అప్పటి మరాఠీ నవలల్లో ఎక్కువగా వుండేవి. వీటితోపాటు రా.వి. గుంజీకర్ నవల 'మోచన్‌గఢ్' (1867) చారిత్రక నవలా యుగానికి నాంది పలికింది. హరిభావూ పూర్వకాలాన్ని 'ముక్తామాలా' యుగంగా పేర్కొంటారు. ఆ నవలల్లో నవలాగుణం వుండేది. కాని, జీవిత దృష్టితోనూ, కళాదృష్టితోనూ

చూసినప్పుడు—ఆ నవలలు యింకా ప్రారంభదశలోనే వున్నాయని చెప్పాలి. ఒక రకంగా అది హరిభావూ యుగానికి పీఠికలాంటిది.

హరిభావూ జన్మించిన కాలం-మహారాష్ట్రీయు జీవితంలోని వివిధరంగాల్లో మహామేధావులకాలం. ఒక ఒంక సామాజిక నవచైతన్యం విలసిల్లుతోంది; మరొకఒంక బ్రిటిష్‌పాలన, పాశ్చాత్య సంస్కృతులకు వ్యతిరేకంగా ప్రజలో సంచలనం ప్రారంభమైంది. ఈ చైతన్యంలో అనేక క్రియలూ ప్రతిక్రియల ఆందోళన ప్రారంభమైంది. తత్ఫలితంగా అదేకాలంలో – అభ్యుదయ భావాల అంకురార్పణ; నవచైతన్యపు ప్రారంభమూ జరిగాయి.

'మధలీ స్థితి' హరిభావూ మొదటి నవల. 'పుణే వైభవ్' అనే పత్రికలో 1885వ సం॥ నుంచీ ధారావాహికంగా ఈ నవల ప్రచురితమైంది. అప్పట్నించే మరాఠీ పాఠకుల హృదయాలపై హరిభావూ ప్రభావం పడింది. రేనాల్డ్స్ రచించిన 'గోల్డ్ లండన్' అనే నవల అనువదిస్తూవుండగా, ఆయనకి స్వతంత్ర నవల వ్రాయాలన్న కోరిక కలిగింది. హరిభావూ ఈ రచనకి 'ఆజ్‌కాలాచ్య గోష్టి' (ఈనాటి కథలు) అని పేరు పెట్టాడు. ఎనిమిది తొమ్మిది కథలురాసి, వాటినే కలిపి నవలగా రూపొందించాడు. ఆ తర్వాత ఆయన 'కర్మణక్' (1890) అనే ఒక పత్రిక ప్రారంభించాడు. ఆయన నవలలు అందులో ధారా వాహికంగా వచ్చేవి.

1917వ సంవత్సరం—అంటే హరిభావూ మరణించడానికి రెండేళ్ళ ముందు వరకూ ఈ పత్రిక నడుస్తూనేవుంది. ఈ కాలంలో హరిభావూ—ఇరవై రెండు నవలలూ; నాలుగు కథానికా సంగ్రహాలూ; ఎనిమిది నాటకాలూ; కొన్ని వ్యాసాలూ ప్రచురించాడు.

సాహిత్యమే హరిభావూ జీవనం. అందువల్లనే ఆయన మరాఠీ సాహిత్యాన్ని చమత్కార ప్రధానమైన వాతావరణంలోంచి వాస్తవిక ప్రపంచంలోకి తీసు కొచ్చాడు. ప్రజల ఆసక్తులూ అభిరుచులూ ఆయనకి తెలుసు. మరాఠీ పాఠకులు విచిత్ర సంఘటనలూ కుతూహలాన్ని కలిగించే విషయాలూ ఎక్కువ కోరుతారనికూడా ఆయనకి తెలుసు. అందువల్ల చారిత్రక నవలల ద్వారా ఆయన అనేక చమత్కారాలు ప్రదర్శించాడు. ఆ రోజుల్లో పాశ్చాత్య నవలా

కారుడు స్కాట్ — విచిత్రమూ కాల్పనికమూ అయిన సంఘటనలెన్నో తన నవలల్లో ప్రవేశపెట్టి పాఠకులకి మనోల్లాసాన్ని కలిగించేవాడు. సాహసం, కల్పన, నేరపరిశోధన మొదలైన విషయాలెన్నిటినో హరిభావూ తన నవలలకి ముడిసరుకుగా వుపయోగించుకుని, నవలా రచనలో వివిధరీతులకి శ్రీకారం చుట్టాడు.

మరాఠీ పాఠకులకి ఆయన నవలలు మనోరంజకంగా వుండేవి. అందువల్ల ఆయన నవలలంటే పాఠకులు యిష్టపడేవారు. ముక్తమాలాయుగంలోని నవలలకి ఇవి భిన్నంగా వుండేవి. పాఠకులకి చారిత్రక నవలలపట్ల వుండే గౌరవాన్ని-హరిభావూ—దేశభక్తిభావాలూ స్వాతంత్ర్య భావాలూ పురికొల్పడానికి వినియోగించుకున్నాడు. చారిత్రక విషయాల్లో దేశభక్తిభావాల్ని మిళితం చేశాడు. సంభాషణలు, ఆచారవ్యవహారాలు, ఆనాటి సాంఘిక పరిస్థితులు, స్త్రీసమస్య — యిలాంటివాటికి ప్రాధాన్యతనిచ్చి, తన అభిప్రాయాల్ని ధృఢతరం చేశాడు. 'చంద్రగుప్త'; 'రూప్‌నగర్ చీ రాజకన్య'; 'కాలకూట్'; మొదలైన నవలల్లోని చారిత్రక వాతావరణం కేవలం మహారాష్ట్రకే కాక దేశంలోని యితర ప్రాంతాలకి కూడ చెందినట్టిది. ఉషఃకాల్'; 'గడ్ ఆలా పణ్ సింహ్ గేలా'; 'వజ్రాఘాత్' మొదలైన చారిత్రక నవలల్లో తత్కాలీన వాతావరణాన్ని చిత్రించడంలో హరిభావూ కృతకృత్యుడయ్యాడు. అన్నివిధాలా కూడా ఈ నవలలు ఉత్కృష్టమైనవి.

హరిభావూ సాంఘిక నవలల్లో — సంఘసంస్కరణపట్ల ఒక విశిష్టమైన దృక్పథం గోచరిస్తుంది.

హరిభావూకాలంలో, మరాఠీనవలల్లో కళాత్మక దృష్టి, సామాజిక జీవనదృష్టి రెండూ కలిసే వుండేవి. అందువల్లనే ఆయన నవలలు దాదాపు అన్నిటిలోనూ కూడ ఈ రెండు దృక్పథాల్నీ అపూర్వంగా సమ్మిళిత పరిచిన తీరు గోచరిస్తుంది. ఆయన నవలల్లో ఆనాటి సమాజాన్ని విస్తారంగానూ లోతుగానూకూడ పరిశీలించి చిత్రించడం జరిగింది.

'మధలీ స్థితి' అన్న నవలలో హరిభావూ సామాజిక భావనలు మనకి స్పష్ట మవుతాయి. మరాఠీ ప్రజల భావాలూ, ఆలోచనలూకూడా ఈ నవలలో చిత్రిత

మైనాయి. "నా నవలల్లో కేవలం కల్పితమైన పాత్ర ఒక్కటికూడా లేదు"-అని, ఆయన తన నవలలగురించి చెప్పుకునేవారు. ప్రతి పాత్రాకూడా జీవితంలో ఆయన కత్యంత సన్నిహితంగా వున్నవే. మన స్వత్వ సంబంధమైన విషయాలు కూడా ఆయన నవలల్లో వుండేవి. 'పణ్ లక్షాత్ కోణ్ ఘేతో'-అన్న నవలల్లో నాయిక యమూ; ఆమెకొడుకూ మాటిమాటికీ తమగురించి తాము చెప్పుకుంటారు. ఆరకంగా వారు విప్లవాత్మక భావాలు ప్రకటిస్తారు. ఎవరో పరిచిత వ్యక్తి స్వీయ చరిత్ర చదువుతున్న అనుభూతి కలుగుతుంది పాఠకులకి.

హరిభావూ నవలల్లో మహారాష్ట్రంలోని మధ్యతరగతి కుటుంబాలు విద్యావంతులైన వారి చిత్రణ కనిపిస్తుంది. వారి కథావివరణలో జాతీయ చైతన్యం స్పష్టంగా గోచరిస్తుంది. 'మధలీ స్థితి' (1885) నుంచి 'కర్మయోగ్' (1917) వరకూ అన్నిటిలో మారుతున్న సమాజ చిత్రణ కనిపిస్తుంది. ఆంగ్ల విద్యనుంచి, మొదటి ప్రపంచ యుద్ధంవరకూ-మహారాష్ట్రీయుల జీవితాల్లో కలిగిన సాంఘిక మానసిక పరిణామాలన్నీ ఆయన నవలల్లో కనబడతాయి. ప్రథమ ప్రపంచ సంగ్రామంలో భారతీయ సైనికులు విభిన్న రంగాల్లో ప్రదర్శించిన సాహసం మన ఆత్మ విశ్వాసాన్ని మేలుకొలిపింది. ఇటు సామాజిక, రాజకీయ రంగాల్లో అవతరించిన అనేక నాయకుల వల్ల - స్వాతంత్ర్య సమరానికి కొత్తబలం చేకూరింది, కొత్త మార్గం లభించింది. అన్యాయానికీ పరపీడనకీ వ్యతిరేకంగా అందరిలోనూ విప్లవ చైతన్యం; ప్రతిఘటన భావాలూ జాగృతమైనాయి. ఈ రకంగా హరిభావూ నవలల్లో - సాంఘిక ప్రబోధం, జాతీయ భావజాగృతి, ఆధ్యాత్మిక లౌకిక ఆదర్శాలు, నూతన మానవవాదం, వర్గ చైతన్యం-వీటన్నిటి విషయంలోనూ విశాలమైన దృక్కోణం కనిపిస్తుంది.

మనకి నిత్యజీవితంలో తటస్థపడే అనేక మంది చిన్నా పెద్దా వ్యక్తుల జీవన చిత్రణద్వారా ఆయన తన దృక్పథాన్ని కూడా స్పష్టంచేశాడు. ఆజీవిత గాథల్లో ఎంతో సహజత్వం వుంటుంది. సంఘంలో క్రమ క్రమంగా కలిగే మార్పులు కుటుంబ జీవనంలో కలిగే మార్పులూ ఆయన అతి సూక్ష్మంగా తన నవలల్లో చిత్రించాడు. కుటుంబాల్లో ఉత్పన్నమయ్యే సమస్యల ఆధారంగా, నవచైతన్యం, స్త్రీ విద్య మొదలైన విషయాలపై తన మనోభావాన్ని చిత్రించాడాయన. 'పణ్

లక్షాత్ కోణ్ ఘేతో' నవలలోని పాత్ర చిత్రణ ప్రతి పాఠకుడికీ ఇది నా కథా అనిపించేట్టుగా వుంటుంది. కాని 'భయంకర్ దివ్య్' నవలలో బలవంతరావ్, ద్వారకా బాయ్‌ల పునర్వివాహాన్ని చూపించి, పాత నమ్మకాలకీ, నూతన భావాలకీ మధ్య జరిగే సంఘర్షణ చిత్రించాడు. చివర సుఖంగావున్న కుటుంబాన్ని చిత్రించి, నూతన యుగం ప్రారంభమైందన్న సందేశాన్ని పాఠకులకి అంది స్తాడు రచయిత. నూతన యుగంతోపాటు, ఆయుగానికి చెందిన నూతన భావాన్ని కూడ స్వీకరించక తప్పదు.

హరిభావూ సాంఘిక నవల 'మీ' (నేను) ఆయన 'కర్మణక్' పత్రికలో 1893 నుంచి 1895 వరకూ ధారావాహికంగా ప్రచురితమయింది. ఆత్మకథ పద్ధతిలో కథానాయకుడు భావానంద్ జీవితగాథని యిందులో చిత్రించడం జరిగింది. సంఘ సంస్కరణ భావాలు ఈనవలలో ప్రారంభంనుంచే స్పష్టంగా కనిపిస్తాయి. ప్రయోజనం సౌందర్యం ఈ రెండూ మిశితమైవున్నదే ఉత్తమ సాహిత్యమని హరిభావూ అభిప్రాయం. తదనుగుణంగా ఒక రకమైన భావ స్వాతంత్ర్యం ఆయన నవలల్లో గోచరిస్తుంది. సాహిత్యకారుడికి విశాల హృదయం అతి ముఖ్యమైనది. ఈ గుణం హరిభావూలో బాగా వుంది. భావానంద్ వ్యక్తిత్వాన్ని సంఘ సంస్కర్తగా, ప్రచారకుడిగా, ఉపదేశకుడిగా, విద్యా వంతుడిగా మలచడం జరిగింది. ఈ రకంగా కేవలం కళాకారుడిగా కాక, ఆదర్శ వాదిగా హరిభావూకి స్థానం లభిస్తుంది. నాయకుడి పాత్ర చిత్రణంలో-మార్గ దర్శకుడిగానే కాక, మానవత్వాన్ని మేలుకొలిపే వ్యక్తిగాకూడ చూపడం జరిగింది.

పాశ్చాత్య విద్య లభించడంతో-సమాజంలోని అంధవిశ్వాసాలూ, మూఢా చారాలూ, దాస్య పరిణామాల పట్ల ప్రజల హృదయాల్లో సంఘర్షణ చెలరేగింది. భారత నాయకులు ప్రజాశక్తిని నమ్మి, ప్రజల్ని స్వాతంత్ర్య సమరానికి ప్రేరే పించే ప్రయత్నాలు ప్రారంభించారు.

మొదట రాజకీయ సంస్కరణ రావాలా, సంఘ సంస్కరణ రావాలా అన్న సమస్య కలిగింది నాయకులకి. లోకమాన్య తిలక్, సంఘ సంస్కర్త ఆగర్కర్-వీరిద్దరి భావాలూ మహారాష్ట్రాన్ని నూతన మార్గాలవైపు మళ్ళిస్తు

వ్నాయి. అదే సమయంలో హరిభావూ-తన నవలలద్వారా సంస్కరణ భావాలూ, స్త్రీ స్వాతంత్ర్య భావాలూ పాఠకుల కందించడం ప్రారంభించాడు. నవలలోని కొన్ని పాత్రల్లో ఆ కాలంనాటి విద్యావంతుల సంస్కారవంతుల రూపాలు కనిపిస్తాయి. భావానంద్ పాత్ర చిత్రణలో ఆధ్యాత్మిక భావాలుకూడ గోచరిస్తాయి. సనాతనధర్మంలో అంతర్గతమై వున్న త్యాగశీలత కూడా భావానంద్‌లో కనిపిస్తుంది.

భావానంద్ మఠస్థాపన వ్యావహారికానికి భిన్నంగాకాక, సంఘప్రగతికి కృషి చేసే ఒక వ్యక్తి భావాలకి అనుగుణంగా వుంటుంది. హరిభావూ ప్రియతమ మిత్రుడు శ్రీ గోపాలకృష్ణ గోఖలే కల్పనకి అనుసారంగా - 'భారత్ సేవక్ సమాజ్' స్థాపన జరిగింది. ఈ మఠ స్థాపనలో రాజకీయ, సాంఘిక భావ విప్లవానికి ప్రయత్నం జరిగింది. ఇవే భావాలు భావానంద్ మఠ స్థాపన వెనుకకూడా వున్నాయి. సాహిత్యకారుడు యుగద్రష్ట కాగలడన్న వాస్తవాన్ని హరిభావూ భావాల్లో చూడవచ్చు. హరిభావూ యదార్థవాదం ఆదర్శం, సామాజిక లక్ష్యాల సహాయంతో సాగుతుంది.

ఆదర్శవాదంతోపాటు నవలని కళాత్మకంగా రూపొందించాలన్న విషయాన్ని కూడా హరిభావూ విస్మరించలేదు. ఏవో కొన్ని జీవిత సమస్యల్ని చూపడం కాక, జీవితాన్నే యథాతథంగా చిత్రించడం హరిభావూ రచనల్లోని ప్రత్యేకత. ఆయన నవలల్లోని పాత్రలసంఖ్య సామాన్యంగా హెచ్చుగా వుంటుంది. ఉదాహరణకి 'పణ్ లక్షాత్ కోణ్ ఘేతో' నవలలో మొత్తం యాభైవొక్క పాత్రలున్నాయి. 'మీ' నవలలోమొత్తం పదిహేడు పాత్రలున్నాయి. ఈ నవలలో హరిభావూ అతి సహజమైన వాతావరణాన్ని చిత్రించాడు. అన్ని పాత్రలపట్లా ఆదరం చూపించాడు.

భావానంద్ వ్యక్తిత్వంలో స్వాభావికత గోచరిస్తుంది. భావానంద్ చిన్నతనం నుంచీ - అంటే అతన్ని అందరూ 'భావూ' అని పిలిచే సమయంనుంచీ చివరివరకూ జీవనపటాన్ని విస్తృతంగా చిత్రీకరించడం జరిగింది. ఆచిత్రంలో మారుతున్న భారతదేశ పరిస్థితుల చిత్రణకూడా మిళితమై వుంటుంది.

ఆంగ్లేయుల పాలనవల్ల భారతదేశం తన జాతీయతని దాదాపు పూర్తిగా

మర్చిపోయిన రోజులవి. అలాంటి సమయంలో భావానంద్ దేశభక్తి స్వాతంత్ర్య భావాలతో సంసారసుఖాన్ని త్యజించి తన జీవితాన్ని దేశంకోసం అర్పిస్తాడు. రావుగారిలాంటి ఎందుకూ కొరగాని వ్యక్తుల్ని కూడ ఈనవలలో పరిచయం చెయ్యడం జరిగింది. భావూతల్లి తన కూతురిని మధ్యవయసు మనిషికిచ్చి పెళ్ళిచేస్తుంది. శివరామ్‌పంత్ సలహాగనుక ఆవిడ వినివుంటే, భావూ అక్క జీవితమే మరోవిధంగా వుండేది. ఆమె జీవితం ద్వారా పీడిత స్త్రీజన జీవనాన్ని చిత్రించడం జరిగింది. ఆ తర్వాత హరిభావూ ఆపాత్రని – సంఘసంస్కరణ కోసం కృషిచేసే ఉన్నత స్త్రీమూర్తిగా మలిచాడు.

హరిభావూ ఈ నవలలో శృంగార ప్రణయఘట్టాలు కూడా చొప్పించి వుండవచ్చు. కాని సుందరిపాత్రని నిగ్రహపూర్వకంగా చిత్రించడంతో కథలో స్వాభావికతని సాధించాడు. రెండున్నర మూడు సంవత్సరాల వయసులోనే సుందరి అమాయకంగా, చిలక పలుకులతో భావూని 'పెళ్ళికొడుకా' – అని సంబోధిస్తుంది. అప్పుడే భావూపై ఆమె వ్యక్తిత్వపు ముద్రపడుతుంది.

సుందరి బాల్య చాపల్యాన్ని చక్కనిరీతిలో వర్ణించాడు హరిభావూ. చివరిలో ముగ్ధనాయికగా ఆమెపాత్రని మలిచాడు. గంభీరత, నిగ్రహం, కళాత్మకత, విద్యాభిలాష, హృదయపూర్వకమైన స్నేహం—వీటన్నిటి అపూర్వ సమ్మేళనమే సుందరిపాత్ర.

కొద్ది ఆలస్యమైనందువల్ల–సుందరి, భావూల వివాహం ఆగిపోతుంది. ఈ విషయంలో నిగ్రహానికున్న ప్రాధాన్యతని హరిభావూ చూపించాడు. అనుకూల పరిస్థితులున్నాకూడ శివరామ్‌పంత్ సుందరిని సంఘ సంస్కర్తగా మార్చలేకపోయాడు. కాని సుందరి సాన్నిధ్యంలో భావూఅక్క సంఘసంస్కరణ కృషి ఎక్కువగా చెయ్యసాగింది. సుందరిని వివాహం చేసుకోకుండా భావానంద్ సన్యాసాన్ని స్వీకరిస్తాడు. ఇది అతని వ్యక్తిత్వపు ఔన్నత్యానికి మరో రూపం. భావానంద్ ఆదర్శవాదంలో మానవతావాదం మిళితమైవుంది. కరుణ, ప్రేమ ఇవన్నీ అతని సహజగుణాలు. అమ్మ; అమ్మమ్మ; అక్కల జీవితాలో పరిస్థితుల కనుగుణంగా పరివర్తనలు జరుగుతూ వుంటాయి. అలాంటి వారి సాన్నిధ్యంలో, అన్ని బాధలూ భరించి భావూ పెద్దవాడవుతాడు; చదువుకుంటాడు;

వకీలవుతాడు.

శివరామ్‌పంత్ అతని మార్గదర్శకుడు. సుందరి అతని ఆదర్శవంతమైన జీవితానికి ప్రేరణకలిగిస్తుంది. భావూనుంచి భావానంద్‌గా మారుతూ అతని జీవిత చిత్రపటమంతా అతి సుందరంగా గోచరిస్తుంది.

భావానంద్ ఆకస్మిక మరణంవల్ల ఈ నవలకి సహజత్వం సిదిస్తుంది. ఎక్కువగా ఆలోచించి, ఏకాకిగా నిరంతరం నిర్విరామంగా పరిశ్రమించే వ్యక్తి ఆ విధంగా మరణించడం సహజమే. భావానంద్ ఒక అసాధారణవ్యక్తి. చివర్లో రామానంద్ భావానంద్ కథ చెప్పేటప్పుడు ఆయనలోవున్న అలౌకిక శక్తుల్ని వివరిస్తాడు. భావానంద్ ఆదర్శాన్నీ, అతని దృక్పథాన్నీ అత్యంత కళాత్మకమైన రీతిలో రచయిత చిత్రించాడు.

మారుతున్న కాలాన్నిబట్టి, మారుతున్న జీవనరూపాల్నీ, సమస్యల్నీ చిత్రించడంలో ఒక నూతన శైలిని రచయిత ఈ నవలలో అనుసరించాడు. నవల యొక్క ఔన్నత్యంతోపాటు, పాఠకుల మానసోల్లాసాన్ని కూడా హరిభావూ దృష్టిలో వుంచుకున్నాడు. సంభాషణల్లో, వ్యాఖ్యానంలో కొత్తరీతుల్ని ప్రవేశ పెట్టాడు.

హరిభావూ నవలల్లో అక్కడక్కడా కొన్ని అసాధారణ సంఘటనలు కనిపిస్తూవుంటాయి. ఈ నవలలో కవరుయొక్క రహస్యం ఒక అసహజ విషయంగా పేర్కొనవచ్చు. అక్కడక్కడా వర్ణనల్లో కొంత విసుగుకలిగించే దోషంకూడా కనబడుతుంది. కాని ఇది చాలాతక్కువ. కథనంలోనూ పాత్ర చిత్రణలోనూ సహజత్వాన్ని చూపడం హరిభావూ రచనల్లోని విశిష్టలక్షణం.

అద్భుతమైన వాతావరణం నుంచి యదార్థ వాతావరణం వరకూ విస్తృతంగా జీవితాన్ని చిత్రించడం, పకడ్బందీగా నడిచే కథద్వారా జీవితాన్ని చిత్రించడం; జీవితాన్ని సమగ్రంగా పరిశీలించే ప్రయత్నం — ఇవన్నీ హరిభావూ నవలల్లో మనకి గోచరిస్తాయి.

—అనంత్ కాణేకర్.

# తాళం వేసిన తలుపు

నేనెవర్ని ? ఈ ప్రశ్నకి జవాబివ్వడానిగ్గాను— నా ఆత్మకథ పూర్తిగా రాయాలని నాలో నేను నిర్ణయించుకున్నాను. నా ఆత్మకథ వినేవాళ్ళకి నా మనవి ఏమిటంటే ఇలాంటి ప్రశ్నలడిగి నాకు కోపం తెప్పించవద్దు. గొప్పవాళ్ళకే ఆత్మకథ లుంటాయి ; అవే రాయడం జరుగుతుందీ అంటారు. కులంవల్ల, గోత్రం వల్ల, పరోపకారంవల్ల, దేశసేవ ద్వారా గొప్పవాళ్ళవుతుంటారు వ్యక్తులు. లేదా దురాచారాలవల్లా దుష్కృత్యాలవల్లా చెడ్డపేరు తెచ్చుకోవడం ద్వారా కూడ గొప్పవాళ్ళవుతారు. ఆ లెక్కన చూస్తే—నేను కులంవల్లా గోత్రం వల్లా గొప్పవాడిని కాదు. శీలంవల్లనైనా నేను గొప్పవాడినవునో కాదో నాకు తెలీదు. అందువల్ల నా జీవిత చరిత్ర ఆత్మకథగా రాసుకోవడానికి అర్హమైనో కాదో కూడా నాకు తెలీదు. నేనీ రకంగా ఇప్పట్నించే మీ కన్ని విషయాలూ చెప్పేయ్యటం మంచిదికాదు. గారడీలో వున్న రహస్యం ముందే తెలిసిపోతే, ఇక ప్రేక్షకులకి అందులో ఆసక్తి ఏముంటుంది ? అదే విధంగా నేను ముందే మీ కన్నీ చెప్పేస్తే నా యీ ఆత్మకథ కూడ చప్పబడిపోతుంది. అంచేత, నేను దేశసేవ చేశానా లేదా, పరోపకారం చేశానా లేదా ; అసలేదీచెయ్యలేదా— యిలాంటి విషయాలన్నీ ముందే మీతో చెప్పదల్చుకోలేదు.

తాళం వేసిన పెట్టె ఖరీదు లక్షన్నర అంటారు. అందుకే, నేనీ ఆత్మ కథ ఎందుకు రాస్తున్నానో మీతో చెప్పదల్చుకోలేదు. ఈ కథ చదివాక— నన్ను పెద్దవాడన్నా, చిన్నవాడన్నా నే నేమీ పట్టించుకోను. నావల్లగాని, నాకు సంబంధించిన వాళ్ళవల్లగాని జరిగిన మంచి, చెడ్డపనులేవైతే వున్నాయో, అవన్నీ వున్నదున్నట్టుగా రాయడమే ఈ కథారచనలో నా కర్తవ్యం. ఈ కర్త వ్యాన్ని సక్రమంగా నిర్వహిస్తాను; మీరు నన్ను పొగిడినా తిట్టినాకూడ నేనేమీ పట్టించుకోను.

ఎనిమిదేళ్లు వచ్చేదాకా నా బాల్యం ఎట్లా గడిచిందో, నాకు గుర్తులేదు. కొన్ని కొన్ని విషయాలు మాత్రం అస్పష్టంగా గుర్తున్నాయి. అయితే నాకు గుర్తున్న

విషయాలు సరిగ్గా అలాగే జరిగాయో, వాటిలో ఏమైనా కల్పన కలిసిందో, అది మాత్రం నేను చెప్పలేను. ఈ రకంగా వూరికే వాగటంవల్ల లాభం మాత్రం ఏముంటుంది ? అన్నిటికంటే పాతజ్ఞాపకంతో నా యీ ఆత్మకథ ప్రారంభిస్తాను. నేను యితరులనుంచి విన్నవిషయాలే మీ కిప్పుడు చెబుతాను.

నేనొకరోజు ఎక్కణ్నించో—ముసలిదానితో కలిసి ప్రయాణంచేసి బోరీ బందర్ స్టేషన్ కొచ్చాను. నాకా సంగతి జ్ఞాపక మొస్తోంది. అప్పుడు బోరీ బందర్ స్టేషన్ ఇప్పుడున్నట్టుగా వుండేదికాదు. ఆ రోజుల్లో పొడుగ్గా కొయ్య ప్లాట్‌ఫార మొకటి వుండేది. ఆ ప్లాట్‌ఫారానికి కొన్ని చేలచోట్ల చిల్లులు పడివున్నాయి. మేము ప్లాట్‌ఫారానికి అవతలప్రక్క దిగి, టికెట్ యిచ్చి బయటికి వెళ్ళటానిగ్గాను మరోవైపుగా వెళుతున్నాము. మాతోపాటు ఇంకో వ్యక్తి వున్నాడు. బాగా నల్లగా వున్నాడు. ఎంత నల్లగా వున్నాడంటే— అతను తొడుక్కున్న నల్లచొక్కాకంటే, అతనే నల్లగావున్నాడు. మాతోపాటు ఒక యువతికూడా వుంది. నేనా ముసలమ్మ చెయ్యి పట్టుకుని—అటూయిటూ తిరుగుతున్న పాశ్చాత్య స్త్రీలనుచూస్తూ నడుస్తున్నాను. వెనక్కి వెనక్కి తిరిగి ఆ స్త్రీలు తొడుక్కున్న గౌన్లు చూస్తూ నడుస్తున్నాను. ఇంతలో ఆ నల్లటి వ్యక్తి, ముసలమ్మవేపు తిరిగి—"రావుగారు ఆశ్చర్యపోతారు; 'మావాళ్ళని ఇంత త్వరగా తీసుకురావటానికి వీల్లేదు'—అంటూ వుండేవారు; ఇవ్వాళ మనం వెళ్ళి ఆయనముందు ప్రత్యక్షమయ్యేసరికి, మనల్నిచూసి ఆయన చాలా ఆశ్చర్య పోతాడు !" అన్నాడు.

"ఎందుకాశ్చర్యపోతాడు ? ఇప్పటికి ఆరేళ్ళయింది; ఏడు సంవత్సరాలుకూడా అయిందేమో; ఈయనగారు దాన్ని తలవనుకూడాతలవడు; ఒకవుత్తరంముక్క యినా రాయడు; మేమంత పాపం ఏమిచేశాం ? అదేమైనా హత్యచేసిందా ? ఏడేళ్లయింది—ఒక వుత్తరమైనా రాశాడా? ఇక్కణ్ణించి దాదాపు వంద వుత్తరాలు వెళ్ళాయి; అన్నిటికీ ఒకటేజవాబు— 'నేనక్కడికి త్వరలో వస్తాను; నాపని.... పూర్తికావచ్చింది. ' – ఇంతే." – ముసలమ్మ యింకేదో చెప్పబోయేలోగా – "పోనివ్వండి; ఇప్పుడెలాగూ రానేవచ్చారుగా? కుర్రాణ్ణి తీసుకొచ్చారు; అమ్మా యిని తీసుకొచ్చారు; అందర్నీచూస్తే ఆయనకికూడ ప్రేమ కలుగుతుంది;

మళ్ళీ...."—ఆ నల్లటివ్యక్తి చెబుతున్నదింకా పూర్తికాకముందే మేం టికెట్లిచ్చే స్థలానికి వచ్చాం.

టికెట్లు తీసుకునే తెల్లదొర–'టికెట్ చూపించు'– అని భుజం పట్టుకుని వూపే దాకా, ఆసంగతే మర్చిపోయి, అతను మాట్లాడుతూనే వున్నాడు. టికెట్ గనుక అడక్కపోతే, అలాగే ముందుకెళ్ళిపోయేవాడేమో! టిక్కెట్లు యిచ్చేసి ముందుకొచ్చాక – ఆనల్లటివ్యక్తి "ఈ తెల్లదొరల కెంతపొగరు! అసలు మానవత్వమనేదే వుండదు!" అన్నాడు ముసలమ్మతో. అందుకంగీకారసూచకంగా ముసలమ్మ తల వూపింది. స్టేషన్ పాతమెట్లు దిగి మేమికిందికొచ్చాం. నేను వేలు చీకుతూవున్నాను. స్టేషన్ బయటవున్న బగ్గీలు, మనుష్యుల గుంపూచూసి నేను ఆశ్చర్యపోయాను; అటూ యిటూ దిక్కులుచూస్తూ నిలబడ్డాను; ఇంతలో నాచేతిమీద ఫెళ్ళుమని ఒకదెబ్బ పడింది! ఎంతదెబ్బ తగిలిందో, దెబ్బతిన్న చేతికీ, దెబ్బకొట్టిన చేతికీ మాత్రమే తెలియాలి! కేవలం దెబ్బే కాదు, దానితో పాటు తిట్లుకూడా తగిలాయి – "వెధవా! వేలు చీకవద్దని ఎన్నిసార్లు చెప్పాను! పుట్టిన దగ్గర్నుంచీ నీ దరిద్రపు లక్షణాలు తెలుస్తూనే వున్నాయ్!" – అమితమైన కోపంతో తిట్టిన యిలాంటి మాటలు కూడ నాచెవిన పడ్డాయి. ఆ యువతే అలాతిట్టింది. కొట్టేప్పుడూ తిట్టేప్పుడూ కూడ – కోపంతోనూ మనసులోవున్న బాధతోనూ ఆమె మొహం విలక్షణంగా కనిపించింది. దెబ్బతగలగానే నేను బావురుమన్నాను. నాలేత చేతిమీద దెబ్బ బాగా తగిలింది. బాగా బాధగావుంది. అందుకే ఏడుపు మొదలెట్టాను. అప్పటిదాకా బొంబాయి జనాన్ని చూడ్డంలో నిమగ్నురాలైవున్న ముసలమ్మ ఆ యువతివేపు తిరిగి – "ఏమిటే అది? జాలీ గీలీ ఏమీలేదా? ఆ చిన్న సన్యాసి నిన్నేం చేశాడని, వాణ్ణి అంత పెద్దదెబ్బ కొట్టావ్"?– అంది.

"ఆ వెధవని అలాగే కొట్టాలి; ఆ దౌర్భాగ్యుడు పుట్టింది మొదలు యిప్పటిదాకా ఒక్కరోజు కూడా సుఖమనేది ఎరగను; దౌర్భాగ్యపు వెధవ!" – అంటూ మరోదెబ్బ కొట్టడానికి ఆయువతి చెయ్యెత్తింది. ముసలమ్మ ఆయువతి చెయ్యి విసిరికొట్టి, నన్నెత్తుకుని – "ఒసే, పాపిష్టిదానా! అట్లా అనే దానివి ఎందుకు కన్నావే! అస్తమానం వాణ్ణి తిడతావెందుకు? వాడి తప్పేముంది? నీరాత

అటువంటిది!''— అంది.

ఆ యువతి ఎవరో యిప్పుడింకా ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదనుకుంటాను. ముసలమ్మ అన్నమాటలు విని ఆమె యింకేదో అనబోయింది గాని, యింతలో ఎద్దుబండి మాట్లాడ్డానికి వెళ్ళిన ఆ నల్లటివ్యక్తి అక్కడికొచ్చాడు. ''ఆఁ ఆఁ రండి? బండి మాట్లాడుకొచ్చాను; లోపలికెక్కి కూర్చోండి!'' —అన్నాడు. ''మనం అకస్మాత్తుగా అక్కడికి వెళ్ళేసరికి, మనల్నిచూసి రావుగారు ఏమనుకుంటారో అన్నఆలోచన వచ్చేసరికి నాకు ఆనందంగా వుంది; ఏంచెయ్యమంటారు మామ్మగారూ, నేనింతపట్టుపట్టేవాణ్ణి కాదు; కాని ఆయన స్థితికూడ చూడలేం; అందుకే మీవూరొచ్చి, అన్నివిషయాలూ మాట్లాడి మిమ్మల్ని వెంటబెట్టుకు రావచ్చని వచ్చాను; నా స్నేహధర్మం నేను నిర్వర్తించాలి కదా! చూడండి వారంరోజుల్లో పరిస్థితులన్నీ ఎంతచక్కబడతాయో?'' అమ్మనీ, ముసలమ్మనీ బండెక్కిస్తూ ఆయన ఈ మాటలన్నీ చెబుతున్నాడు. ఆ తర్వాత నన్నెత్తుకుని, బండిలో వాళ్ళిద్దరి మధ్యాకూర్చోబెడుతూ – 'ఎంతఅందమైన కుర్రాడు! నాకీ అబ్బాయంటే ఎంతో ముచ్చట'— అన్నాడు. ఆయన బండి ముందుకెళ్ళి కూర్చున్నాడు. బండివాడు తన రెండు కాళ్ళతోనూ ఎద్దుల్నిపొడిచి, ఎద్దుల తోకలు మెలిపెట్టి, కంచీతో చరిచి బండి బయల్దేరతీశాడు. ఎడ్లు నడుస్తూంటే వాటి మెళ్ళోవున్న మువ్వలు మ్రోగుతున్నాయి; ఆ శబ్దానికి లయవేస్తున్నట్టుగా ఎడ్లు ముందుకు సాగుతున్నాయి. చాలా సేపటివరకూ ఎవరూ ఏమీ మాట్లాడలేదు. అందరూ ఒకరినొకరిచూస్తున్నారు. నేనుమాత్రం అటూయిటూ దిక్కులు చూస్తున్నాను. ఆ వ్యక్తి ముందుకి చూస్తున్నాడు. తర్వాత అమ్మమ్మ ఒంకతిరిగి— ''ఈమధ్య రావుగారి ప్రవర్తనలో బాగామార్పు వచ్చింది; మళ్ళీ సంసారంవేపు మనసు మళ్ళిందంటే, అంతా మర్చిపోతాడనే నా నమ్మకం''—అన్నాడు.

''ఏం సంసారం? ఆయన చెయ్యని పనుందా? తన చేతులతో తాను సంసారం పాడుచేసుకున్నాడు; ఎవరేం చేస్తారు? ఉద్యోగమెంత మంచి వుద్యోగం! తనకి....''అంది ముసలమ్మ.

''మంచి తెలివైనవాడు; ఆయనకి వుద్యోగం ఎక్కడైనా దొరుకుతుంది;

ఆయన అనుకోవాలేగాని నాలుగు రోజుల్లో ఉద్యోగం దొరుకుతుంది. కాని... "

"ఆఁ అదే వచ్చింది చిక్కు .. "

"కాని. మనిషి ఎలాంటివాడు! ఎందుకులెండి, అవన్నీ అడగొద్దు."

''మా మిత్రబృందంలో ఆయన స్థితిచూసి విచారించని వాళ్లంటూ ఎవరూ లేరు. ఉద్యోగం యిప్పిస్తామని ఆయనవెంట ఎంతమంది పడ్డారు! 'ఆ ఒక్క విషయమూ వదిలేసి యింకేమైనా చెప్పండి'- అంటారు!''.

''ఆఁ అదే అసలు విషయం! మేము మరోమాట అనం. కాని యిది మాయింట్లో ఎన్నాళ్లని కూర్చుంటుంది? మీరే చెప్పండి! దాని మనసు ఎలా వుంటుంది? అన్నం నీళ్ళూ అన్నీమానేసి ఎప్పుడూ కుళ్లుతూనే వుంటుంది; ఏ చేస్తుంది పాపం?''

''నిజమే, నిజమే! ఇంకేంచేస్తుంది పాపం? కాని యిప్పుడింక మీరు బాధ పడాల్సిన అవసరం లేదు. మళ్లీ మొదటిలా సంసారం బాగుపడే ఏర్పాట్లన్నీ నేను చేస్తానుగదా! ఆయన పరిస్థితి పూర్తిగామార్చి, బాగుపరచాలని మేమంతా నిర్ణయించుకున్నాం. అదికాదమ్మా! ఎవడైనా మూర్ఖుడూ, దుర్మార్గుడూ, మోసగాడూ అయితే అలాంటి వాళ్ల సంగతి వేరు ! కాని ఈయన ఎలాంటి మనిషి! ఆయనలాంటి మనిషి లక్షకొకడు వుంటాడు! ఎక్కడ వెదికినా అలాంటి మనిషి దొరకడు ! ఎంత బుద్ధిమంతుడు ! ఎంత స్నేహశీలి ! పనిచెయ్యాలంటే ఎంత ఉత్సాహం ! ఇన్ని మంచిగుణాలున్న వ్యక్తికి వున్నట్టుండి ఏమి జరిగిందో ఏమిటో ? ఆయన మనసులో ఏమిబుద్ధిపుట్టిందో ఏమో ! .... సరే, పోనివ్వండి. అయిపోయినదాన్ని గురించి అనుకోవడమెందుకు ? ముందు జరగవలసినదాన్ని గురించి ఆలోచించాలి.. ''

ఆయన రావుగారి గురించి మాట్లాడుతున్న కొద్దీ మాఅమ్మ మనసులో బాధ పెరిగిపోతోంది. పాత జ్ఞాపకాలు వస్తున్నాయో ఏమిటో! అమ్మమ్మ కూడ మధ్యమధ్యలో బరువుగా నిట్టూర్పులు విడుస్తోంది. కాని ఏమీ మాట్లాడ్డంలేదు. ఆనల్లటాయన అలామాట్లాడుతూనే వున్నాడు. మధ్యమధ్యలో ఆగి- ''ఈమేడ చూడండి.. దీనికి లక్ష రూపాయలు ఖర్చయింది .. '' ఇలాంటి మాటలు చెబు

తున్నాడు. అప్పుడప్పుడూ దాని ధరయింత, దీని ధరయింత అనికూడ చెబు తున్నాడు. మళ్లీ చివరికి రావుగారి గురించే మాట్లాడుతున్నాడు. ఎడ్ల మువ్వల సవ్వడిలో నేను కునికిపాట్లు పడుతున్నాను. ఇంతలో ఆయన మళ్లీ ప్రారంభిం చాడు— "ఈ మధ్యనే, పదిపదిహేను రోజుల క్రితమే, ఒకనాడు రావుగారు మాయింటి కొచ్చారు. అప్పుడు నేను మా అమ్మతో మాఅబ్బాయి ఉపనయనం గురించి మాట్లాడుతున్నాను. ఎప్పుడుచెయ్యాలి? ఎలా చెయ్యాలి? అన్న విష యాల గురించి మాట్లాడుతున్నాం. మా అమ్మ రావుగారి నడిగింది—

"మీఅబ్బాయికి కూడ ఉపనయనం చెయ్యాల్సిన వయసు వచ్చేవుంటుంది గదా; తీసుకొచ్చి ఉపనయనం జరిపించండి"— అని. రావుగారు—"కొద్దిరోజులు ఆ విషయాలేమీ మాట్లాడకండి. నా గ్రహస్థితి బాగుండలేదు. నా శని కాలం కొద్దిరోజులేవుంది. ఇది అయిపోనివ్వండి. నాకు పది పన్నెండు వేలు డబ్బుకూడ రావాల్సివుంది. నేను వూరికే పనీపాటాలేకుండా కూర్చున్నా ననుకుంటారు మీరు! కాని అది నిజంకాదు. నాగ్రహాలు నాకు కాస్త అను కూలం కానివ్వండి. ఆ తరువాత చూడండి.... అమ్మాయి పెళ్ళి, అబ్బాయికి ఉపనయనం! బొంబాయిలో ఎంత అట్టహాసంగా చేస్తానో చూడండి . !" అన్నారు. మేమంతా నవ్వాం. ఆయన ఉత్సాహం మెచ్చుకోదగింది...." అన్నాడు నల్లటాయన.

"ఒక్కసారి పది వేలు ఎక్కణ్ణించి వస్తాయ్? ఎట్లావస్తాయ్?"—అని అడిగి, సమాధానం కోసం నల్లటాయనవేపు చూసింది అమ్మమ్మ. ఆయన చిన్నగా నవ్వి—"మేమూ అదే అడిగాం; కాని మాకు జవాబు రాలేదు.. !" అన్నాడు.

నా ఉపనయం ఎంత అట్టహాసంగా జరుగుతుందో అన్న విషయం గుఱించి నేను కలలుకనటం ప్రారంభించాను. బొంబాయి నేను చూడ్డం అదేమొదటిసారి గనుక బొంబాయిలో గ్యాసులైట్లు ఎలావుంటాయో నాకుతెలియదు; కాని నేను మావూళ్ళో జరిగిన ఉపనయనాలు చూశాను. ఆ రకంగానే నా ఉపనయనాన్ని కూడ వూహించుకున్నాను.

ఇంతలో మా బండి ఒక పెద్ద మూడంతస్తుల మేడ ముందొచ్చి ఆగింది.

ఆ మేడ రైలుబండిలా పొడుగ్గా వుంది. అందులో వుంటున్నవాళ్లు కూడా వింతగా గొప్పగా కనిపించారు. అంత పొడుగ్గా వున్న మేడ నేనంతకు ముందెన్నడూ చూడలేదు. అందువల్ల రెప్పవెయ్యకుండా అలాగే చూస్తూవుండి పోయాను. అంతా బండిలోనుంచి దిగారు. ఆ నల్లటాయన నన్ను బండిలో నుంచి ఎప్పుడు కిందికి దింపాడోకూడ నాకు గుర్తులేదు; అంతగా ఆ మేడ చూడంలో లీనమైపోయాను. ఆనల్లటాయన నాచెయ్యిపుచ్చుకొని "రా,బాబూ! రా! మీనాన్నగారి దగ్గరకెళ్లాంరా! మీరిద్దరూ ఇప్పటిదాకా ఒకరినొకరు చూళ్లేదుగా"? అంటూ నన్నుఆమేడలోకి తీసుకెళ్ళాడు. మావెనక అమ్మాఅమ్మమ్మా కూడ, మూటాముల్లే పట్టుకుని వచ్చారు. కొయ్యమెట్లెక్కి పైకి వెళ్లాం. ఆ మేడ మొదటి అంతస్తు ఎలావుందో, రెండోదీ మూడోదీకూడ అలాగేవున్నాయి. అసలింక పైకి రాలేదేమో అనిపించింది నాకు. మూడో అంతస్తుమీదికిరాగానే ఆనల్లటాయన నవ్వుతూ-"రావుగారూ! ఏమండోయ్ రావుగారూ? మీ వాళ్లొచ్చారు, మీవాళ్ళు! ఇదుగో చూడండి మీ చిరంజీవి !"— అంటూ బిగ్గరగా పిలిచాడు. కాని రావుగారినుండి జవాబురాలేదు. మేంనిలబడ్డచోటికి ఎదురుగా కనబడుతున్న తలుపుకి తాళంవేసివుంది ! ఆనల్లటాయన అదిచూసి, ఆశ్చర్యపోతూ "అరె! ఇదేమిటి! తాళంవేసివుందే! ..తాళంవేసి ఎక్కడికన్నావెళ్లారా .." అన్నాడు.ఇంతలో అమ్మమ్మ,అమ్మాకూడ వచ్చారు. ఆయనకొంచెం సిగ్గుపడుతూ "రావుగారు బయటికెక్కడికో వెళ్లినట్టున్నారు; కాస్సేపట్లో వస్తారు; అందాకా మాయింట్లో కెళ్దాం పదండి !" అన్నాడు. ఇంతలో ముగ్గురు నలుగురు పిల్లలు 'నాన్నా, నాన్నా!' — అంటూ అరుస్తూవచ్చి ఆయన్ని చుట్టుకున్నారు. ఆయనకూడ పిల్లల్ని పలకరించాడు. ఆపిల్లల ఆనందమూ ఆతండ్రిప్రేమా చూసి — 'నేనుకూడ రావుగార్ని ఇలాగే చుట్టుకొని ఆనందిస్తాను'— అని వూహించుకున్నాను. ఆయనకి నన్నుచూడగానే ప్రేమకలుగుతుంది; నన్నుఎత్తుకుంటారు; ముద్దాడుతారు. ! కాని — రావుగారిని నేను చూళ్ళేదు. చుట్టుప్రక్కల వున్నవాళ్ళ ప్రోత్సాహంవల్లా, ఆయన ప్రేమగా పిలిస్తేనూ ఆ సమయంలో ఆయన దగ్గరకి వెళ్ళివుండేవాణ్ణేమో ! కాని రావుగారి గదికి తాళం వేసివుంది ! ఎక్కడికెళ్ళారో, ఏమో !

రావుగారి గదికి తాళం వేసి వుండటం తాతగారికి – అదే, ఆనల్లటాయనకి చాలానిరాశ కలిగించింది. అమ్మకీ అమ్మమ్మకీ మరీనూ. ముఖ్యంగా అమ్మ పరిస్థితి మరీ దయనీయంగా వుంది. పొంగివచ్చే కన్నీళ్ళని బలవంతంగా ఆపుకుంటోంది. ఆ సమయంలో అమ్మ మొహం ఎలావుందీ అన్న విషయం నాకు మాటిమాటికీ తలపుకి వస్తుంది.

తాతగారు పిలిచిన మీదట అంతా ఆయన యింట్లోకి వెళ్లాం. అంతకంటే ఏం చేస్తాం ? కాని నా మనసుమాత్రం రావుగారి గదిమీదే వుంది. అంతా ఆయన కోసమే ఎదురు చూస్తున్నారు. భోజనాలు పూర్తయినాయి. ముందూ వెనకా చూడకుండా నేను కడుపునిండా తిన్నాను. అమ్మ అసలు తిననేలేదు. అమ్మమ్మకూడ యించుమించు అదే పరిస్థితిలోవుంది. ప్రయాణపు బడలికవల్ల నాకు నిద్ర ముంచుకొచ్చింది. అలాగే పడుకుని, వొళ్లు మరిచి నిద్రపోయాను. ఎక్కడ పడుకున్నానూ, ఎప్పుడు పడుకున్నానూ అనేదికూడ నాకు గుర్తులేదు. ఆ నిద్రలో నాకు తియ్యటి కలలుకూడ వచ్చాయ్! కాని–ఆకలల్లో కొన్ని పీడ కలలు కూడ వున్నాయేమో గుర్తులేదు. బహుశా రావుగారిని చూసివుంటాను– కలలో చూసివుంటాను!

తెల్లవారుఝామున నాకు కాస్త మెళుకువ వచ్చింది. రోజులాగే అమ్మమ్మ పక్కలోనే పడుకున్నానా లేదా అని చేత్తో అటూఇటూ తడిమిచూశాను. ఇంట్లో లేను; బొంబాయిలో రైలుపెట్టెలా పొడుగ్గావున్న మూడంతస్తుల మేడలో యింకెవరి యింట్లోనో పడుకున్నాను అన్నగుర్తే నాకులేదు. చేతికి ఎటుచూసినా నేల తగిలింది. నా కిందకూడా నేలే ! ఒక్కసారిగా – 'అమ్మా ..అమ్మా' అంటూ ఏడవటం ప్రారంభించాను. ఇంతలో నాకు ఎవరివో మాటలు వినిపించాయ్–"ఆయన ఎందుకొస్తారు? ఆయన రారు! ఇక నా జన్మంతాయింతే... "

మాటలు వినపడటంతోనే నేను నోరు మూసుకున్నాను. నా ఏడుపు ఎక్కడికో ఎగిరిపోయింది. అమ్మమ్మ అమ్మని వోదార్చటానికి ప్రయత్నిస్తోంది. కాని – అమ్మ మాటిమాటికీ అవే మాటలు అంటూ ఏడుస్తోంది. నా ఏడుపైతే పోయిందిగాని– పక్కన ఎవరూలేరు; కిందనేల చలిచలిగా వుంది; చిన్నవాణ్ణి; ఎంతసేపని అలా వుండగలను? అమ్మ అంటే నాకు భయం. అందుకని

అమ్మమ్మని బిగ్గరగా పిలిచాను. నామాట వినటంతోటే, అమ్మా, అమ్మమ్మా యిద్దరూ వొకేసారి— ''ఈ పిల్లాడు నిద్రలోనే కిందికి ఎటా వెళతాడో! ఛీ, ఛీ! ఏంపాడు అలవాటు! ఎక్కడున్నావురా ?''— అన్నారు.

"దరిద్రపు వెధవ ! ఒక్కక్షణం పరుపు మీద నిలకడగా వుండే వొట్టు !" "పిల్లాడు కాస్త నేలమీదకి జరిగితే యింతలో ఏంపోయింది ? ఎందుకట్లా అరుస్తావ్ ! ఎక్కడున్నాడో చూసి తీసుకురా...." ఈ మాటలు ఎవరెవరివో నేను ప్రత్యేకంగా పాఠకులకి చెప్పనక్కర్లేదనుకుంటాను. తరువాత మళ్ళీ అమ్మమ్మే అంది—"అస్తమానం వాణ్ణి ఏదో ఒకటి అంటూనే వుంటావ్ ; ఎవరన్నా వింటే వాడు నీ కొడుకనుకోరు ; సవతి కొడుకనుకుంటారు ! ఈ మధ్య మరీ నీకు...." అమ్మమ్మ మాట పూర్తికాకముందే, నేను మెల్లిగా ఆ మాట అలికిడిని పట్టి, ఆమె పక్కలోకి చేరాను. నేను పొరపాటున అమ్మ పక్కలోకి వెళతానేమోనని భయపడ్డాను. అమ్మ పక్కలోకి గనక వెళ్ళి వుంటే నాకేమి బహుమానం లభించివుండేదో చెప్పలేను. కాని — భగవంతుడికి కూడ నా మీద దయవుంది. నేను అమ్మ పక్కలోకి వెళ్ళలేదు.

అమ్మా, అమ్మమ్మా మట్లాడుకుంటూనే వున్నారు. నేను మళ్ళీ నిద్ర పోయాను. నేను కళ్ళు విప్పేసరికి బాగా పొద్దెక్కింది. ఆ వేళ తాతగారు చాలాచోట్ల తిరిగి రావుగారి కోసం వెదికారు. కాని రావు గారెక్కడా కనబడలేదు. 'ఇప్పుడు వస్తారు; కాస్సేపట్లో తప్పకుండావస్తారు; మధ్యాహ్నానికి వస్తారు; సాయంత్రానికి వస్తారు'—ఇలా ఎదురుచూస్తుండగానే సాయంత్రమై పోయింది. కానీ రావు గారు రాలేదు. ఆయన గదితలుపుకి తాళం వేసే వుంది. నేను ఆవేళ వుదయం భోజనంచేశాక వెళ్ళి—రావుగారి తలుపు ముందే కూర్చున్నాను. రోజంతా ఆ తలుపులవంకా తాళంవంకా చూస్తూ కూర్చోవడం తప్ప మరోపని లేదు. అటూయిటూ తిరగడం; వెళ్ళి తాళం వేపు చూడ్డం; తాతగారి పిల్లల కళ్ళు కప్పి పరుగెత్తుకు రావడం; తాళం వంక చూడ్డం—ఇదే పని. పిల్లి పాలగిన్నె వంక చూసినట్టే చూచిచూచి రావు గారు యిక రారేమోనని కాస్సేపు చూడకపోవటం; ఆ కాస్సేపట్లోనే వచ్చా రేమోనని మళ్ళీచూడ్డం! రోజంతా యిలాగే గడిచి పోయింది. రెండు రోజులు

గడిచాయి. మూడో రోజుకూడ అలాగే గడిచింది. నాలుగో రోజుకూడా వెళ్ళిపోయింది. రావుగారెక్కడా అంతులేరు. 'బహుశా' పెళ్ళాం బిడ్డలు గుర్తొచ్చి — అనుకోకుండా వూరికెళ్ళారేమో' — అన్న ఆలోచన వచ్చింది అమ్మమ్మకి. ఇంటికి ఉత్తరం రాసింది. 'ఇక్కడికి రాలేదు'— అని వూరి నుంచి సమాధానం కూడా వచ్చింది. ఆ ఉత్తరం చూసి అందరికీ నిరాశ కలిగింది. అమ్మవొంటరిగా వుంటే చాలు, ఏడుస్తోంది. నలుగురిలో కూర్చున్నప్పుడుకూడా ఒక్కమాటకూడా మాట్లాడేదికాదు.

ఈ రకంగా మరో రెండు రోజులు గడిచిపోయాయి. అమ్మమ్మ తాతగారితో—'ఇంటికెళ్ళిపోతాం '— అంది. కానీ తాతగారందుకు వొప్పుకోలేదు. "నేను మీకు ఇంత నమ్మకంగా చెప్పి మిమ్మల్నిక్కడికి తీసుకొచ్చాను. రావు గారిని మీకు చూపించిన తర్వాత గాని, మిమ్మల్ని వెళ్ళనివ్వను!"—అని పట్టుపట్టాడు. ఆయన మాత్రం ఎన్నాళ్ళని పట్టుబడతాడు? ఏ ఆశతో పట్టుపడతాడు? రావుగారి జాడే లేదాయె. వెళతామన్నప్పుడల్లా — "ఇవ్వాళొక్క రోజూ ఆగండి. పదిమందినీ పదిచోట్లకి పంపాను. వాళ్ళు రావుగారి జాడ తెలుసుకొస్తారు; వాళ్ళ కాయన దొరుకుతారనే నా నమ్మకం; ఇవ్వాళ కూడ కనబడక పోతే వెళ్ళి పోదురుగాని; ఇంకా కనబడకపోతే ఇకముందు ఆశ కూడ లేదు...." అనే వారు తాతగారు. ఈ రకంగా మరో మూడు నాలుగు రోజులు గడిచాయి. మేము అక్కడికివచ్చి అప్పుడే దాదాపు పదిహేను రోజులై పోయింది. కాని రావుగారు మాత్రం రాలేదు. వెంటనే యింటికి వచ్చెయ్యమని తాత దగ్గర్నుంచి రెండు వుత్తరాలొచ్చాయి. చివరికి— ఆమర్నాడు వెళ్ళిపోవాలని నిర్ణయించుకున్నాం.

వెళ్ళిపోదామనుకున్న రోజున అమ్మ మరీ విచారంగా వుంది. నేను అమ్మ దగ్గరకెప్పుడూ వెళ్లనే వెళ్లను. 'రావుగారు రాకపోతే రాకపోయారు; ఆయన తలుపుకున్న తాళమైనా చుద్దాం'— అనుకున్నాన్నేను. తాళం చూస్తూనే రోజంతా గడిపాను. సాయంత్రం నాలుగు గంటలు కావస్తోంది. నలుగురు మనుష్యులు మెట్లెక్కి గబగబా పైకి వచ్చారు. వాళ్లలో ఒకడు నల్లచొక్కా తొడుక్కుని పసుపుపచ్చ తలపాగా చుట్టుకున్నాడు. చేతిలో కఱ్ఱవుంది. మరొ

కడు మార్వాడీ. మరో యిద్దరు మెళ్లో తోలుసంచులు తగిలించుకున్నారు. అంతా సరాసరి నేను కూర్చున్నచోటికి వచ్చి –"రావుగారూ! రావుగారూ!"— అంటూ పిలవడం ప్రారంభించారు. భయపడి అక్కడినుంచి పారిపోవాలో, సంతోషంతో అక్కడే వుండి పోవాలో నా కర్థం కాలేదు. రావుగారు మాకు కనబడకపోతే కనబడక పోయారు; వాళ్లకోసమైనా కనబడతారేమో అన్న ఆశతో అక్కడే వుండిపోయాను. ఆరకంగానైనా రావుగారిని చూడవచ్చుననుకున్నాను.

రావుగారిని త్వరలో చూడవచ్చుననే ఆనందంతో నేనక్కడినుంచి అమ్మమ్మ దగ్గరకి పరుగెత్తుకెళ్లాను. "రావుగారికోసం ఎవరో వచ్చారు ... రావుగారు ఇప్పుడొస్తారు...."– అని, అమ్మమ్మని బయటికి తీసుకొచ్చాను.

అమ్మమ్మ వెంట అమ్మకూడా వచ్చింది. "ఈ దరిద్రుడి మాట ఎందుకు వింటావ్? వాడేదో పాడు కబురు తెస్తాడు...."–అంటూ బయటికొచ్చి, అక్కడున్న మనుషుల్ని చూసి, మళ్లీ వెంటనే లోపలికెళ్లి పోయింది. వెళుతూ వెళుతూ అస్పష్టంగా ఏమిటో అంది. ఏమందో తెలీలేదు.

బహుశా నన్నుగురించే ఏదో అని వుంటుంది. అమ్మ లోపలికెళ్లిపోయింది. అమ్మమ్మ బయట నిలబడి మార్వాడీ వాగుతున్న వాగుడువింటోంది. ఆమార్వాడీ ప్రతి వస్తువునీ పరీక్షగా చూస్తూ ఎవరినో తిట్లు తిడుతున్నాడు. ఎవరిని తిడుతున్నాడో నాకు తెలీదు. వాడు తిడుతున్నాడన్న సంగతి కూడా నాకు ఆతర్వాతే తెలిసింది. మార్వాడీ ఆరకంగా ప్రతివస్తువూ చూసి మూటకడుతూవుండగా– ఇంతలో తాతగారు వచ్చారు. ఆయన యివ్వాళ ఎలావచ్చాడో పెందరాడే యింటికొచ్చాడు. ఆయన వచ్చేసరికి రావుగారి గదిలో సందడిగా వుంది. రావుగారే వచ్చారనుకున్నారు తాతగారు. "రావుగారూ, భలేపనిచేశారే!" అంటూ ఆయన గదిలోకి వెళ్లబోయేసరికి, ఆనలుగురు వ్యక్తుల్లోనూ ముగ్గురు గదిలోంచి బయటికొచ్చేశారు. ఆయన తెల్లబోతూ గదిలోకివెళ్లారు. కాస్సేపట్లో బయటికొచ్చేశారు. మార్వాడీ వస్తువులన్నీ పోగుచేస్తున్నాడు. నేను రావుగారి గది దగ్గరేచూస్తూ నిలబడ్డాను. మార్వాడీ దుప్పట్లో వస్తువులన్నీ మూటగట్టుకుని భుజానవేసుకుని గది బయటి కొచ్చాడు. నేనంతకుముందునుంచే గదిలోకి

వెళ్లాలనే వుద్దేశ్యంతో వున్నాను. ఎలా వెళ్ళానో, ఎవరికంటా పడకుండా గబుక్కున గదిలోకి దూరి ఒక మూల నక్కాను. తలుపు మూసేస్తారేమో, నేనేమౌతానూ అన్న జ్ఞానమే నాకు లేకపోయింది.

ఇంతలో అక్కడున్న వాళ్లలో ఒక అమీను తనవెంట తీసుకొచ్చిన సిపాయిలతో-తాళం పగులగొట్టి లోపలిగది తెరవమని చెప్పాడు. నాకిప్పటికి కూడా ఎవరైనా మార్వాడీనిచూస్తే ఆనాటి మనుష్యులే గుర్తువస్తుంటారు. వాళ్లుతాళం పగలగొట్టి తలుపులు తెరిచారు. నేనెంత భయపడ్డానో చెప్పలేను! అక్కడ ఏమేమివున్నాయో చూడాలన్న కుతూహలం కూడా నాలో పెరిగింది. కాని ఆ పచ్చతలపాగావాడు కర్రచూపించి నన్ను లోపలికిరావద్దని బెదిరించాడు. అందువల్ల నేను కాస్త ఎడంగానే నిలబడిపోయాను. వాళ్లు గదిలోవున్న వస్తువులన్నీ పోగుచెయ్యటం ప్రారంభించారు. నేను గదిలోకి తొంగితొంగి చూస్తున్నాను. వాళ్లు తీసుకునే వస్తువులేమిటో చూద్దామని ప్రయత్నం చేశాను. కాని నాకేమీ కనబడలేదు. కనబడే వస్తువేదీ ఆగదిలో లేదంటే వావుంటుందేమో. మార్వాడీ తనకి దొరికిన వస్తువులన్నీ నాపమీదికి విసురుతున్నాడు కొన్ని కాయితాలు; ఒకటరెండు దీపాలు; ఇంకేవో కొన్ని మామూలు వస్తువులు - అంతమటుకే గుర్తుందినాకు. వాళ్లు బయటికెళ్లిపోయారు. చటుక్కున లోపలికిదూరి తలుపు వేసేసుకున్నాను. వాళ్ల కళ్లుగప్పి లోపలికిరాగలిగినందుకు నాకు చాలా సంతోషం కలిగింది. వాళ్లు బయటినుంచి గొళ్లెం పెడతారన్న ఆలోచన నాకు రానేలేదు.

ఇప్పుడు నేను అన్నీహాయిగా చూడొచ్చు. ఆసంతోషంతోనే లోపల అటూయిటూ తిరగడం ప్రారంభించాను.

## భయంకర సంఘటన

ఎవరికీ కనబడకుండా లోపలికి వెళ్లగలిగినందుకు నన్నునేనేమెచ్చుకున్నాను. సంతోషించాను. గదిమొత్తం ఏడెనిమిదడుగుల పొడవూవెడల్పూవుంటుంది.

రెండు గదులకీ మధ్యలో తలుపుంది. ఇవతల గది ఎంతవుందో అవతలి గది కూడ అంతేవుంది. ముందు మొదటి గదంతా చూసి లోపలి గదిలో కెళ్లాను. అక్కడ ఒక విరిగిపోయిన పొయ్యి; దారాలు; ఒకటిరెండు కట్టెలూ యిలాంటివి మాత్రమే కనిపించాయి. ఆ వస్తువులు నాకు తృప్తి కలిగించలేదు. అందువల్ల బయటిగదిలోకీ లోపలిగదిలోకీ మాటిమాటికీ తిరగటం, వెతకటం ప్రారంభించాను. ఆగదుల్లో ఏదోవిలువైన వస్తువు దాచిపెట్టినట్టూ, ఆసంగతి నాకుతెలిసినట్టూ, ఆ వస్తువుకోసమే వెదుకుతున్నట్టూ వెదకడం ప్రారంభించాను. అయితే ఆ వస్తువు ఎక్కడపెట్టానో గుర్తులేనట్టుగా అదేపనిగా వెదకడం మొదలెట్టాను. ఆరోజు; ఆ సమయం; ఆ సంఘటన అంతా గుర్తువస్తే యిప్పటికీ నేను ఆశ్చర్యపోతూ వుంటాను.

ఇంతకుముందు నేను చెప్పినట్టుగా గదిఅంతా గాలిస్తుండగా_నాకుచటుక్కున ఒక ఆలోచనవచ్చింది_ఆ చిరుగుల చాపకింద ఏముందో చూద్దామని ! ఆఆలోచన ఎందుకు వచ్చిందో చెప్పలేను. మనసులో అనుకున్నవన్నీ చేసే వయసు గదా నాది! వెంటనే చాపలాగి చూశాను. చాపకింద దుమ్మూ, బీడీముక్కలూ, బీడీనుసీ, కాలిన అగ్గిపుల్లలూ, ఒకతాడూ_ యివేవున్నాయి. నాలుగైదు కాగితపు ముక్కలుకూడా వున్నాయి. అయితే నేను చాప లాగేటప్పుడు ఏదోవస్తువు టప్పున ఎక్కడో పడింది అదేంవస్తువో కనబల్లేదు. ఎందుకంటే అప్ప టికే చీకటి పడింది. ఇక ఆ వస్తువుకోసం వెదకడం ప్రారంభించాను. నేనెక్కడ వున్నాను, ఏపరిస్థితిలో వున్నానూ అన్న ఆలోచనే లేదు. ఆవస్తువు కోసం అదేపనిగా వెదకడం మొదలెట్టాను. ఈ రకంగా కొంతసేపు గడిచింది. బయట బాగా చీకటి పడిందన్న సంగతి కూడా గుర్తించకుండా ఆ వస్తువు వెదకడంలో మునిగిపోయాను. చాప అటులాగీ యిటులాగీ తిరగేసీ బోర్లావేసీ చూశాను. తడిమి చూశాను. కాని ఆవస్తువెక్కడా కనబల్లేదు. మళ్లీ వెద కడం మొదలెట్టాను. గదిలో మూలమూలలా తిరిగి వెదకసాగాను. ఆక్షణాన నాలో కలిగినంత కుతూహలం; జిజ్ఞాస, ఆ తర్వాత మరెన్నడూ కలగలేదను కుంటాను.

క్షణక్షణానికీ చీకటిపెరుగుతోంది. నేనా వస్తువుకోసం వెదుకుతూనేవున్నాను.

ఇంతలో ఒకమూల నాకాలికేదో వస్తువుతగిలింది. తీసిచూద్దునుగదా, అగ్గిపెట్టె! నాకు చాలా నిరాశకలిగింది. ఇందులో పుల్లలుంటే వెలిగించి చూద్దామన్న ఆలోచన వచ్చింది. పెట్టెతెరిచి చూశాను. మూడుపుల్లలున్నాయి. నాకు సంతోషం కలిగింది. చటుక్కున ఒక పుల్లతీసి వెలిగించాను. గదంతా వెలుగుతో నిండింది. రెండు గదులకీ మధ్యనున్న గడపదగ్గర ఏదోకాగితం లాంటిది కనిపించింది. అది మిగతాకాగితాల్లా లేదు. ఇంతలో అగ్గిపుల్ల చివరికంటా వెలిగి, నా చెయ్యి చురుక్కుమంది. గభాల్న కిందపారేసి, లోపలిగది గడపవేపు ఒక్కవురుకు వురికాను. కాగితం తీసుకున్నాను. ఆకాగితం నాచేతికి మందంగా తగిలింది. లోపల ఏదో వున్నట్టుంది. తడిమి చూడసాగాను. నేను ఇంత సేపట్నించీ వెదుకుతున్న వస్తువు ఇదేనేమో అనిపించింది. ఆ కాయితం మామూలు కాయితంకాదు. ఒకకవరు!—అంటే ఉత్తరం. అది నాచేతికి దొరగ్గానే నాకు ఎక్కడలేని ఆనందమూ కలిగింది. నాలో చిన్నప్పట్నించీ కూడ ఒక విచిత్రమైన గుణంవుంది.

మనసులో ఏదైనా ఒకటి చెయ్యాలీ అనుకుంటే, ఆ పని చేసి పారేస్తేగాని మనసుకు శాంతివుండదు ఈరకమైన మనోప్రవృత్తి కలిగివున్నందుకుగాను—నేను అప్పుడప్పుడూ పశ్చాత్తాప పడవలిసికూడా వస్తుంది. ఈ గుణంవల్ల అప్పుడప్పుడూ లాభాలు కలుగుతుంటాయి; కాదనను, ఈ గుణంవల్ల యిప్పటిదాకా నాకేమేమి లాభాలు కలిగాయో, నష్టాలు జరిగాయో ఇప్పుడే మీకెందుకు చెప్పాలి?

ఆకవరు మూడునాలుగుసార్లు తడిమిచూశాను. లోపల ఏముందో తెలియలేదు. లోపల ఏముందో తర్వాత చూడొచ్చులే అనుకుని, లోపలిగదిలోవున్న కిటికీ దగ్గర కెళ్ళాను. బాగా చీకటి పడింది. ఇంతలో అగ్గిపెట్టె సంగతి గుర్తొచ్చింది. మరోపుల్ల గీశాను. ఆ వెలుగులోచూస్తే ఆకవరుమీద ఇంగ్లీషులోనో, లేక మరేదోభాషలోనో ఏవో అక్షరాలున్నాయి. 'మరేదో భాషలోనో' అని ఎందుకన్నానంటే, కవరుమీదవున్న భాష నాకు తెలిసిన భాష కాదు.

కవరు అంటించివుంది; లోపల వుత్తరముంటుందీ అన్న విషయం మనసుకి తట్టగానే, బయటికెళ్ళి తాతగారికి చూపిద్దామన్న ఆలోచన వచ్చింది. బయటి

విషయం అప్పుడు గుర్తొచ్చింది నాకు. గబగబ తలుపు దగ్గరకి పరుగెత్తి తెరవ డానికి ప్రయత్నించాను. కాని ఇదేమిటి! తలుపు ఏమాత్రం తెరుచుకోవడం లేదు.

ఇప్పటిదాకా నేనసలు చీకటి గురించి ఆలోచించనేలేదు. ఇప్పుడు భయ మేస్తోంది. మానాన్నగారి ఎస్టేటు వెదకడంలో నిమగ్నుడినై వున్నంత సేపూ నాకు చీకటి సంగతి గుర్తేరాలేదు. నేను ఒక్కడినే వున్నాను; బయట తాళం వేస్తారూ అన్న ఆలోచనలు కూడా రాలేదు. నా ఆలోచనంతా తలుపు మీదికి మళ్లగానే – బయట నాకోసం అమ్మ; అమ్మమ్మ; తాతగారూ అంతా వెదుకుతూ వుంటారన్న ఆలోచన వచ్చింది. నేనెక్కడా కనబడకపోయేసరికి వాళ్ళస్థితి ఎలావుందో అన్న ఆలోచన కూడా వచ్చింది. చీకటి యింకా దట్టమైంది. తలుపు దబదబా తట్టడం ప్రారంభించాను.

"అమ్మా! అమ్మమ్మా! తాతగారూ!"–అంటూ కేకలు వెయ్యడం మొదలెట్టాను. నా కేకల ప్రతిధ్వని నాకేతప్ప, మరే సమాధానం వినిపించలేదు. మరోశబ్దం లేదు. ఇప్పటిదాకా అసలు చీకటి సంగతే పట్టించుకోలేదు. కాని ఇప్పుడా చీకటి భయంకరంగావుంది. అగ్గిపెట్టెలో మరోపుల్ల మిగిలిందన్న సంగతి గుర్తొచ్చింది. చటుక్కున గీశాను. గీశేటప్పుడు పుల్ల విరిగిపోయి, ఎక్కడో పడిపోయింది. నాకు నిరాశ కలిగింది. ఇంక చేసేదేమీ లేక ఆ వయసులోవున్న పిల్లలంతా ఏంచేస్తారో అదే చెయ్యడం ప్రారంభించాను–అంటే ఏడవటం మొదలెట్టాను.

ఆ చీకట్లో నేనెక్కడ కూర్చున్నానో నాకే తెలియకుండావుంది. చీకట్లో ఎటుతిరిగినా ఎటు నడిచినా ఏదో ఒకటి అడ్డురావటమో తగలడమో జరుగుతోంది. అంచేత ఇంకేమీ చెయ్యలేక కింద చతికిలబడ్డాను. బిగ్గరగా ఏడవటం ప్రారంభించాను. ఆ చిన్న వయసులో అలాంటి భయంకర స్థితిలో నా మనోవేదన ఎలావుంటుందో మీరే వూహించుకోండి. మీ కెప్పుడైనా యిలాంటి భయంకరమైన అనుభవం కలిగిందా? ఇలాంటి పరిస్థితిని అనుభవించిన వారికే నా పరిస్థితి తెలుస్తుంది; మిగతావారికెలా అర్థమౌతుంది? మీరు మీ అమ్మా నాన్నలతో ఎక్కడికైనా వెళ్ళి, అక్కడ తప్పిపోతే అప్పుడు తెలుస్తుంది మీకు.

ఏడవటం తప్ప యింకేం చెయ్యగలను ? నేనిప్పుడు ఏమౌతాను ? ఎక్కడి కెళ్తాను? నాకు అన్నమెవరు పెడ్తారు; మంచినీళ్ళెవరిస్తారు ? ఇలాంటి ఆలోచనలు ఒక్కటొక్కటిగా మనసులో ప్రవేశించినకొద్దీ యింకా బిగ్గరగా ఏడవసాగాను. బయట ఎక్కడైనా తప్పిపోతే ఫర్వాలేదు. ఎవరైనా తండ్రి పేరూ తల్లి పేరూ చిరునామాలాంటివి అడుగుతారు; చెప్పవచ్చు. ఎవరైనా ధర్మాత్ముడు అన్నం పెడతాడు; నీళ్ల తాగిస్తాడు. అలా తప్పిపోయిన పిల్లల పరిస్థితే మెరుగు. కాని నా పరిస్థితి చాలా భయానకం. ఇప్పటికీ ఆ సంఘటన తల్చుకుంటే నాకు భయంవేస్తుంది. నలువైపులా చీకటి! గాఢాంధకారం! నేల మీద చతికిలబడి ఒంటరిగా నేను !

'అమ్మా! అమ్మమ్మా!'అంటూ బిగ్గరగా ఏడవటం!--ఈ భయానకదృశ్యాలన్నీ కళ్ళముందుమెదిలితే ఇప్పటికీ గట్టిగా కళ్ళుమూసుకుంటాను. ఎక్కడికన్నా దూరంగా పారిపోవాలనిపిస్తుంది.

ఇంతకు ముందు చెప్పిన ప్రకారం నేను ఎంతసేపు ఏడ్చానో, ఎంతసేపు కేకలు వేశానో, ఎంతసేపు తలుపు బాదుతూ వున్నానో, ఎంతసేపటికి ఎవరైనా తలుపు దగ్గరకొచ్చారో యివన్నీ సరిగ్గా చెప్పలేను. దాదాపు రెండు గంటలసేపు అలాగే గడిచింది. అంతసేపు – చుట్టుపక్కల వాళ్ళకి గాని, కనీసం డాబా మీదికెళ్ళే వాళ్ళకి గాని నా అరుపులు ఎలా వినిపించలేదో నాకాశ్చర్యంగా వుంటుంది. మా అమ్మ అన్నట్టు నా రాతే అటువంటిదేమో! అసలు కష్టాలను భవించడానికే నేను పుట్టానేమో! నేనలా బాధపడుతూ వుండగా–ఇంతలో ఏదో పొగ నా కళ్ళలోకీ ముక్కుల్లోకి రావడం ప్రారంభించింది. ఉక్కిరిబిక్కిరయి పోతున్నాను. కళ్ళు మండుతున్నాయి. ఆ పొగ ఎక్కడినుంచి ఎలావచ్చిందో నాకర్థం కాలేదు. కళ్ళు తెరిస్తే కళ్ళనిండా పొగ! కళ్ళు తెరవలేక పోయాను; కళ్ళు; ముక్కు; గొంతూ అన్నీ పొగతో మండటం ప్రారంభించాయి. ఊపిరి పీల్చుకోవడం కూడా కష్టమైపోతోంది. మాటిమాటికీ ఏడుపు ఆపటం; లోపలి గది కిటికీ దగ్గర కెళ్ళటం! అక్కడ కాస్త బావున్నట్టనిపించింది. కాని పొగ అక్కడికీ వచ్చింది.

ఏడ్చి ఏడ్చి ఎన్ని కన్నీళ్ళు కార్చానో పొగవల్ల అంతకి వందరెట్లు ఎక్కువగా

కన్నీళ్ళు కార్చవలసివచ్చింది. ఇక నా ఏడుపు ఆగిపోయింది. నోరు తెరిస్తే చాలు పొగ లోపలికి దూరి శ్వాసకడ్డుతగులుతోంది. ఇంకెలా ఏడుస్తాను? నాకేదో పెద్ద ప్రమాదం ఏర్పడబోతోందన్న సంగతి నాకు నిశ్చయంగా తెలిసిపోయింది. బయటి తలుపుదగ్గరకి పరుగెత్తి మళ్ళీ దబదబా బాదడం ప్రారంభించాను. బలమంతా వుపయోగించి బిగ్గరగా అరిచాను. కాని ఏమీ లాభంలేకపోయింది. అక్కడికీ పొగ వచ్చింది. మళ్ళీ పక్కగదిలోకి వెళ్ళాను. వెనక కిటికీదగ్గరకెళ్ళి బిగ్గరగా అరిచాను. నాలో శక్తిఅంతా ఉపయోగించి, తలుపు బాదుతూ మళ్ళీ బిగ్గరగా అరిచాను. పొయ్యిలో ఏదో మండుతున్నట్టుగా అనిపించింది. అరుస్తూనేఉన్నాను. ఎంత భయంకరమైన సంఘటన! ఎంత భయంకరమైన పరిస్థితి! మూలనుంచి ఒక పెద్దమంట లేచింది!

## ఉత్తరం! ఉత్తరం!!

భయంకరమైన ఆ మంట చూసినప్పుడు నా పరిస్థితి ఎలావుందో అది నాకొక్కడికే తెలుసు. బహుశః నాకు కూడా తెలియదేమో; ఈనాడు అలా వూహించుకుంటున్నానేమో. ఈ భయానక సంఘటన పరిణామం ఏమిటీ అన్నది కూడ నా కానాడు తెలియదు. ఆ మంట ఎలావచ్చిందీ అన్నది కూడ తెలియదు. అప్పుడసలు ఆ సంగతి ఆలోచించనేలేదు. బొత్తిగా ఆలోచించలేదు. మంట చూడగానే బిగ్గరగా అరిచాను. తలుపు దబదబా బాదాను. అంతే. ఆ తర్వాత ఏమి జరిగిందో నాకు తెలియదు. భయంకరంగా నేను అరచిన అరుపు మాత్రమే గుర్తుంది. ఆ అరుపు గదిలో ప్రతిధ్వనించింది. అలా అరుపుఅరచి గుమ్మం ముందు స్పృహతప్పి పడిపోయాను. ఆ తర్వాత ఏంజరిగిందో నాకు తెలీదు.

నేను కోలుకుంటున్నాను. సరిగ్గా నాలుగోరోజునో, అయిదోరోజునో—నేను రావుగారి గదిలోకి ఎలావెళ్ళాను; ఏంచేశాను; ఏమివెదికాను; వెదికినప్పుడు

ఏమిదొరికాయి; అగ్గిపెట్టి ఎలాదొరికింది; అందులో ఎన్నిపుల్లలున్నాయి; వాటిలో నేను ఎన్నివెలిగించాను—ఈ విషయాలన్నీ నాకు గుర్తొచ్చాయి. ఆవెంటనే అమ్మమ్మని పిలిచి— "అమ్మమ్మా! నా కవరేదీ?"—అని అడిగాను.

"ఏంకవరు? ఎవరి కవరు?"— అని అమ్మమ్మ అడగటంతోటే నేను ఆశ్చర్యపోయాను. నేనేమి అడిగానో నాకే గుర్తురావటంలేదు. కాని అలాఎంతసేపో లేదు. మాటిమాటికీ నాకాకవరు గుర్తొస్తూనేవుంది. గుర్తొచ్చినప్పుడల్లా దానిగురించి అడుగుతూనేవున్నాను. అడిగినప్పుడల్లా అమ్మమ్మ అదే సమాధానం — "ఏమి ఉత్తరం? ఎవరి ఉత్తరం?.... ఎందుకలా పిచ్చివాడిలా వాగుతావ్?"— ఇదేవరస. ఆకవరు నాకు అనుక్షణం గుర్తొస్తూనే వుంది. ఆకవరు ఏమైంది? అమ్మమ్మ సమాధానం విన్నకొద్దీ నాలో ఆకవరుకిచెందిన ఆలోచన, కుతూహలము పెరగసాగాయి.

ఏమైతేనేం? ఆకవరు నాకెవరూ యివ్వలేదు. దానిగురించి అడిగినప్పుడల్లా— 'ఏంవెర్రి పిల్లాడు!' — అంటూ అందరూ నన్ను ఎగతాళి చెయ్యటం ప్రారంభించారు. మరో రెండురోజులకి నా ఆరోగ్యం పూర్తిగా బాగుపడింది. నేనెక్కడికైతే వెళ్ళానో, మళ్ళీ అక్కడికే వెళ్ళాలన్న బలమైన కోరిక నామనసులో కలిగింది.

కొన్నిరోజుల క్రితం నేను ఏగదిలో అయితే ప్రవేశించి దిగ్విజయం సాధించానో, మళ్ళీ నాన్నగారి ఆగదిలోకే వెళ్ళాలన్న కోరిక కలిగింది. మరోసారి వెళ్ళిచూడాలనిపించింది. ఆ కోరిక నన్ను ఆగదివద్దకు ఈడ్చుకువెళ్ళింది. తీరా నేనక్కడికెళ్ళి చూద్దునుగదా! అక్కడెంకెవరో కొత్త మనుషులు కూర్చుని వున్నారు. మా అమ్మ వయసున్న ఒక స్త్రీ; ఆమె పక్కనే రెండూ రెండున్నర సంవత్సరాల వయసున్న ఒక ఆడపిల్లా కూర్చుని వున్నారక్కడ. ఇద్దరూ గుమ్మందగ్గరే కూర్చున్నారు. వాళ్ళనిచూసి నేను ఒక అడుగు వెనక్కివేశాను. కాని—గదిలోకి తొంగి చూడాలన్న బలమైన కోరికవల్ల మళ్ళీగదిముందుకెళ్ళాను.

ఆ స్త్రీకి సరిగ్గా ఎదురుగా నిలబడి గదిలోకి తొంగితొంగి చూడ్డం ప్రారంభించాను. నన్నుచూసి, నేనలా చూడ్డం చూసీ ఆ స్త్రీకి నవ్వొచ్చింది. అలా నవ్వుతూనే—"ఏం కావాలిబాబూ? ఎవరుకావాలిబాబూ? ఏంచూస్తున్నావ్?"—

అని అడిగింది. ఆమె అడిగిన తీరూ, ఆమె నవ్వుమొహమూ చూస్తే నాకు చాలా ఆనందమైంది. సమాధానంకూడా చెప్పాలనిపించింది. వెంటనే – "ఇది మా రావు గారి గది! ఆయన కవరొకటి నాకు ఇక్కడ దొరికింది. అదిక్కడ వుందోలేదో చూద్దామని వచ్చాను!"– అన్నాను. ఇంతలో ఆ పిల్ల నాకెదురుగా వచ్చి నిలబడింది.

## సుందరితో నా మొదటి పరిచయం

ఆ పిల్లకి రెండు, రెండున్నర సంవత్సరాలుంటాయని యింతకుముందే చెప్పాను. తెల్లగావుంది. కనుముక్కు తీరు చక్కగావుంది. కాళ్లూ చేతులూ బొద్దుగా గుండ్రంగా వున్నాయి. ఆ వయసుకి కొంచెం పొట్టేమో అన్నటుగా వుంది. మొహం చూడముచ్చటగా వుంది. నాకు బాగా గుర్తు–ఆ అమ్మాయిని చూడగానే నాలో ఏదో విచిత్రమైన మానసిక సంచలనం కలిగింది. తాత గారింట్లోనూ పిల్లలున్నారు. కాని వారిలో ఎవర్ని చూసినా కూడా, ఆ అమ్మాయిని చూసినప్పుడు కలిగినంతటి ప్రేమ కలగలేదు.

ఆ పిల్లని నా దగ్గరకి పిలుచుకొని, ఆ పిల్లతో కలిసి ఆడుకోవాలనిపించింది.

ఇంతలో ఆ అమ్మాయే ముద్దుముద్దుగా, తియ్యతియ్యగా–వాళ్ళమ్మతో– "అమ్మా ! నా కీ పెళ్ళికొడుకే బావున్నాడు ! తాతచెప్పే పెళ్ళికొడుకు నాకు వద్దు ; నాకీ అబ్బాయినే యివ్వు.... !"–అంది. ఈ మాటలంటూ ఆ పిల్ల తన రెండు చేతులూ నడుంవెనక్కి పెట్టుకుంది. రెండుచేతుల వేళ్ళూ కలుసుకున్నాయి. కళ్ళమీదపడే జుత్తు వెనక్కితోసుకుని, కొంచెంముందుకు వంగి, భయంలేకుండా నావంక చూస్తూ ఈ మాటలంది. తను అడిగినదానికి తల్లి ఏం చెబుతుందోనని తల్లి ఎదురుగా వెళ్ళి నిలుచుంది.

ఆ పిల్ల అన్నమాటలకి నేను చాలా సిగ్గుపడ్డాను. సిగ్గుతో అక్కడినుంచి పారిపోదామనుకున్నాను. కవరు, నే నక్కడికివచ్చిన పనీ అన్నీ మర్చిపోయాను. ఇంతలో ఆ స్త్రీ కూతురివేపుతిరిగి– "సుందరీ ! నీకీ పెళ్ళికొడుకు కావాలా ?

ఆ బిగ్యా వద్దా ? బిగ్యాకేం తక్కువ ?''—అని అడిగింది నవ్వుతూ. ఈ మాట వినటంతోటే నాకు అక్కడ మరికొద్దిసేపు వుండాలనిపించింది.

''వాడొద్దు ; వాడు మంచివాడు కాదు : నన్ను కొట్టాడు ; వాడి కెప్పుడూ చీమిడి కారుతుంది ; ఇతన్నిస్తావా ?''—అంది ఆ పిల్ల తల్లితో. ఇంక నేనక్కడే వుండిపోయాను.

కాని, నాకింకా సిగ్గు వేస్తోనే వుంది. సిగ్గువల్ల పారిపోదామనిపించింది. కాని ఆ పిల్ల తియ్యటి మాటలవల్ల నా పాదాలు అక్కడ అతుక్కుపోయాయి. చివరికి నేనక్కడినుంచి కదలనేలేదు. ఇంతలో సుందరి తల్లి నవ్వుతూ—''ఓసి నీ దుంప తెగ! అప్పుడే నీకు మంచీచెడ్డా కూడ తెలిసిందీ!....కాని నీబోటి పిచ్చిపిల్లని ఆ అబ్బాయెందుకు చేసుకుంటాడు? ఆ జుట్టుచూడు, ఎట్టా దుబ్బల్లేవుందో ; ఒళ్ళంతా మురికి—ఛీ, ఛీ!''—అంటూ, ఆమె సుందరిని తన వొళ్లోకి తీసుకుని ప్రేమతో ముద్దు పెట్టుకుంది. ఆ తర్వాత మళ్ళీ—''నీలాంటి పిచ్చిపిల్ల ఎందుకతనికి? ఆ అబ్బాయి నిన్ను ఛస్తే చేసుకోడు!'' అంది. ఆ మాటలు వినటంతోటే నా మనసు అదోలా అయిపోయింది. నేను వెంటనే – ''వద్దని ఎందుకంటావు? నాకాఅమ్మాయి కావాలి!''—అన్నాను.

పాఠక మహాశయా! ఆ సమయంలో నేనన్న మాటలకి నాకు నిజంగానే అర్థం తెలియదు. కాని నేనలా అనకపోతే దొరికిన పెళ్ళికూతురు పోతుంది. అందుచేత వెంటనే అలా అన్నాను. నేనలా అనటంతోటే సుందరితల్లి బిగ్గరగా నవ్వింది. సుందరికూడా నవ్వింది. వాళ్ళిద్దరూ నవ్వటం చూసి నేనుకూడా బిగ్గరగా నవ్వాను. నేను నవ్వటం చూసి –''ఆహాఁ! అయితే యిది మీ స్వయం వరమన్నమాట! పిల్లకి పిల్లవాడు నచ్చాడు; పిల్లవాడికి పిల్ల నచ్చింది. ఇంకేం? సరేగాని, నువ్విక్కడికెందుకొచ్చావ్?'' అని నన్నడిగింది, సుందరి తల్లి.

నేను : మరండీ, ఇది రావుగారి గదండీ. మా రావుగారిని మీరు ఎరుగుదురా?

సుందరి తల్లి : ఆఁ తెలుసు. ఆయన ఈ గదిలో వుండేవారా?

నేను : ఈ గది ఆయనదేనండీ : నేను వాళ్ళబ్బాయిని.

సుందరి తల్లి : (ఇంకా బిగ్గరగా నవ్వుతూ) అలాగా ? మరి ఆయన ఇప్పుడే మయ్యారు ? నువ్విక్కడకి ఎలావచ్చావ్ ?

నేను : ఆయనా అండి ? ఆయన బయటి కెక్కడికో వెళ్ళారు? మీరిక్కడికి ఎలావచ్చారు ? రావుగారి గది తాళం పగలగొట్టారా ? నేను గది లోపలికి రావచ్చా? నేను ఈ గదిలో వుండే నండీ. ..పెద్దమంట వచ్చింది: నాకేమో ఒక కవరు దొరికింది. నేనా కవరు గట్టిగా పట్టుకున్నాను. కాని అదేమో ఎక్కడో పడిపోయిందండీ. మీ గదిలో వుందాండీ ?

సుందరి తల్లి నామాటలూ ప్రశ్నలూ విని ఖంగారు పడిపోయినట్టనిపించింది నాకు. అయినా ఆమె నవ్వుతూనే — "అయితే నీకా కవరు కావాలా? అయ్యో! మేమిక్కడికి మొన్న వచ్చాం ; వచ్చేముందు గదులన్నీ శుభ్రంచేసి, చెత్తా చెదారమంతా వూడ్చి పారేశాం. ఇప్పుడిక్కడ ఏమీలేదు. నీకింకా కవరు ఎక్కడ దొరుకుతుంది?"— అంది.

నేను : మీ రిక్కడ వుంటున్నారా ? మా రావుగారు యింకరారా ? ఈ గది రావుగారిదని మా తాతగారు చెప్పారే ? ఈ గది మీరు రావుగారి దగ్గర తీసుకున్నారా ?

నా ప్రశ్న విని ఆ స్త్రీ నావంక విచిత్రంగా చూసింది. నే నడిగిన ప్రశ్న ఆమెకి అర్థంఅయివుండదు. "రావుగారెవరు ? ఆయనిక్కడున్నప్పుడు ఆయనతోపాటు నువ్వుకూడ వుండేవాడివా ?"—ఈ రకంగా ఆమె ప్రశ్న లడగటం, నేను సమాధానాలు చెప్పటం—ఇలా కొంతసేపు జరిగింది. "రావు గారెవరు ?" "మా రావుగారు" "నే నెవర్ని ?" "నేను రావుగారబ్బాయిని" "ఆయనతో కలిసి మే మెప్పుడూ వుండలేదు" ఈ రకంగా నే నిచ్చిన సమాధానాలవల్ల మా 'అత్త' గారికి నా సంగతి తగుమాత్రం తెలిసిందను కుంటాను. ఈ మాటలు మాట్లాడుతున్నంతసేపూ నా దృష్టిఅంతా లోపలి గది మీదే వుంది. అది ఆ స్త్రీ గమనించి—"సరే రా ! లోపలికొచ్చిచూడు ; నీ కేం కావాలో చూసుకో ; రా!"—అని పిలిచింది. తల్లి మాటలు విన్నమీదట సుందరికి ప్రోత్సాహం లభించింది. "దా, దా పెళ్ళికొడుకా ! అమ్మ నీకు మిఠాయికూడా పెడుతుంది....దా !"—అంటూ పిలిచింది. ఆ మాటలు విని ఆమె తల్లికి ఎంత నవ్వొచ్చిందో నాకంత సిగ్గేసింది.

నిజంగానే అత్తవారింటి కెళుతున్నట్టుగా అనిపించింది నాకు. లోపలికెళ్ళాను.

ఆ గదిలో అంతకుముందున్న వస్తువులేవీకూడ యిప్పుడులేవు. అంతా శుభ్రంగా చక్కగావుంది. అసలది రావుగారి గదిలాగేలేదు. నేను మొదట రావుగారి గదిలోకి వెళ్ళినప్పుడు అక్కడి పరిస్థితి ఎలావుందో మీకు చెప్పాను. అప్పటికీ యిప్పటికీ ఆ గదిలోవచ్చిన మార్పు చూస్తే, అది రావుగారి గదేనని నేను నమ్మలేకపోయాను. ఆస్త్రీ—పైన అటకమీదినుంచి ఏదో కిందికి దింపుతూ, నవ్వుతూ—"దొరికిందా నీకవరు?"—అని అడిగింది.

"లేదు....దొరకలేదు. మీకు దొరికిందా? దొరికితే నాకు యివ్వరా?"—అని అడిగాను నేను. "లేదు బాబూ! మాకేమీ దొరకలేదు. ఇందాకే చెప్పాగా—ఇక్కడికొచ్చేముందే చెత్తా చెదారమూ అంతా వూడ్చి పారబోశామని? అయినా నువ్వింత చిన్నపిల్లవాడివి! ఆ కవరు నువ్వేంచేసుకుంటావ్?"—అని అడిగిందామె.

ఏమని సమాధానం చెప్పను? నాకేమీ తోచలేదు. అయినా—"కవరాఅండి?.... కవరు ...నాక్కావాలి వూరికే"—అన్నాను. 'వూరికే' అన్నమాట చిన్నతనంలో చాలా ఉపయోగపడుతుంది. అంత ఉపయోగకరమైన మాట మరొకటి లేదని నా అభిప్రాయం. ఏమీ సమాధానం దొరకనప్పుడల్లా, ఏ ప్రశ్నకైనా అదే సమాధానమైనట్టుగా 'వూరికే'—అంటాం.

నేను సమాధానం చెబుతూ వుండగానే ఆ స్త్రీ లడ్డూల డబ్బా నాముందుపెట్టి—"లడ్డూ తీసుకో"— అంది. ఇంతలో సుందరికూడా— "దా పెళ్ళికొడుకా! లడ్డూ తీసుకో.... నేను నీకు లడ్డూ తుంపి పెట్టనా?"— అంది. ఆ మాటలు వినటంతోటే నాకేదో ఆనందం కలిగింది. ఎందుకంటే సుందరి నాకు 'పెళ్ళికొడుకు' అన్న పేరు స్థిరపరిచేసింది. అలా పిలిపించుకోవటం నాకు బాగుంది. ఎప్పుడూ అలాగే పిలిస్తే బాగుండుననిపించింది. కాని సుందరి అలా పిలుస్తున్నప్పుడు నాకు సిగ్గేసింది. సుందరి అలాగే అనగానే - వాళ్ళమ్మ—"నువ్వేమీ తుంపి యివ్వద్దులే! ముందు నీ అవతారం నువ్వు చూసుకో! జుట్టుచూడు - మొహమంతా ఎటా పడుతోందో...."—అంది.

లడ్డూ నాకే యిచ్చి, సుందరికివ్వకపోవటం నాకేమీ నచ్చలేదు. వెంటనే సుందరి తల్లితో—"లడ్డూ నాకిచ్చారు; మరి ఈ అమ్మాయికివ్వరే?"—అని అడిగాను.

సుందరి – "వద్దు వద్దు; నాకొద్దు; నేనిప్పుడే తిన్నాను!" – అంది. అయినా నేను పట్టుపట్టి, ఒక చిన్న ముక్క తుంచి సుందరికిచ్చాను. ఇంతలో ఎవరో బిగ్గరగా నాపేరు పెట్టి పిలవటం వినిపించింది. పిలుస్తూ మా అమ్మ వచ్చింది. అమ్మ పిలుపు వినగానే నా పై ప్రాణాలు పైనే ఎగిరిపోయాయి. లడ్డూ ముక్క నోట్లో పెట్టుకుని అప్పటికొక నిమిషం కూడా అయివుండదు. అలాగే లేచి పారిపో బోయాను.

సుందరి తల్లి నా పరిస్థితి గమనించి– "ఏమిటి బాబూ? నిన్నెవరైనా పిలుస్తున్నారా, చూస్తానుండు" అంటూ బయటికొచ్చింది. ఇంతలో మా అమ్మ కూడా అక్కడికొచ్చింది. "మీరు ఈ అబ్బాయి కోసమొచ్చారా?"– అని నన్ను చూపుతూ మా అమ్మనడుగుతోంది సుందరి తల్లి. నా గొంతులోవున్న లడ్డూ ముక్క గొంతులోంచి లోపలికి దిగటంలేదు. ఎలాదిగుతుంది? అమ్మబయటి కెళ్ళినప్పుడూ, అమ్మమ్మ పడుకున్నప్పుడూ నే నెవరికంటా పడకుండా, రావు గారి గది దగ్గరకి పారిపోయొచ్చాను. మా అమ్మ కోపంతో వూగిపోతోంది. నన్ను చూడగానే, గుమ్మంలోవున్న సుందరిని పక్కకితోసి, లోపలికొచ్చింది. నా దగ్గర కొచ్చి– "దరిద్రపుగొట్టు వెధవా ! ఈ అడుక్కుతినే బుదు లెలా వచ్చాయిరా? ఇంటింటికీ వెళ్ళి అడుక్కుతింటా వెందుకురా? ఇంట్లోంచి ఒక్కఅడుగు బయటపెట్టావంటే కాళ్ళిరగ్గొడతానని నీకు చెప్పానాలేదా? నన్నేడిపించటానికే పుట్టావురా దరిద్రుడా!" – అంటూ దబదబా నాలుగు దెబ్బలేసింది. నాకు బాగా దెబ్బతగిలింది. ఏడవటం మొదలెట్టాను. నేను ఏడవటంచూసి సుందరికూడా భయపడింది. "నాపెళ్ళికొడుకుని ఎందుకు కొట్టావ్?"–అంటూ తనూ ఏడవటం ప్రారంభించింది. "ఇదేమిటమ్మా? ఎందుకు పాపం పిల్లాణ్ణి అలాకొడతారు? అతనేం చేశాడు? వదలి పెట్టండి.... అతను బయటే నిలబడ్డాడు పాపం! నేనే లోపలికి తీసుకొచ్చాను .... దయచేసి కొట్టకండి...."– అంటూ సుందరి తల్లి నన్ను విడిపించటానికి ప్రయత్నించింది. నన్ను చూసి ఆమె జాలి పడింది. నిజంగానే ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి. కాని మా అమ్మ మనసు మాత్రం ఏమీ ద్రవించలేదు. పైగా–"వీడి సంగతి మీకేంతెలుసు? వీడెంత వెధవో మీకేం తెలుసు ? వీడు మొన్న ఏం చేశాడో

తెలుసా? అందర్నీ ఉరికంబమెక్కించే పనిచేశాడు! గదిలో నిప్పంటించుకుని చచ్చేవాడు....మీకేంతెలుసు....?"- అంటూ, వున్నట్టుండి అమ్మ ఏడవటం మొదలెట్టింది. అమ్మ అలా ఏడవటం నాకు బాగానే వుంది. ఎందుకంటే అప్పటి దాకా మాటిమాటికీ నా మీదికి వురుకుతున్న అమ్మచెయ్యి ఆగిపోయింది. ఆడవాళ్ళ తత్వం భలే విచిత్రంగా వుంటుంది. పిల్లల్ని ముందు కొడతారు; తర్వాత కొట్టినందుగ్గాను వాళ్ళే ఏడుస్తారు. ఇలాంటి అనుభవం నాకు చాలా సార్లు కలిగింది. ఇలాంటి అనుభవం అందరికీ కలిగే వుంటుంది! సరే, పోనివ్వండి!

భగవంతుడి దయవల్ల నన్ను కొట్టే మా అమ్మ చెయ్యి ఆగిపోయిందని యింతకు ముందే చెప్పాను. అమ్మ కొట్టి కొట్టి అలిసిపోయింది. సుందరి తల్లి తియ్యటి మాటలవల్లా, సుందరి మధుర వాక్కుల వలా ఆమె కోపం కాస్త తగింది. సుందరి మరోసారి నన్ను 'పెళ్ళికొడకా!' అని పిలవటంతో అమ్మ కోపం కాస్త తగ్గింది.

## ఆహా! ఉత్తరం దొరికింది!

అమ్మమ్మ దగ్గర కెళ్ళగానే మాఅమ్మ మరోసారి నామీద విరుచుకు పడింది. మళ్ళీకొట్టడానికి చెయ్యెత్తింది గాని, అమ్మమ్మ ఆ చెయ్యి విసిరికొట్టింది. 'నీ గారాబం వల్లనే వాడిట్టా తయారౌతున్నాడు!'-అంటూ అమ్మమ్మ మీదకూడా విరుచుకు పడింది అమ్మ. "నేను గారాం చేస్తున్నానా? పసిపిల్లవాడు. నేనేమో పడుకున్నాను; ఏమీతోచక ఆడుకోవటానికెళ్ళి వుంటాడు. ఈ మాత్రానికే యింతగా కొట్టాలా? నీకిన్ని ఏళ్ళొచ్చాయి; ఏదైనా మాట చెబితే ఒక్కొక్కటప్పుడు నువ్వే వినవే?....వాడేమో పసిపిల్లాడు; వాడెట్టా వింటాడు?"- అంది అమ్మమ్మ. నాపక్షాన ఈ విధమైన సమర్థన విని నేను సంతోషించాను. ఇక దెబ్బలుకూడా తగలవు! కాని అమ్మమ్మని విడిచిపెట్టకూడదు. అమ్మమ్మ మాటలు వినగానే అమ్మకోపం పెరిగిపోయింది. నాభుజం పట్టుకుని-"వెళ్ళరా, వెళ్ళు! వెళ్ళి యింకా

బాగా ఆడుకో! వెళ్ళి ఈసారి మేడంతటికీ నిప్పెట్టి తగలబెట్టు....వెళ్ళు!"- అంటూ, నన్ను నిజంగానే గదిలోంచి బయటికి ఒక్కతోపు తోసింది. ఈసారి గొడవేమీ లేకుండా బయటే కూర్చుంటే బావుండునేమో అనిపించింది నాకు. మళ్ళీ లోపలికి వెళితే తిట్లు తినక తప్పదు. అందుకని మాట్లాడకుండా అక్కడినుంచి వెళ్ళి, బయట తాతగారు కూర్చునే గదిలోకి వెళ్ళి కూర్చున్నాను. ఇంకా తాతగారు గాని, ఆయన పిల్లలుగాని రాలేదు. అక్కడ ఆ విధంగా అయిదారు నిమిషాలు కూర్చున్నానేమో. నా చాపల్యం నన్నక్కడ అంతకంటే ఎక్కువసేపు కూర్చోనివ్వలేదు. చాపల్యం ఎవరికైనా వుంటుందేమో. చాపల్యం సఫలమైతే పొగుడుతారు; లేకపోతే తిడతారు. కూర్చునే నా పనులు నేను ప్రారంభించాను. కాస్సేపు ఆకాలు యిటూ, ఈకాలు అటూ మారుస్తూ, అటూయిటూ కదులుతూ కూర్చున్నాను. మరికాస్సేపు తలుపుకి ఎన్నిచెక్కలున్నాయో లెక్కబెట్టాను. ఆ తర్వాత గదిలో మొత్తం ఎన్ని వస్తువులున్నాయో లెక్కబెట్టడం ప్రారంభించాను తర్వాత కూర్చున్న చోటినుంచి లేచివెళ్ళి ఆ వస్తువులేమిటి; ఎలావున్నాయీ అని పరీక్షించసాగాను. దూరాన్నుంచి లెక్కబెడుతుంటే తప్పులొస్తున్నాయి; అందుకని ఒక్కొక్క వస్తువూ పట్టుకుని చూసి మరీ లెక్కబెట్టడం ప్రారంభించాను. ఇంతలో చటుక్కున రావుగారి గదిలో నాకు దొరికిన కవరుసంగతి గుర్తొచ్చింది. దానికోసం వెదకడం ప్రారంభించాను. వస్తువులు పరీక్షించే ఆసక్తి పోయింది. కవరుకోసం అంతా వెదకడం మొదలెట్టాను. బల్లదగ్గర కెళ్ళాను. సొరుగులో ఆ ఉత్తరముంటుందేమో అనిపించింది. సొరుగు తెరవడానికి చెయ్యి ముందుకు చాచాను. కాని సొరుగు తెరవకుండానే నాకాఉత్తరం కనబడింది! కవరు విప్పివుంది. లోపల మరో చిన్న కవరుంది. అదికూడా విప్పేవుంది. బయట కవరుమీద స్టాంపుల్లేవు. లోపల చిన్న కవరుమీద స్టాంపులంటించివున్నాయి. పెద్దకవర్లో ఒక ఉత్తరం వుంది. కవరు చూడగానే నాకు చాలా సంతోషం కలిగింది.

## ఇంటికి వెళ్లాం; కాని ఉత్తరమేదీ?

ఈ మధ్యలో చాలా విషయాలు జరిగాయి. నేనూ, అమ్మా, అమ్మమ్మా అంతా మావూరు వెళ్ళిపోయాం.

బండి స్టేషన్లోవచ్చి ఆగింది. మమ్మల్ని యింటికి తీసుకెళ్ళడానికి యింటి దగ్గర్నుంచి ఎవరైనా వస్తారనుకున్నాం. అటూ ఇటూ వెదికాం. అమ్మా, అమ్మమ్మా పెట్టేబేడా పుచ్చుకుని, నన్నొక చేత్తోపుచ్చుకుని కాస్సేపు అటూయిటూ తిరిగారు. కాని ఎవరూరాలేదు.

"మనరాతే యిటువంటిది! మన అవసరం ఎవరికీ లేనేలేదు. ఈ మనిషికి ఎంతసేపూ నిద్రే. కనీసం ఆనంది కన్నా ఆ జ్ఞానంవుండొద్దూ? నౌఖరుకి ఒకసారో అరసారో చెప్పినంత మాత్రాన వాడు వింటాడా? అక్కడికీ ఉత్తరం కూడా రాస్తిమి; మావెంట ఎవరూలేరు; ఎవరినైనా స్టేషన్‌కి పంపండీ అని; ఏదీ, ఎక్కడ పంపారు? అబ్బబ్బ! ఈ సంసారంతో నాకు పిచ్చెక్కిపోతోంది! అంతా విడిచిపెట్టి ఎక్కడికైనా పోతే బావుండు ననిపిస్తుంది!"— ఈ రకంగా గొణుగుతూ అమ్మమ్మ మమ్మల్నిస్టేషన్ బయటికి తీసుకొచ్చింది. నౌఖరు వచ్చాడేమోనని మళ్ళీ ఒకసారి చుట్టూ చూశాం. అమ్మా, అమ్మమ్మావాడి పేరు పెట్టి పిలిచారు. నేనుకూడా పిలిచాను. నేను చాలా బిగ్గరగా పిలిచాను. చుట్టూవున్నవాళ్ళునవ్వారు. ఇక మేమే బండి చేసుకుని వెళ్ళాలి. స్టేషన్ లోంచి బయటికి రావటంలో మేము చేసిన ఆలస్యంవల్ల బళ్ళన్నీఅప్పటికే వెళ్ళిపోయాయి. మేము బయటి కొచ్చి నౌఖరుని వెదికేప్పుడు కూడా ఒక బండి వుంది. ఇప్పుడదీ వెళ్ళిపోయింది. అక్కడికీ ఒకరిద్దరు అడిగారు 'బండికావాలా'? అని. వద్దు, మా నౌఖరు వస్తాడు; వాడు బండిమాట్లాడే వుంటాడు."— అని అమ్మమ్మ వాళ్ళని పంపివేసింది. చివరికి ఒక బండిదొరికింది. కాని ఆ బండివాడు ఒకరూపాయిమ్మని అడిగాడు. ఇకచేసేది లేక అమ్మమ్మ ఎడ్లబండి మాట్లాడింది. మేంమా ఇంటికి చేరుకున్నాం. 'మాయిల్లు' అంటే అమ్మమ్మగారిల్లు అని నా అభిప్రాయం. ఈ సంగతి పాఠకులకి తెలిసేవుంటుంది. నేను పుట్టినయిల్లు 'మాయిల్లు' అనుకోవడంలో తప్పులేదనుకుంటాను.

బండి పరుగెత్తుతోంది. ఆకుదుపులకి మావాళ్ళంతా హూనమై పోయింది. బండివాడు ఎద్దుల్నితిడుతూతిడుతూ చివరికి ఎలాగైతేనేం, మాయింటికి చేర్చాడు. బండిదిగటంతోటే, నేను యింట్లోకి పరుగెత్తాను. మాతాత వసారాలో మంచమ్మీద కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు. గంగి—నాకంటే ఒకటిన్నర సంవత్సరాలు పెద్దది—మా అక్క తాత పక్కనే కూర్చుంది. మమ్మల్ని చూడ్డంతోటే—"తాతా! తమ్ముడొచ్చాడు! అమ్మవచ్చింది! అమ్మమ్మ వచ్చింది!"—అంటూ అరవటం ప్రారంభించింది. అయినా తాత కునికిపాట్లు పడుతూనే వున్నాడు. చివరికి అమ్మమ్మవచ్చి మాట్లాడ్డం మొదలెట్టాక గాని, ఆయనకి మెళుకువరాలేదు. "ఏమైంది? ఏమైంది?" — అంటూ లేచాడు. నౌఖరు రాకపోవడం వల్ల అమ్మమ్మ కోపంలో వుందని గ్రహించి — "నేను వాణ్ణి వెళ్ళమన్నాను; వచ్చే వుంటాడు; మీరుతొొందర్లో వచ్చేసి వుంటారు; ఇంకా వాడేంచేస్తాడు?" —అన్నాడు. ఈ రకంగా ఏదో గొణుగుతూ మళ్ళీ కునికిపాట్లు పడటం ప్రారంభించాడు. అమ్మమ్మ కాస్సేపు బడబడావాగి ఆతర్వాత యింట్లోకి వెళ్ళిపోయింది. అమ్మమ్మ వెంటే నేనూ గంగీకూడ లోపలికెళ్ళాం. ఇంతలో అమ్మకంటే కాస్త చిన్న వయసున్న ఒక స్త్రీ వచ్చింది. ఆమెకికూడా చివాట్లు తగిలాయి. మరి కాస్సేపటికి నౌఖరు కూడవచ్చాడు."ఎవరూ స్టేషన్లో కనబళ్ళేదు నాకు!"—అంటూ వచ్చాడు వాడు.

అమ్మమ్మ కోపం యింకా పెరిగిపోయింది. వాడు స్టేషన్‌కి వెళ్ళకుండా తన యింటికి వెళ్ళివుంటాడని ఆమెవుద్దేశ్యం. అందర్నీకాస్సేపు చివాట్లేసి, ఆతర్వాత తన అదృష్టాన్ని కాస్సేపు తిట్టుకుని, అమ్మమ్మ మాట్లాడకుండా కూర్చుంది. కాస్సేపటి తర్వాత అత్త (ఆనంది) మెల్లగా—"పద, స్నానంచేద్దువు గాని; వేడి నీళ్ళుపెట్టాను..."—అంది. అమ్మమ్మ మరేమీ మాట్లాడకుండా లేచి వెళ్ళింది.

నేనూ గంగీ ముంగిట్లో కూర్చున్నాం. ఊరినుంచి అప్పుడే రావటంవల్ల మా తగాదా యింకా ప్రారంభం కాలేదు. అన్నిరోజుల తర్వాత కలవడం వల్ల బహుశా నామనసు పోట్లాటకి సిద్ధపడలేదేమో. అందువల్ల యిద్దరమూ చాలా ప్రేమగా మాట్లాడుకోవటం ప్రారంభించాం. బొంబాయిలో ఎంతపెద్ద యిళ్ళుంటాయో గంగికి చెప్పాను.

ఇవ్వాళ నాజేబు జాగ్రత్తగా చూసుకుంటున్నాను. జేబులో ఏదో ముఖ్యమైన వస్తువు దాచిపెట్టినట్టు అక్కకి తెలిసిపోయిందేమో అనిపించింది నాకు.

సాయంత్రమైంది. ప్రయాణపు బడలికవల్ల నేను కునికిపాట్లు పడసాగాను. నిద్రపోయాను. చాలా గాఢంగా నిద్రపట్టింది. పొద్దున్నే అమ్మమ్మ వచ్చి లేపుతూవుంటే, ఇన్ని గంటలు నేనెక్కడ వున్నానా అనిపించింది.

పొద్దున్న లేచినప్పుడు కవరు సంగతి గుర్తులేదు. తొమ్మిదీ పదింటికి చాకలి వస్తే – అమ్మమ్మ నా లాగు యిమ్మని అడిగింది. నాకివ్వటం యిష్టంలేదు. ఎందుకివ్వనో కారణం కూడా చెప్పలేదు. కవరు ఎక్కడైనా దాచేద్దామని చటుక్కున ఒక మూలకి పరుగెత్తాను. జేబులో చెయ్యిపెట్టి చూశాను. ఇదేమిటి? ఉత్తరం లేదు! అదృశ్యమై పోయింది!

## తిరస్కారం

దేనికోసమైతే యిప్పటిదాకా శతవిధాల ప్రయత్నించానో, చివరికి ఆ కవరు నా చెయ్యిదాటిపోయింది. ఈ విషయం నాకు చాలా బాధ కలిగించింది. గంగే ఆకవరు కొట్టేసిందని నా అనుమానం. గంగి తప్ప ఇంకెవరూ ఆ పని చెయ్య లేరని నాకు తెలుసు. ఆ ఉత్తరం మళ్ళీ నాచేతికి రావటానికి ఏంచెయ్యాలా అని ఆలోచించ సాగాను. గంగిని – గంగిని – గంగిముండని కొరకాలా? గిచ్చాలా? కొట్టాలా? ఇంకేం చెయ్యాలి? నాకేంతోచలేదు. ఆ కవరు ఏమైందో ఎక్కడికి పోయిందోతెలీదు. దానికోసం ఎంత వెదికాను! ఎంత వెదికాను! గంగ ఒంటరిగా దొరగ్గానే కవరు ఏం చేశావని అడిగాను. బాగా తిట్టాను కూడా. అక్క ఏదో సమాధానం చెప్పబోయింది. కాని నేను వింటేగా? ముందూవెనకా చూడకుండా గట్టిగా భుజంపట్టుకుని కరిచేశాను. ఎంతగట్టిగా కరిచానో నానోటికి తెలుసు! గంగ భుజానికి తెలుసు. నేను కరవగానే అక్కబిగ్గరగా ఏడుపుమొదలెట్టింది. అక్కఏడుపువినగానే అమ్మవెనక నుంచి వచ్చి నావీపుమీద ఒక్కచరుపు చరి చింది. చెవిగట్టిగానులిమి మళ్ళీ రెండు మూడు దెబ్బలు వేసింది. గంగని మళ్ళీ

కరవాలన్న కోరిక పుట్టకుండా వుండే విధంగా కొట్టింది. కాని—విచిత్రమేమి టంటే, నేను ఎవరినైతే కరిచానో, ఆ అక్క అమ్మ బారినుండి నన్ను రక్షించ డానికి ప్రయత్నించింది. "వద్దమ్మా, అంతగా కొట్టొద్దమ్మా" అంటూ అడ్డం వచ్చింది. అక్క అడ్డురావటం వల్ల నన్నుకొట్టడానికి ఎత్తినచెయ్యి అమ్మదింపి వేసింది. ఇంతలో నేను ఏడుస్తూ, అరుస్తూ అక్కడి నుంచి తప్పించుకు పారి పోయాను.

కవరుకాజేసింది; దానివల్ల నేను దెబ్బలుకూడాతినవలసి వచ్చిందని అక్క మీద నాకు బాగా కోపంగావుంది. చచ్చేదాకా ఎన్నడూ గంగతో మాటాడకూడదు; దాని దగ్గరకెళ్ళ కూడదు; దాన్ని నాదగ్గరకి రానివ్వకూడదూ అని నిశ్చయించు కున్నాను. దాన్ని అంటుకోకూడదు; నన్ను అంటుకోనివ్వకూడదు – అని కూడా అనుకున్నాను. అమ్మమ్మచేత బాగా కొట్టించాలనుకున్నాను.

కాని లాభంలేక పోయింది. బాగా ఏడుస్తూ, అమ్మమ్మ కోసం యిల్లంతా వెదికాను. కాని అమ్మమ్మ ఎక్కడా కనబడలేదు. ఇంకా బిగ్గరగా ఏడిస్తే అమ్మమళ్ళీ నాపని పడుతుంది. అందుకని ఆనంది అత్త దగ్గర కెళ్దామనుకున్నాను. అత్తకి నేనంటే యిష్టం. కాని అత్తకూడా ఎక్కడా కనబడలేదు. చివరికి నోరు మూసుకుని వూరుకోవాల్సి వచ్చింది. రెండో అంతస్తులో చీకటి కొట్టు లాంటి గది వొకటుంది. ఇలాంటి సమయాల్లో ఆగదేనాకు ఆశ్రయమిస్తుంది. అక్కడికెళ్ళి కూర్చుని, ఎవరెంత బ్రతిమాలినా, ఎవరెంత పిలిచినా ఛస్తే అక్కడి నుంచి కిందికి దిగిరాకూడదనుకున్నాను. నన్నెవరైనా పిలుస్తారా లేదా అని నిరీక్షిస్తూ కూర్చున్నాను.

మాయిల్లు బాగా పెద్దది. ఇంట్లో మనుష్యులు తక్కువ కావటంచేత పై అంతస్తు అద్దెకిచ్చారు.నేను మెట్లదగ్గిర ఏమైనా అలికిడైతేచాలు–నన్ను బ్రతిమాల డానికి ఎవరైనా వస్తున్నారేమో; ఏమైనాసరే కిందికి వెళ్ళకూడదూ అనుకుని బిగుసుకుపోయి కూర్చునేవాణ్ణి. తీరాచూస్తే, మెట్లెక్కిన వ్యక్తి మాయింటి వాడుకాదు; అద్దెకున్నవాడు; పక్కగదిలో కెళ్ళి పోయాడు. నాకు ఆశాభంగ మైంది. ఇలా దాదాపు గంటసేపు గడిచింది. ఎవరూరాలేదు. మెట్లదగ్గర కెళ్ళి ఎవరైనా వస్తున్నారేమో చూడాలనిపించింది.

మెల్లగామెట్లుదిగి కిందికి వెళ్ళసాగాను. సగం మెట్లుదిగాను. నాగురించి ఎవ రైనా మాట్లాడుకుంటున్నారో లేదో విందామని కాస్త ఆగాను. కింద గదిలోంచి మాటలు వినబడుతున్నాయి. "అమ్మా! ఎందుకలా ఏడుస్తావ్ ! తమ్ముడు ఎక్కడా కనబడలేదనేనా!" నాకామాటలు విని చాల సంతోషమైంది. అమ్మ నన్నుకొట్టింది; అందుకే అలా ఏడుస్తోంది, అనుకున్నాను. ఇప్పుడు అమ్మ నన్ను వెదుకుతూ యిక్కడికిరావచ్చు. ఆ ఆలోచన రాగానే చటుక్కున వెనక్కి తిరిగి మళ్ళీ పై కెళ్ళిపోయి బొమ్మలా కదలకుండా కూర్చున్నాను. ఇంతలో మళ్ళీ కొన్నిమాటలు వినిపించాయినాకు. "ఇక్కడే ఎక్కడోవుంటాడు వెధవ!.... ఆదరిద్రుడి పేరుతలవటంకూడా నాకు యిష్టంలేదు!"– అమ్మఅన్న ఆమాటలు విన్న నామనోస్థితి ఎలావుంటుందో మీరూహించుకోండి. అమ్మ నన్ను బ్రతిమాలి తీసుకెళ్ళడానికి వస్తుందీ అన్న నా ఆశ నీరై పోయింది. మనసులో కట్టుకున్న మేడలన్నీ పేకమేడలై కూలిపోతుండగా– అక్కఅన్నమాటలు కాస్తతృప్తిని కలిగించాయి". పై అంతస్తులో వున్నాడో లేడో నేను వెళ్ళి చూసి వస్తాను"– అంటూ అక్కమెట్లదాకా వచ్చింది.

నేను నాస్థానంలో కదలకుండా కూర్చున్నాను. అక్కవచ్చింది. పక్కగదిలో, ముందుగదిలో, వెనకగదిలో బాల్కనీలో ఆఖరికి అద్దెకున్న వాళ్ళయింట్లో కూడా నాకోసంవెదికింది. నేను కనబడలేదు. నేను ఆచీకటిగదిలో ఒక మూల నక్కి కూర్చున్నాను. ఆఖరికి అక్క ఆగదిలోకి కూడ వచ్చి అటూయిటూ చూసింది. నేనుమరీ జాగ్రత్తగా కూర్చున్నాను. ఊపిరి బిగబట్టి కూర్చున్నాను. అయినా అక్కనన్ను చూస్తుంది; కిందికి వెళ్దాం పదమని నన్నుతీసుకెళ్తుందీ అనుకున్నాను. కాని ఆగుడ్డిదానికి నేను కనబళ్ళేదు. "అయ్యో, ఎక్కడున్నాడో ఏమో కనబళ్ళేదు....ఏంచెయ్యను?"– అంటూ పెద్దవాళ్ళకి మల్లే ఒక నిటూర్పు విడిచి వెళ్ళి పోతోంది. అయినా నేను గర్వంగా కదలకుండా అలాగే కూర్చు న్నాను. మెట్లదాకా అక్కవెళ్ళి పోయాక– 'ఇకలాభంలేదు; నావునికి నేనే తెలియబర్చుకోవాలి.... ఒకవేళ వెళ్ళిపోయిందంటే...' అనుకున్నాను. ఆ ఆలోచన రాగానే మెల్లగా దగ్గాను. కాని అక్కకి వినబళ్ళేదుగావును; మెట్లు దిగుతూనేవుంది. ఇంకేంచెయ్యాలి? మాట్లాడ్డంతప్ప మరో మార్గంలేదు. గబ

గబాలేచి మెట్లదగ్గర కెళ్ళి, కోపంగా — "ఏమే, ఎందుకొచ్చావే ముండా నేను రానేరాను పో! నాతో మాట్లాడకు....నేను జన్మలో నీతో మాట్లాడను! మాట్లాడను! మాట్లాడను : .... మాట్లాడను ! నాలోమళ్ళీ మాట్లాడావంటే జాగ్రత్త! నన్ను బాగా కొట్టించావుగా ? — " అన్నాను. ఆ తర్వాత నేను మళ్ళీ వెళ్ళి చీకట్లో మూలకూర్చున్నాను. అక్క నన్ను బుజ్జగించడానికి తప్పకుండా వస్తుందని నాకు తెలుసు. వచ్చిందికూడా. దాన్ని చూసి నేను మరీ బిగుసుకు పోయాను. "నేనునీతో జన్మలో మాట్లాడను!"— అని అక్కతో కనీసం యాభైసార్లయినా అని వుంటాను. కానిఅక్క—"ఎందుకురా తమ్ముడూ అట్లాఅంటావ్! నువ్వు నన్ను ఎంత గట్టిగా కరిచావ్ : ఆబాధలో నాకు తెలీకుండానే బిగ్గరగా అరిచాను. నా అరుపు విని అమ్మ ఖంగారుగా పరుగెత్తుకొచ్చింది. అమ్మనిన్ను కొట్టింది. నేనేం చెయ్యను? అక్కడికీ నిన్నువిడిపించడానికి ప్రయత్నంచేశానా లేదా, చెప్పు. పద, కింది కెళ్దాంపద! అన్నానికి వేళయింది; అమ్మమ్మ యిప్పుడొస్తుంది; గుడికెళ్ళింది ....పద?"— అని ఈరకంగా అంటూనేవుంది. అక్క బ్రతిమాలిన కొద్దీ నేనింకా బెట్టుచెయ్యటం ప్రారంభించాను. నిజంగా అక్క ఎంత మంచిది పాపం : న్యాయంగా అలగాలంటే, ఆ అధికారం అక్కదే. ఎందుకంటే మొదట కొరికింది నేను; ఆ గుర్తు దాని భుజంమీద యింకా అలాగేవుంది. ఇది జరిగి ఎన్నో సంవత్సరాలైంది. కాని ఇప్పటికీ నాదంతాల మంట యింకా చల్లారలేదు. ఆవిధంగా కరిచినప్పుడు అక్కకి ఎంత బాధకలిగి వుంటుందో మనం వూహించుకోవచ్చు. అయినాకూడ అక్క నన్ను బుజ్జగించడానికి వచ్చింది. అక్కది ఎంత ఉదారహృదయం :

అక్క బ్రతిమాలినకొద్దీ నేనింకా బెట్టుచెయ్యడం ప్రారంభించానని చెప్పాను గదా : నిజానికి నిష్కారణంగా — నువ్వలాటిదానివి; ఇలాటి దానివని అక్కని తిట్టడం ప్రారంభించాను. చివరికి — "సరే, నువ్వు రాకపోతే నేను అన్నం తినను!" — అంది అక్క. నేను వెంటనే — "తినబోకు : నిన్నెవరు తినమన్నారు! తినకపోతే వూరుకో!" — అన్నాను. ఆ మాటకొస్తే అక్కకూడా చిన్నదేగదా. వయసులో నాకంటే కొంచెం పెద్దది — అంతే. అది మాత్రం ఎంతసేపని గంభీరంగా వుంటుంది. నేనెంతచెప్పినా వినకపోయేసరికి

"సరే, నామాట వినవుగా ?" – అంటూ లేచి వెళ్ళిపోతోంది. నేనెంత పని చేశాను. అక్కనన్నింకా బతిమాలుతుందేమో అనుకున్నాను. కాని దేనికైనా ఒక హద్దుంటుందిగదా! ఇంతలో కిందనుంచి అమ్మమ్మ కంఠం వినిపించింది. అమ్మమ్మమాట వినగానే నాకు సంతోషం కలిగింది. నేను మళ్లీ ఏడుస్తూకూర్చుంటే, అమ్మమ్మచేత అక్కని తన్నించవచ్చునన్న ఆశకూడా కలిగింది.

అంచేత అలాగే కూర్చుని కోపంగా – "పో, పో ! మళ్లీ నాతో మాట్లాడకు!" – అన్నాను. పాపం యింకేమి చెయ్యలేక అక్క వెళ్ళిపోయింది. మెట్లు దిగుతూ దిగుతూ – "అమ్మా! తమ్ముడు రానంటున్నాడు; ఎంత బ్రతిమాలినా వినటంలేదు...." – అంటూవెళ్ళింది. అమ్మమ్మ వెంటనే – "వాడున్నాడా అక్కడ? రాకపోతే వుండనీ! ఏదీ, నిన్నెక్కడ కొరికాడో చూద్దాంరా! అయ్యో, అయ్యో! ఎట్లాకొరికాడు! సర్లే, వాణ్ణి అక్కడే వుండనీ! ఇవ్వాళ వాడికి అన్నం కూడా పెట్టను! రోజురోజుకీ వాడి ఆగడాలు మితిమీరి పోతున్నాయి; అందర్నీ ఏడిపిస్తున్నాడు. నువ్వుపద; వాణ్ణింకెవరూ బ్రతిమాలనక్కర్లేదు, పద!" – అంది కోపంగా. అమ్మమ్మ అలా మాట్లాడుతుందని నేను వూహించనైనాలేదు. నా తిరస్కారం ఎంత పనిచేసింది! ఇక నేనే కిందికి దిగి వెళ్ళాల్సి వచ్చేట్టుంది. ఇప్పుడు అక్క ఏదో విధంగా ఒక్కసారి మళ్ళీవస్తేచాలు; పిలవగానే లేచి వెళ్ళిపోతాను; అలా అనుకుని ఎదురుచూస్తూ అక్కడే కూర్చున్నాను. ఇంకెవరొచ్చి పిలిచినా వెళ్ళకూడదని కూడా అనుకున్నాను.

ఇంతలో మెట్లమీద అలికిడైంది. ఎవరో నన్ను తీసుకెళ్ళడానికి వస్తున్నారనుకున్నాను. ఎవరై వుంటారు ? అక్కమాత్రం కాదు; అమ్మమ్మ అయి వుండొచ్చు. మెట్లమీద శబ్దం పెరిగినకొద్దీ నాలో ఆందోళన కూడ పెరగ సాగింది. ఆ వచ్చిన వ్యక్తి గుమ్మం దగ్గర ఆగి – "ఏరా! కిందికి దిగొస్తావా. లేకపోతే... నేను...." – అది అమ్మకంఠం. అమ్మ చెప్పబోయిందేమిటో నేను వూహించుకోగలను. అమ్మ ఎంత కోపంగా ఆ మాటలందంటే, ఆస్వరం వినే గడగడలాడి పోయాను. నేను వెంటనే లేచివెళ్ళి, తలవంచుకుని అమ్మముందు నిలబడ్డాను. అక్కణ్ణించి కిందికి పారిపోవాలనిపించింది. కాని యింతలో

అమ్మ నాచెయ్యి పట్టుకుంది. మాట్లాడకుండా అమ్మతోపాటు కిందికి దిగివచ్చాను. ఎవరితోనూ మాట్లాడకూడదని నిశ్చయించుకున్నాను. ఇంట్లో అందరూ చెడ్డ వాళ్ళే. నాతో మాట్లాడ్డానికి, నేను మాట్లాడ్డానికీ ఎవరూ అర్హులు కారు. అందుకే అన్నంతినేప్పుడు కూడా ఎవరితోనూ మాట్లాడలేదు. అన్నంతిన్నాక మళ్ళీపైకి ఆగదిలోకే వెళ్దామనుకున్నాను. వెళ్ళబోతూంటే – "ఈ చీకట్లోపైకి వెళ్లొద్దు!" – అని కఠినంగా ఆజ్ఞాపించింది అమ్మమ్మ. అయినా వినకుండా నేను వెళ్ళబోతూవుంటే – ఎదురుగా అమ్మ ; అమ్మమ్మ కూడా నాపట్ల అంత కఠినంగా వుండటంవల్ల నా మనసు పాడైపోయింది. చచ్చినట్టు అక్కడే కూర్చుండి పోయాను. అమ్మమ్మకూడా అన్నంతింది. తిన్నతర్వాత నాతో – "ఊఁ. సరే, దాన్ని కోరికావుగా ? నేనునిన్ను మళ్ళీ స్కూల్‌కి పంపుతాను, చూసుకో!" – అంది.

బొంబాయి వెళ్ళడానికి కొద్దిరోజులముందే నేను స్కూలుకి వెళ్ళాను.

బొంబాయినుంచి తిరిగివచ్చాక రెండుమూడు రోజుల్లో స్కూలుకి వెళ్ళాల్సి వుంటుందని నేను ముందే వూహించుకున్నాను. అంచేత అమ్మ బెదిరింపు నామీద అంతగా పనిచెయ్యలేదు. కాని – ఆరోజు స్కూలుకి వెళ్లాలనిపించ లేదు. స్కూలుకి వెళ్ళకుండా వుండటానికి ఏంచెయ్యాలా అని ఆలోచించ సాగాను. అమ్మమ్మకూడ ఆవేళ కాళికావతారం దాల్చివుంది. అందువల్ల ఆమెవల్ల ఏమీ లాభం వుండదు. నేను ఏడ్చినా కూడ ఏమీ లాభం వుండదని గ్రహించాను. అమ్మమ్మ యిప్పుడే అన్నం తింది ; ఇక పడుకుంటుంది; అప్పుడు నేను పక్కనచేరి తియ్యతియ్యగా ముద్దుముద్దుగానాలుగు మాటలుచెప్పి, నాపని పూర్తిచేసుకోవచ్చు అనే ఆలోచనలో వున్నాను నేను. కాని యివ్వాళే అమ్మమ్మకి ఏంబుద్ధిపుట్టిందో ఏమో! చాల రోజుల్నించి ఇంట్లో ఎవరితోనూ కబుర్లు చెప్పడానికి వీలుకాలేదు – బొంబాయివెళ్ళి రావటంవల్ల. ఇవ్వాళ – అమ్మ ; ఆనంది అత్త ; అమ్మమ్మ – ముగ్గురూ కూర్చుని ముచ్చట్లాడ్డం ప్రారంభించారు. చివరికి నాకు స్కూలుకి వెళ్ళక తప్పలేదు.

## ఇదేమిటి?

నేను నిరాశతో స్కూలుకి చేరాను. స్కూలు సమయం దాటిపోయింది. మా పెద్ద 'సార్' యింకా స్కూల్‌కి రాలేదని నాకు దార్లోనే తెలిసింది. స్కూల్లో పిల్లలు అల్లరి చేస్తున్నారు. పిల్లలు అల్లరి చేసేప్పుడు స్కూలుకి వెళ్ళటం నాకు భలేయిష్టం. అందరితో పాటు నేనూ అల్లరిచెయ్యొచ్చు. క్లాసులో టీచర్ గనుక వుంటే ఎవరు అల్లరిచేస్తున్నదీ తెలుసుకుంటాడు. స్కూలు ప్రారంభించడానికి కాస్తముందుగా వెళ్ళటం నాకిష్టం. అలాగే స్కూలయి పోయాక క్లాసులో కూర్చోవటం కూడ అసహ్యమే.

నేను స్కూలో అడుగు పెట్టానోలేదో, – వినాయక్ పక్కన కూర్చున్న కుర్రాడు – "ఒరే, ఒరే! ఈ అయ్యగారు బొంబాయినుంచి దిగార్రోయ్! తిరిగి వచ్చేవారు కాదు! తమ తండ్రిగారి దగ్గరకి వెళ్లారు!" – అంటూ అరిచాడు. వాడలా అరవటంతో కుర్రాళ్ళందరి దృష్టి నామీద పడింది. నేను సిగ్గుతో కుంచించుకు పోయాను. బొంబాయి వెళ్లేముందు నేను వినాయక్‌తోనూ, యింకా వాడి స్నేహితులతోనూ తెగ మాట్లాడాను. "మానాన్నగారి దగ్గర కెళ్తున్నాను!" – అని గొప్పలు చెప్పాను. దాని పరిణామం యిలా వుంటుందని వూహించలేక పోయాను. "ఈ దరిద్రపు స్కూల్లోకి మళ్లీ రాను! ఈ దరిద్రపు కుర్రాళ్ళతో మళ్లీ మట్లాడను!" – అని గప్పాలుకొట్టాను.

"మా నాన్నగారు బొంబాయిలో వున్నారు; ఆయన దగ్గరకి వెళ్తున్నాను మళ్లీ పూనా రానేరాను!"–అని వాళ్ళందరితోనూ చెప్పాను. ఇలా జరుగ తుందని నేను కలలో కూడ అనుకోలేదు. నేను ఈ రకంగా వాళ్ళతో మాట్లా డిన సంగతికూడ మర్చిపోయాను. నేనన్నమాటలన్నీ గుర్తుంచుకుని, వినాయక్, వాడి మిత్రులూ నన్ను హేళన చేస్తారని నే నూహించలే పోయాను. నేను స్కూలుకొచ్చే దార్లో — ఆలస్యమై పోయింది టీచరుచేత దెబ్బలు తినాలి – అనుకున్నానే గాని యిలా అవుతుందని వూహిం లేదు. తీరా యిక్కడికొస్తే యిక్కడజరిగిందిది! వాళ్ళ మాటలువిని ప్రాణం చచ్చింది. సిగ్గేసింది. నన్నునేను సంభాళించుకుని, పిల్లలవే

చూడసాగాను. గబగబా వెళ్ళి, కోపంగా ఆ కుర్రాడి భుజం పట్టుకుని – "అవున్రా ! నాయిష్టమొచ్చినప్పుడు వెళతా; నాయిష్టమొచ్చినప్పుడు వస్తాను ! నీకెందుకు ?" – అన్నాను. దానివల్ల ఏమీ లాభం లేక పోయింది. వినాయక్ పక్షానవున్న కుర్రాళ్ళూ, వినాయక్ స్వయంగా కూడ నన్ను యింకా ఎగతాళి చెయ్యడం ప్రారంభించారు. నాపార్టీవాళ్ళు కూడ ఒకరిద్దరున్నారుగాని, వాళ్ళు ఏమీ మాట్లాడకుండా కూర్చున్నారు. ఈ నాలుగురోజుల్లోనే ఆ స్నేహం అంతా ఏమైందో ! నాకోపం పెరిగిపోతోంది.

మొదట నన్ను వెక్కిరించిన కుర్రాడు కళ్ళు ఆర్పుతూ – "నేను బొంబాయి వెళ్తాను ! మానాన్నగారి దగ్గరకి వెళ్తాను ! మళ్లీ యిక్కడికిరాను!" – అంటూ అరవడం ప్రారంభించాడు. వాడికి వంతగా వినాయక్ – "తండ్రి తరిమేసి వుంటాడురా ! వీడిని తనదగ్గరెందుకుండనిస్తాడూ !" – అన్నాడు. నేను వినాయక్ భుజం పట్టుకుని వాడి చొక్కా లాగాను. టోపీ ఎగర గొట్టాను. జుట్టుపట్టుకుని గుంజాను.... క్లాసులో టీచరువచ్చి కూర్చున్నాడన్న సంగతి కూడా గమనించలేనంత కోపం వచ్చింది నాకు. వినాయక్‌ని ఏదోరకంగా కిందపడగొట్టి వాడి జుట్టుపీకాలన్నదే నాఆలోచన. ఆపని చేశానుకూడా. వాడు జుట్టు విడిపించు కోవటానికి ప్రయత్నం చేస్తున్నాడు. "భలేగావుంది ! భలేగావుంది !" – అంటూ పిల్లలు నలువైపులనుంచీ అరుస్తున్నారు. ఇంతలో – "అరెఅదేమిట్రా? వాడిని వొదులు !" – అని మెల్లగా అంటూ, మా అసిస్టెంట్ టీచర్ అక్కడి కొచ్చాడు. మేమిద్దరమూ ఒకళ్ళజుట్టొకళ్ళు పట్టుకుని వున్నాం. ఇద్దరమూ విడిపించుకోవటానికి ప్రయత్నం చేస్తున్నాం. నేను వాడి గుండెల మీదెక్కి కూర్చున్నాను. వాడి తల పట్టుకుని నేలకేసి కొట్టపోతున్నాను. ఇంతలో వున్నట్టుండి క్లాసులో గోల ఆగిపోయింది. గోల ఎందుకాగిపోయిందీ అన్న ఆలోచనేలేదు నాకు. వినాయక్‌ని ఏదోరకంగా బాగా తన్నాలన్నదే నాఆలోచన.

వినాయక్ గభాల్న నాజుట్టు వొదిలేసి, 'సార్ !' అంటూ అరిచాడు. కాని నేను వాణ్ణి వదల్లేదు. "పిరికివెధవా ! సార్‌ని ఎందుకు పిలుస్తావ్ ?" – అంటూ ఒక్క చరుపు చరిచాను. ఇంతలో ఎవరో వెనకనుంచి నా వీపుమీద ఒక్కటి వేశారు. వినాయక్ పార్టీ కుర్రాడేననుకుని – "వెనకనుంచి కొడతా

వెందుకురా, దొంగవెధవా ! దమ్ముంటే ముందుకురా !" – అని అరిచాను. అంటూనే వెనక్కి తిరిగిచూశాను. ఎదురుగా 'సార్ !' "ఊఁ.....వస్తానుండు ముందుకి !" – అంటూ సార్, మరో దెబ్బకొట్టి నన్ను నా బెంచీ దగ్గరకు లాక్కెళ్ళాడు. ఇంతవరకూ స్కూల్లో నే ననుభవించిన శిక్షలన్నీ నా కళ్ళ ముందు మెదిలాయి. ఈసారి శిక్ష మరీ భయంకరంగా వుంటుంది. మరణ దండనతో సమానమే ! ముద్దాయి ఉరికంబం మీద నిలబడినట్టుగా మాట్లాడ కుండా సార్ ముందు తలవంచుకు నిలబడ్డాను. వినాయక్ పారిపోయి, తన స్థానంలో కూర్చున్నాడు. సార్ గర్జనతో క్లాసంతా నిశ్శబ్దమైపోయింది. సార్ అసిస్టెంట్ టీచర్‌ని పిలిచారు. కాని అసిస్టెంట్ వినిపించుకోలేదు. సార్ కోపంగా – "నేను మిమ్మల్నిప్పటికి మూడుసార్లు పిలిచాను!" – అని అరిచారు. అసిస్టెంట్ మెల్లగా "యస్సార్ !" అన్నాడు. దాంతో సార్ మరీ మండి పోయాడు. "సరే, సరే, ముందిక్కడికిరండి!" – అని అరిచాడు. "నే నీ కుర్రాడికి లెక్క చెబుతున్నాను ; తర్వాత వస్తాను !" – అన్నాడు, అసిస్టెంట్. "వీల్లేదు ! ఇప్పుడే రావాలి !" – అని అరిచాడు సార్. అసిస్టెంట్ టీచర్ అక్కణ్ణుంచి కదలనైనా కదల్లేదు. "రా !" – అని హెడ్మాస్టర్ మళ్ళీ అరిచాడు. అసిస్టెంట్ టీచర్ మెల్లిగా ఆయన దగ్గరకొచ్చాడు. ఆయన యిలా ప్రవర్తించడం చాలా ఆశ్చర్యంగా వుంది. ఆయన తన దగ్గరకి రాగానే – "నేను మిమ్మల్ని ఎప్పట్నించి పిలుస్తున్నాను ! ముందిక్కడకి రమ్మనికూడా చెప్పాను. , ఎందుకు రాలేదు ? జవాబు చెప్పండి !" – అని గర్జించాడు హెడ్మాస్టర్.

అసిస్టెంట్ టీచర్ మెల్లిగా – "పిల్లల సమయం వృధాకావడం నాకిష్టం వుండదు !" – అన్నాడు. హెడ్మాస్టర్ కోపానికి అంతులేదు. పళ్ళుపటపట కొరుకుతూ – "చాల్లే ఆపవయ్యా ! పిల్లల సమయం వృధా చెయ్యనివాడివి పెద్ద బయల్దేరావ్ ! అసలు నువ్వెందుకూ పనికిరావు. నీవంటి పని దొంగని నేను ప్రపంచంలో ఎక్కడా చూల్లేదు. నీకసలు చదువు చెప్పటమే చేతకాదు. నీవంటి మూర్ఖుణ్ణి నేను ప్రపంచంలో ఎక్కడా చూళ్ళేదు ! నీవంటి తెలివి తక్కువవాడు నా కక్కర్లేదు ! నీఎదటే క్లాసులో కుర్రాళ్ళు అల్లరి చేస్తారు ;

కుస్తీలు పడతారు ; జుట్టు పట్లుపడతారు ; ఒకడి గుండెలమీదొకడు ఎక్కి-కూర్చుంటాడు ! ఇవన్నీ నువ్వు చూస్తూ వూరుకుంటావా ? రేపు విన్నే పిల్లలు అట్లాచేస్తే? ఏమౌతుంది, చెప్పు !'' – అని అరిచాడు.

అసిస్టెంట్ సార్ శాంతంగా నిలబడ్డాడు. నేను ఖంగారు పడుతూ యిదంతా చూస్తూ వుండిపోయాను. నేను అపరాధిగా అక్కడ నిలబడ్డానన్న సంగతి నేను మర్చేపోయాను. క్లాసులో అందరికళ్లూ వాళ్ళిద్దరిమీదే వున్నాయి. ఇలాంటి సంఘటనలు చాలా సార్లు జరిగాయి. కాని యివ్వాల్టి సంగతి వేరు. హెడ్మాస్టర్ మళ్ళీ అరుస్తూ – "చెప్పండి, మీరు చెప్పదల్చుకున్నదేమిటో !'' – అన్నాడు.

అసిస్టెంట్ చాలా శాంతంగా మెల్లగా – ''చెప్పి ఏమీ లాభం లేని విషయం చెప్పటం నాకిష్టంలేదు!'' – అని మళ్ళీ మౌనం వహించాడు.

ఆ మాట విన్నప్పుడు హెడ్మాస్టర్ పరిస్థితి చూసి తీరవలసిందే !

## నిశ్చింత

ఆ సమాధానం విని హెడ్మాస్టర్ మరోసారి గర్జించాడు – ''ఈ సమాధానానికి ప్రతిఫలం ఏమిటో తెలుసా ?'' అసిస్టెంట్ అమితమైన తిరస్కారభావంతో – ''నేను చెప్పినదంతా బాగా ఆలోచించుకొనే చెప్పాను !'' – అని మళ్లీ మౌనం వహించాడు – నీకెక్కేమిటన్నట్టుగా హెడ్మాస్టర్ వైపు చూస్తూ.

అసిస్టెంట్ సార్ ఎంతశాంతంగా చెప్పినా గాని ఆయన వాడేమాటలు చాలా తీక్షణమైనవి.

ఆయన శాంతంగా మాట్లాడిన కొద్దీ హెడ్మాస్టర్ కోపం పెరిగిపోసాగింది. క్లాసంతా నిశ్శబ్దంగా వుంది. కోపంతో మండిపడుతూ; ఎర్రటి కళ్ళతో – "గోప్యా; గోప్యా !'' – అని అరిచాడు హెడ్మాస్టర్. ఆమాట వినటంతోటే, గోపీనాధ్, గోపాల్ అన్న పేర్లున్న కుర్రాళ్ల వేపు క్లాసంతా తిరిగారు. పాపం

వాళ్ళిద్దరూ గడగడలాడి పోయారు. వాళ్ళిద్దరూ మెల్లగా లేచి నిలబడ్డారు. హెడ్మాస్టర్ అరుస్తూనే వున్నాడు. "గోప్యా ! నీకు ముష్టెత్తుకుతినే కాలం దాపురించింది ! ఆ పనినుంచి విముక్తి కలిగించడానికే నేను నీకు ఉద్యోగమిప్పించాను ! నువ్వు మూర్ఖుడివీ, ఎందుకూ పనికిరానివాడివీ అయినాకూడ నేను నిన్ను వుంచాను...."

ఇదంతా వినటంతోటే – 'గోప్యా' అంటే క్లాసులో కుర్రాళ్ళు కాదు ; మా అసిస్టెంట్ టీచరేనన్న సంగతి అందరికీ తెలిసింది. ఇంతకుముందు అసిస్టెంట్ టీచర్ని – హెడ్మాస్టర్ మా ముందెప్పుడూ పేరుతో పిలవలేదు.

హెడ్మాస్టర్ ఇష్టమొచ్చినట్టుగా మాట్లాడ్డం ప్రారంభించాడు – "ఒరే ! నేను నీకింత ఉపకారం చేశాను; దానికి ప్రతిఫలంగా నువ్విలా చేస్తావా? కృతఘ్నుడా! సిగ్గులేని వెధవా !"

అసిస్టెంట్సార్ కూడ యిక సహించలేక పోయాడు. "ఆపు ! మళ్ళీ యిలాంటి తిట్లు తిట్టావంటే చూసుకో ! ఎవరికి పనీపాటా లేనిది ? మీకా, నాకా? కృతఘ్నుడు ఎవరు ? మీరా, నేనా ? అవును, నేను ముష్టెత్తుకునే వాడినే. నిజమే ! నాకీస్థితి ఎలా వచ్చిందీ, ఎవరివల్లవచ్చిందీ అన్నది మీకు తెలిసినట్టే నాకూ తెలుసు! తమరు బయట ఎంతనలుపో లోపలా అంతేనలుపు! తమ తప్పుడు పనులు నేను చిన్నప్పట్నుంచీ ఎరుగుదును ! నాకు జరిగిన అన్యాయం ఎవరివల్ల జరిగిందో కూడ నాకు తెలుసు. నేనీ పాటికి మహారాజులా వుండేవాడిని; కాని యిప్పుడు బికారినై పోయాను ; బిచ్చగాడినైపోయాను ! నాకీ సంగతులన్నీ తెలియవనుకుంటున్నారా మీరు? ఇది తమరి ఘనకార్యమేనని నాకు తెలియదనుకుంటున్నారా ? మీ రహస్యాలన్నీ నాకు తెలుసు; ఇన్నాళ్ళూ నోరు మూసుక్కూర్చున్నాను ; కాని యింకా అలా వుండాల్సిన అవసరం లేదు. నేను ఏమి మాట్లాడుతున్నానో, దాని ఫలితమేమిటో కూడ నాకు బాగా తెలుసు! తెలిసిందా ? ఇవ్వాల్టిదాకా నేను మీకు...."

హెడ్మాస్టర్ అసిస్టెంట్ చెప్పేమాటలు వినిపించుకోవటంలేదు. "మీ రహస్యాలన్నీ నాకు తెలుసు...." అని అసిస్టెంట్ ఎప్పుడైతే అన్నాడో అప్పుడే ఆయన తల కిందికి వాలిపోయింది. అయినా బింకంగా– "చాల్లే ఆపు నీ వాగుడు!

ఇక్కడినుంచి వెళ్ళిపో....! కృతఘ్నుడా! నీచుడా!" – అన్నాడు.

"కృతఘ్నుడు ! నన్ను కృతఘ్నుడి నంటున్నారా ? ఏయింట్లో అయితే అన్నం తిన్నావో; ఎవరైతే నీకు అన్నం పెట్టారో ఆవ్యక్త్తుల్నే నువ్వు దోచుకున్నావ్! ఆడదాన్ని మోసంచేశావ్ ! ఆస్త్రీ ; ఆమె బిడ్డలూ అన్నంకోసం అలమటించిపోయి నలుగురికీ తిరగాల్సి వచ్చింది. నువ్వు నన్ను కృతఘ్నుడి నంటావా ? క్లాసులో పిల్లలందరిముందూ ఈ మాటలన్నీ చెప్పడం నాకిష్టం లేదు. కాని గుర్తుంచుకోండి. మళ్లీ మీరు యిలాంటి మాటలు అన్నారో.... నేను సహించను : నాకు ఏం చెయ్యాలనిపిస్తే అది చేస్తాను, జాగ్రత్త!"

హెడ్మాస్టరు ప్రతాపం అంతా చల్లారిపోయింది. మొహం మాడ్చుకుని – "సర్లే, ఇక్కణ్ణించిపో !" – అన్నాడు మెల్లిగా. ఆ మాటలు ఆయన నోటిలోంచి అతి కష్టమ్మీద బయటికొచ్చాయి. ఆయన మాట పూర్తికాకముందే అసిస్టెంట్ టీచర్ స్కూల్లోంచి బయటికెళ్ళి పోయాడు. క్లాసులో రెండు నిమిషాలు నిశ్శబ్దం. ఆ తరువాత హెడ్మాస్టర్ నావేపు తిరిగి – "ఆఁ.... తమరిటు దయచెయ్యండి! ఎవర్రా 'పిరికివెధవ'? చెప్పు...." అంటూ రెండు మూడు దెబ్బలు వేశాడు.

నేను ఖంగారుపడుతూ "లేదుసార్....లేదుసార్! నేనన్నది మిమ్మల్ని కాదు సార్!" – అన్నాను.

"ఏమిటి సార్. సార్? గుండెలమీదెక్కి కూర్చుంటావా ? జుట్టుపట్టుకు లాగుతావా? స్కూలుకి వచ్చిందే యివ్వాళ ; అప్పుడే కొట్లాటలు మొదలెట్టావ్!" – అంటూ మళ్లీ నాలుగైదు దెబ్బలువేశాడు హెడ్మాస్టర్.

హెడ్మాస్టర్ వినాయక్‌ని పిలిచి – "ఏరా, ఏంజరిగింది?" – అని అడిగాడు. సందుదొరికిందేచాలుగదా అని వాడు లేనిపోనివన్నీ చెప్పాడు. "లేదుసార్.... వాడన్నీ అబద్ధాలు చెబుతున్నాడు ..." – అని చెప్పాలనిపించింది నాకు. కాని ధైర్యంచాల్లేదు.

ఇవ్వాళ నేనిక బ్రతికి వుండటం అసంభవమని నిశ్చయించుకున్నాను. "ఒరే, వెధవా ! నీ అవతారానికితోడు, నువ్వందరితోనూ కొట్లాడతావురా ? దరిద్రుడా! నీతండ్రి ఒక అడుక్కుతినేవాడు; నువ్వుకూడా అట్లాగే అడుక్కు

తింటావా? పిరికిపందనీ అదనీ యిదనీ అందర్నీ తిడతావా? పో.... స్కూల్లోంచిపో! నిన్ను డిస్మిస్ చేస్తున్నాను పో! నిన్ను మళ్లీ మరో స్కూల్లో ఎవరూ చేర్చుకోకుండా చేస్తాన్నేను....!" – అంటూ మళ్లీ కొట్టాడు హెడ్మాస్టర్. వినాయక్ నావంక చూసి పళ్ళు కొరుకుతున్నాడు.

నేను అరుస్తూ – "సార్! వాడు అబద్ధం చెబుతున్నాడు సార్! నేనెవర్నీ తిట్టలేదు సార్....నన్ను కొట్టించడానికని వాడన్నీ అబద్ధాలు చెబుతున్నాడు సార్....కావాలంటే యింకెవరినైనా అడగండిసార్! నన్నుకొట్టొద్దు సార్!....అంటూ విన్నపాలుచేస్తూ ఏడ్చాను. తెగ ఏడ్చాను. ఎంత ఏడ్చానంటే కన్నీళ్ళతో నా మొహమంతా కడిగినట్లయి పోయింది. కాని హెడ్మాస్టర్ నా మాటలు వినిపించుకోలేదు.

"దొంగవెధవా! మళ్ళీ అబద్ధాలు చెప్తున్నావా?"– అని యింకాకొట్టాడు. బెత్తంతో కొట్టాడు. ఆ తర్వాత– "వినాయక్ ముందు నిలబడి చెంపలేసుకుని, క్షమించమని అడుగు; అప్పుడే నిన్ను వదిలి పెడతాను; లేదా యివ్వాళ నువ్వు నాచేతిలో బ్రతకవ్!"– అన్నాడు హెడ్మాస్టర్. ఏడవటానికి కూడ శక్తిలేనన్ని దెబ్బలు తిన్నాన్నేను. కాని– వినాయక్‌ని క్షమాపణ వేడుకోవాలి; వాడిముందు చెంపలు వేసుకోవాలి అనేసరికి నాబాధ చెప్పనలవి కాదు. ఏమైనాసరే, ఆ పని మాత్రం చెయ్యకూడదని నిశ్చయించుకున్నాను. ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని అలాగే నిలబడ్డాను. కదల్లేదు; మెదల్లేదు. అదిచూసి హెడ్మాస్టర్ "ఊఁ పద, పద! త్వరగాకానీ! వెళ్ళివాడి కాళ్ళుపట్టుకో!"–అని నాలుగైదుసార్లన్నాడు. నేనలాగే మాట్లాడకుండా నిలబడ్డాను. చివరికి సాహసంచేసి–"మీరు నన్ను చంపినా సరే! నేనుమాత్రం వాడి పాదాలు ముట్టుకోను; వాణ్ణి క్షమాపణ కోరను!"– అన్నాను.

# స్నేహ బంధం

హెడ్మాస్టర్ వెంటనే కుర్చీలోంచి లేచి, నన్ను ఈడ్చుకొని వసారాలోకి తీసికొచ్చాడు. "చూడండిరా, గురువుమాటలు కాదంటే ఏంజరుగుతుందో చూడండి :–" అని క్లాసందరితోనూ అన్నాడు. "వినాయక్‌ని క్షమాపణ కోరుకో!"– అని ఆయన మాటిమాటికీ అంటూనే వున్నాడు. ఏ మాత్రం చలించకుండా– "నేనుచస్తాను; కాని వాణ్ణి క్షమాపణ కోరను!"– అని నేనూ అంటూనేవున్నాను. దెబ్బలు నావొంటిమీద పడుతూనే వున్నాయి. నేను ఏడుస్తూనేవున్నాను. బాగాకొట్టిన తర్వాత—క్లాసులో వెళ్ళి కూర్చోమన్నాడు హెడ్మాస్టర్. నేను వినాయక్‌వంక చూసేసరికి వాడు నావైపు హేళనగా చూస్తూనవ్వుతున్నాడు. నారక్తం కోపంతో వుడికిపోయింది.

మర్నాడు మళ్ళీసిగ్గులేకుండా స్కూలుకి వెళ్ళాను. నేను వెళ్ళేసరికి ఇద్దరు కుర్రాళ్ళు మాత్రమే వచ్చారు. ఆ తర్వాత వినాయక్ కూడా వచ్చాడు. వాణ్ణి చూడగానే నాకు నిన్నటిసంగతులన్నీ జ్ఞాపకం వచ్చాయి. వీలుచూసుకుని వీణ్ణి మళ్ళీతంతే బావుండునన్న ఆలోచనవచ్చింది నాకు. మరోవిధమైన ఆలోచనలు కూడా వస్తున్నాయి. వినాయక్ మొహం విచారంగావుంది. నాతో ఏదో చెప్పాలనుకుంటున్నాడు; కాని చెప్పలేకపోతున్నాడు. మాటిమాటికీ వాడి పెదవులు ఏదో చెప్పడానికి ప్రయత్నిస్తున్నాయి.

కాని–నన్ను చూడగానే చెప్పకుండా ఆగిపోతున్నాడు. క్లాసుప్రారంభమైంది. అసిస్టెంట్ మాస్టర్ రాలేదు. అందువల్ల హెడ్మాస్టరే పుస్తకంతీసి ఏదోరాసుకోమని చెప్పాడు. కొందరికి లెక్కలు; కొందరికి ఇతరపాఠాలూ చెప్తున్నాడు. ఇంతలో అకస్మాత్తుగా–ఒక కాగితపు వుండ నాముందొచ్చి పడింది. వెంటనే అదేమిటో సార్‌కి చూపిద్దామనుకున్నాను. కాని–ఆకాగితం వినాయక్‌రాసిన ఉత్తరమేమోనన్న ఆలోచన రాగానే, అది సార్‌కి చూపించకుండా నాదగ్గరే వుంచుకొన్నాను. మెల్లిగా విప్పిచూశాను. అందులో – "నేను నీతో ఒకమాట చెప్పాలి; నువ్వు నాతో మాట్లాడతావా?"–అని రాసివుంది. అదిచూసి నేనాశ్చర్యపోయాను. నేమ్మా,వెంటనే మరో కాగితంతీసి–"అబద్ధాలాడి

నువ్వు నన్ను కొట్టించావ్. నువ్వు నన్ను క్షమాపణకోరుకుంటేగాని, నేను నీతో మాట్లాడను...."– అని రాశాను. ఈ రకంగా మూడునాలుగుసార్లు నాకూ వినాయక్ కీ మధ్య కాగితపువుండల రాయబారాలు నడిచాయి. ఒకరి మనసులో వున్న భావాలొకరికి తెలిశాయి. మధ్యాహ్నం విరామసమయంలో నా స్నేహితుల సమావేశం జరిగింది. నా స్నేహితుడు అమృత్– "వాడు అంత వినయంగా మాట్లాతానంటే, చూద్దాం...." అన్నాడు. "వాడు లుచ్చా! వాడిమాటలు వినక పోవటమే మంచిది!"– అన్నాడు శ్రీధర్. వాడు తనంతతానుగా క్షమించమని కోరితే క్షమించటమే న్యాయమని మరోయిద్దరు మిత్రులన్నారు.

మేము ఒక షరతు పెట్టాం. "నేను నిన్ను క్షమాపణ కోరుకుంటున్నాను"– అని ముందుగా వాడు పెద్దపెద్ద అక్షరాల్తో రాసి పంపాలి. కాని అందుకు వాడు ఒప్పుకోలేదు. చివరికి– వాడు నావెనకాల నిలబడి, నాభుజమ్మీద చెయ్యేసి, 'తప్పయిపోయింది!'– అని అనాలని నిర్ణయించాం. వినాయక్ కి ఒక్కసారిగా నామీదవున్న ద్వేషంపోవటం నాకు ఆశ్చర్యం కలిగించింది. నేను చచ్చిపోయి నట్టు వాడికి కలలో ఎవరో చెప్పారట; అప్పట్నుంచీ వాడికి నామీద ప్రేమ పెరిగిందట! వాడేచెప్పాడు.

## ఆకస్మిక సమావేశం

మా నాన్నగారు మంచి ఉద్యోగంలో వుండేవారు. నేను పుట్టినప్పట్నుంచీ ఆయన మనసు పూర్తిగా మారిపోయింది. ఉద్యోగంమానేసి, పనీ పాటా లేకుండా సన్యాసిలా తిరగటం ప్రారంభించారు. అందువల్ల మా కుటుంబ బాధ్యత; అక్క వివాహబాధ్యత యివన్నీ మా మేనమామ మీద పడ్డాయి.

మా యిల్లు బాగాపెద్దది. అందువల్ల కేవలం అవసరమైన గదులు మాత్రం వుంచుకుని మిగతావి అద్దెకిచ్చేశాం. ఒకనాడు – ఖాళీగావున్న ఒక గది చూడాని కని ఒకాయన వచ్చాడు. గది చూసుకున్నాడు. ఇల్లు నగరంలో కేంద్ర

స్థానంలో వున్నందువల్లా, పరిసరాలు శుభ్రంగా వున్నందువల్లా ఆయనకి బాగా నచ్చింది. "మా స్నేహితు డొకాయన వచ్చివుంటాడు. అద్దె ఎంతయినా సరే యిస్తాడు" — అని చెప్పాడాయన.

అద్దెకుండే ఆయన రావడానికి ముందు మాయింట్లో ఒక ముఖ్యమైన సంఘటన జరిగింది. రావుగారి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. నా గ్రహస్థితి బాగుండలేదు; నెలా నెలాపదిహేనురోజుల్లో అంతా చక్కబడుతుంది; మన కషపు రోజులు పూర్తికావచ్చాయి; నెలావారంరోజుల్లో నేను పూనా వస్తున్నాను; ఈలోగా మీరు ఒక మంచి యిల్లు తీసుకుని వుంచండి. నాతోపాటు ఒక జమిందారీ కుటుంబంకూడా వస్తోంది. బాగా పరువుప్రతిష్ఠా కలిగిన కుటుంబం వాళ్ళది. సనాతన ధర్మపరాయణులు. వాళ్ళ అబ్బాయికి మన అమ్మాయినిచ్చి పెళ్ళి చేసేవిషయం చూస్తున్నాను. పెళ్ళికి రెండువేలదాకా ఖర్చు చేయ్యాలంటున్నారు-ఇలావుంది ఉత్తరం.

ఉత్తరం చూసి మా అమ్మ మండిపడింది. అమమ్మకికూడ ఆ ఉత్తరమేమీ తృప్తికలిగించలేదు. పైగా విచారంకూడా కలిగించింది. మా అక్క గంగకి కూడా ఈ విషయం విచారాన్నే కలిగించింది. "నా జాతకమే అటువంటిది; అందుకనే ఆయన గ్రహాలుకూడా అలా వున్నాయి ; లేనిపోని హామీలివ్వటం ఆయన కలవాటైపోయింది; నా బిడ్డలిద్దర్నీ తీసుకుని యిక్కడికొచ్చాను; ఉత్తివుత్తరాలురాసి ఏంలాభం ? భగవాన్ ! నారాతేయింత!"-అంది అమ్మ దిగులుగా. అమ్మ అంటూండగా, అమ్మ, అమ్మమ్మా కూర్చున్నచోటికి నేను వెళ్ళాను. వెళ్ళి—"అమ్మమ్మా ! నాన్నగారు రాసిన ఉత్తరం ఎక్కడుంది ? నాకు చదవటమొచ్చు; నేను చదివి వినిపించనా ? కొత్తయింట్లోకి వెళతాంగదా? అమ్మమ్మా, నువ్వుకూడా మాతోపాటు వస్తావా?" అన్నాను.

ఈ మాటలన్నీ అనుకోకుండా అన్నాను. నేనలా అనగానే అమ్మ నన్నువొక్క చరుపు చరిచి—"దరిద్రుడా ! నువ్వు పుట్టిన దగ్గర్నించే దరిద్రం వెంటాడుతోంది !"—అంది, తిడుతూ.

నాకు దెబ్బలు తగిలాయికదా; అందుకని మేడమీదికి వచ్చాను. అక్కడా గది తాళం వేసివుంది. పక్కగదిముందుకెళ్ళి వరండాలో కూర్చున్నాను. అల

సటువల్ల నిద్రవచ్చింది. ఏడుస్తూ ఏడుస్తూ నిద్రపోయాను.

నేను నిద్రపోయిన వరండాకి ఆనుకునివున్న గదిలోకి కొత్తవాళ్ళు వచ్చారు. కాస్త సందడిగా వుంది. ఇంతలో నేను పడుకున్న చోటికి ఒక పిల్లవచ్చి— "అమ్మా ! చూడు, ఇక్కడెవరో పడుకుని నిద్రపోతున్నారు !" — అంది. చీకట్లో ఎవరూ కనబడటంలేదు. కాని ఆ గొంతు గుర్తుపట్టాను. వెంటనే, "అరే ! సుందరీ, నువ్వా ! నువ్విక్కడెందుకున్నావ్ ? —అంటూ ఆ పిల్లవెంటే లోపలికి వెళ్ళాను. సుందరికూడ నన్నుచూసి చాలా సంతోషించింది. "అమ్మా! అమ్మా! ఎవరో చూడు!"—అంటూ వాళ్ళమ్మని పిలిచింది.

వాళ్ళమ్మకూడ నన్ను గుర్తుపట్టింది. కాస్సేపు మాట్లాడాక — "నీ కోసం వెదుకుతున్నారుబాబూ ! కిందికి వెళ్లు !"—అని, మా అమ్మమ్మని పిలిచి, నేనక్కడ వున్నానని చెప్పింది. సుందరిని చూశాక నా విచారమంతా పోయింది. సుందరిని మళ్ళీ చూస్తానని నేను వూహించనైనా లేదు. కాని ఇవ్వాళ మళ్ళీ యిలాంటి పరిస్థితిలో సుందరి కలవడం నాకు చాలా ఆనందాన్నిచ్చింది.

## పరీక్ష

మెట్లుదిగి కిందికి వచ్చాను. అన్నం తిన్నాక మళ్ళీ పైకి సుందరి దగ్గర కెళ్ళాలనిపించింది. కాని అమ్మ కళ్ళుకప్పడం చాలాకష్టం. ఒకసారి ప్రయత్నం చేశాను; నాప్రయత్నం విఫలమై పోయింది. మరోసారి వెళ్ళబోతుండగా —అమ్మ వెనకనుంచి —"వెధవా! రాత్రిపూట ఎక్కడికి కెళ్తావురా ? ఇప్పుడెందుకుపైకి?"— అని అరిచింది. ఇంక చేసేదిలేక వెనక్కి తిరిగివెళ్ళి మంచమ్మీద పడుకున్నాను. అమ్మ — "వెధవా! తిన్నావ్; పడుకున్నావ్! సిగ్గులేదూ? చదువూసంధ్యా ఏమీ అక్కర్లేదా? వీపు పగలగొడతాను; లేచి చదువ్!" — అని ఆజ్ఞాపించింది. చచ్చినట్టు లేచి పుస్తకం ముందేసుకుని కూర్చున్నాను. కొద్దిసేపటికే నిద్ర ముంచుకొచ్చింది.

మర్నాడు భోజనాలయ్యాక మేడమీదికెళ్ళాను. తలుపులు వేసివున్నాయి. నేను నిరాశతో వెనక్కి తిరిగి వెళ్ళబోతూండగా సుందరి మాటలు వినిపించాయి. ఆగిపోయాను. "అమ్మా! పుస్తకం ఎప్పుడు చదవాలి? ఈపుస్తకం చదివేస్తే నాన్నగారు ఇంకో పుస్తకం తెచ్చియిస్తానన్నారుగా? – ఇంకా పెద్దపుస్తకం!"– అంటోంది సుందరి వాళ్ళమ్మతో. "నేనిప్పుడు అంట్లుతోముతున్నాను; తోమేశాక కడిగి అలమారులో సర్దాలి; ఆతర్వాత బట్టలు కుట్టాలి; నువ్వప్పటిదాకా చదువుకో; ఎక్కడైనా తప్పొస్తే నేను చెబుతాను; ఏదైనామాటకి అర్థంతెలియక పోతే నన్నడుగు; ఇవ్వాళ బాగా చదవాలి; నేను మాపటికి చదవమని అడిగి నప్పుడు – ఎక్కడా ఆగకుండా గడగడా చదివెయ్యాలి!" – అంటోంది వాళ్ళ అమ్మ. ఈమాటలు విని నేను ఆశ్చర్యపోయాను. ఎందుకంటే ఆడవాళ్ళు కూడ చదువుతారని నాకు తెలియదు! మాయింట్లో ఎవరికీ చదువురాదు. కాని యిక్కడ అంతా చాలా విచిత్రంగావుందే! సుందరిని పిలవాలనీ లోపలికి వెళ్లాలనీ అనిపించింది. కాని వాళ్ళమ్మ పని చేసుకుంటోంది; అలాంటప్పుడు లోపలికి వెళ్ళటం బాగుండదని, పక్కన మరో గదిలోకి వెళ్లి కూర్చున్నాను. సుందరి వాళ్ళింట్లోంచి మాటలు వినబడుతూనే వున్నాయి. నేను కూర్చున్న గదిలో నాదొక పెట్టెవుంది. అందులో నేనాడుకునేవస్తువులూ, యితర సరంజామా వున్నాయి. మా గంగని ఎప్పుడూ నాపెట్టె ముట్టుకోనైనా ముట్టుకోనివ్వను. కాని నా దగ్గరున్న వస్తువుల్లో సుందరికి నచ్చినవన్నీ సుందరికి యిచ్చెయ్యాలని నిర్ణయించుకొన్నాను. నా గారడీపెట్టె ఒక్కసారి అంతా బయట పెట్టకుండా, ఎప్పటికప్పుడు ఒకటో రెండు వస్తువులు తీసి సుందరికి యివ్వాలనుకున్నాను. సుందరి నాకంటే మూడేళ్ళే చిన్నది. చూడ్డానికి అందంగా వుంటుంది. మంచిపిల్ల. నాతో స్నేహంగా వుంటుంది. అందువల్ల సుందరిపట్ల నాకున్న అభిమానం రోజురోజుకీ పెరగసాగింది. నేను వాళ్ళ తలుపు దగ్గరకొచ్చాను. తలుపు మూసేవుంది. కాని మాటలు వినబడుతున్నాయి. నేను చెవులు రిక్కించుకుని విన్నాను. సుందరి చక్కగా కథ చదువుతోంది. ఒకటి రెండు మాటలు మాత్రం తల్లి నడిగింది. మిగిలినదంతా తనంతటతానే చక్కగా చదువుతోంది. నేను ఆశ్చర్యపోయాను.

నేనే అంతబాగా స్పష్టంగా చదవలేను. నేను బొంబాయి వెళ్ళినప్పుడు ఈ పిల్లకి మాటలుకూడా సరిగ్గారావు. అలాంటిది ఒక్క సంవత్సరంలోనే ఎంత నేర్చుకుంది! ఈసప్ కథలు గడగడా చదివేస్తోంది! నాకు సిగ్గేసింది. నాకు చిన్నచిన్న లెక్కలు చెయ్యటం తప్ప మరేమీరాదు. మాయింట్లో కథల పుస్తకాలేలేవు. నా క్లాసు పుస్తకాలు తప్ప మరేమీలేవు. నేనింతమటుకు ఒక్కపుస్తకమే పూర్తిచేశాను. అందుకే సుందరి అలా చదవటం చూసి నేను ఆశ్చర్యపోయాను. "నేను నీకు చెబుతాను...." – అని, సుందరితో అనే సాహసం నాకు లేకపోయింది. తలుపుతట్టి సుందరినీ వాళ్ళమ్మనీ పిలిచాను. వాళ్ళమ్మ తలుపుతెరిచి నవ్వుతూ లోపలికి తీసుకెళ్ళింది. ఆవిడ ఒక పెద్ద కమీజు (చొక్కా) తొడుక్కుంది. నేను సుందరి దగ్గరకెళ్ళి కూర్చున్నాను. వాళ్ళమ్మ – "కానీ! త్వరగా కథ చదివెయ్!లేకపోతే మాపటికి మీనాన్నగారడిగే సరికి నీకు కథరాకపోతే, చివాట్లు తగులుతాయ్...." – అంది, సుందరితో.

సుందరి నవ్వుతూ, ధైర్యంగా – "నాకెందుకు తగులుతాయ్ చివాట్లు ? నేను చక్కగా చదివేస్తాను కథ! నాన్నగారికే చివాట్లు తగులుతాయ్!" – అంది.

"తప్పు, తప్పు! పెద్దవాళ్ళని అలా అనకూడదు; సర్లే, నువ్వుముందు కథ కంఠతాపట్టు." – అంది వాళ్ళమ్మ.

సుందరి చదివే పద్ధతి చూసి నాకు సిగ్గేసింది. నేనే అంతబాగా చదవలేను. ఇంతలో వాళ్ళమ్మ – "నువ్వు చదువుబాబూ ! ఎలా చదువుతావో చూస్తాను ! ఈ పిల్లకి ఎన్నాళ్ళనుంచి నేర్పుతున్నామో...." – అంది. నా గుండెల్లో రాయి పడింది. నేనంత బాగా చదవలేనని నాకు తెలుసు. అయినా ఆసంగతి చెప్పకుండా – "నేనింతవరకూ ఈ పుస్తకమసలు చూడనైనా చూడలేదండీ ! సరిగ్గా చదవలేనేమో...." – అన్నాను. అయినా వాళ్ళమ్మ వూరుకోలేదు. "అయితే తప్పకుండా చదవాల్సిందే!" – అంది. చచ్చాంరా దేవుడా అనుకున్నాను. ఇదెక్కడి పరీక్షరాబాబూ అనుకున్నాను. చదవనా వద్దా అని ఆలోచిస్తూనే చదవటం మొదలెట్టాను. చాలాసార్లు తడుముకుంటూ, చివరికి ఎలాగైతేనేం, కథ చదవటం పూర్తిచేశాను. నేను అన్నిసార్లు తడుముకున్నాకూడా– "బావుందిబాబూ! బాగా చదివావ్!" అని మెచ్చుకుంది సుందరితల్లి. నేను

చె_త్తగా చదివానని నాకు తెలుసు. అయినా ఆవిడ మెచ్చుకుంది. "ఇంత పెద్ద కమీజు ఎవరికోసం కుడుతున్నారు?'' – అని ఆవిడనడిగాను.

ఆవిడ నవ్వుతూ – "ఏమో, నాకేం తెలుసు?" – అంది. ఆ సమాధానం విని నే నాశ్చర్యపోయాను. ఇంత పెద్ద కమీజు సుందరి బొమ్మలకై తే వుండదుగదా అనుకున్నాను. ఇంతలో సుందరే చెప్పింది – "ఈ కమీజు మా నాన్నగారిది!" – అని.

"మీ నాన్నగారా ? ఆయనెవరు ?"

"మానాన్నగారు తెలీదా? మానాన్నగారు ఆఫీసుకెళ్లారు....ఈ చొక్కా మా నాన్నగారిదే!"

"ఆయన చొక్కా మీరెందుకు కుడుతున్నారు? దర్జీకుట్టడా?" – అని సుందరి తల్లి నడిగాను నేను.

''కుట్టక ఏం చేస్తాడు?" – అంది సుందరి.

"సరేగాని....ఆ కథ చదివావ్; దాని అర్థమేమిటో చెప్పు...." – అంది వాళ్ళమ్మ.

నేను చదివానుగాని, ఆ కథ ఏమాత్రం నా బుర్ర కెక్కలేదు. సుందరి తల్లి సుందరి నడిగింది. సుందరి చెప్పడానికి ప్రయత్నించింది. ఆ కథ భావ మేమిటో చక్కగా విడమర్చి చెప్పింది సుందరి తల్లి. సామానంతా సర్దుకోవాలి గదా అని సుందరి వాళ్ళమ్మకి గుర్తు చేసింది. నేనుకూడ ఆపనిలో సాయంచేసే ఒంకతో, ఇంటికి వెళ్ళకుండా అక్కడే వుండొచ్చుగదా అని కూడా సంతోషించాను. ''ఒరే దరిద్రుడా ! వెధవా ! ఎక్కడ చచ్చావురా !"– అన్న అరుపులు కిందనుంచి వినబడ్డాకగాని, స్కూలుకెళ్లే వేళయిందని నాకు గుర్తు రాలేదు. వెంటనే అక్కడినుంచి పరుగెత్తుకెళ్లాను.

# భూలోక స్వర్గం

సుందరి తండ్రి మాయింట్లో అద్దెకిదిగినరోజు – నా ఆత్మకథ పూర్వార్ధంలో చాలా ముఖ్యమైనరోజు. ఆరోజునుంచీ నాప్రవర్తనలో క్రమక్రమంగా పరివర్తన రాసాగింది. వాళ్ళ కుటుంబమంతాకూడ చాలా మంచివాళ్ళు. ఒకరంటే ఒకరు ఎంతో ప్రేమగా వుండేవారు. సుందరి తండ్రి– వాళ్ళమ్మంటే చాలా ప్రేమగా వుండేవారు. భార్యాభర్తలిద్దరూ కూతురి ఆలనా పాలనా చక్కగా చూసేవారు. ఇల్లు చక్కగా శుభ్రంగా వుంచుకోవడం; వాళ్ళ ప్రవర్తన; వాళ్ళకి నాపట్లగల ప్రేమ యివన్నీ నాలో చాలామార్పు తెచ్చాయి. నా దుడుకుతనం తగ్గిపోయింది. సుందరి తండ్రి రోజూ వుదయం అయిదుగంటలనుంచి, రాత్రి పదింటిదాకా అన్ని పనులూ చక్కగా, క్రమబద్ధంగా చేస్తూవుండేవారు. రోజూ భోజన మయ్యాక గంటాగంటన్నరసేపు చదివేవాడు పొద్దున్నేలేచి రెండుగంటలసేపు ఏదో పుస్తకంరాస్తూ వుండేవారు. ఉదయం ఆరూ ఎనిమిదిగంటలమధ్య ఎప్పుడు చూసినా రాస్తూనే వుండేవారు. ఒకవేళ ఏదైనారోజు ఆపనికి భంగం కలిగితే, మర్నాటి ఉదయం రెండుగంటలుముందే లేచి, ఆ కొరత పూర్తి చేసేవారు. ఎనిమిది గంటలనుంచీ సుందరిని తన దగ్గర కూర్చోబెట్టుకుని చదువు చెప్పేవారు.

కొద్దిరోజల తర్వాత నేనుకూడా వెళ్ళి కూర్చోవటం ప్రారంభించాను. ఆయన నాకుకూడా ఎంతోప్రేమతో చదువుచెప్పారు. ఆప్రేమ; చెప్పేపద్ధతిలో ఆకర్షణా ఆయన ప్రత్యేకతలు. సుందరితల్లి కూడ, ఆసమయంలో బియ్యం ఏరుతూనో మరోపని చేస్తూనో అక్కడకూర్చునేది. మాటలువింటూ తనపని పూర్తి చేసుకునేది. మేమూ, అప్పుడప్పుడూ సుందరితండ్రికూడ ఆమెకి సహాయము చేసేవాళ్ళం.

కొత్తగా అద్దెకివచ్చిన వాళ్ళవటంచేత సుందరి తల్లిగాని తండ్రిగాని మాయింటి కొచ్చేవారు కాదు. సుందరితల్లి బట్టలు కుడుతుందనీ, చదువుతుందనీ తెలిసి – ఆవిడ 'సంస్కర్త' అనే వుద్దేశ్యంతో మాయింట్లో ఆడవాళ్ళు ఆమెతో మాట్లాడ్డం మానేశారు. కాని మెల్లి మెల్లిగా ఆమె సద్గుణాలు; సహృదయత; పరోపకార బుద్ధీ యివన్నీ చూసి తమ అభిప్రాయం మార్చుకున్నారు. మొదట్లో

నన్ను పైకి వెళ్ళనిచ్చేవారు కాదు. కాని తర్వాత తర్వాత – నేను మారటం; నాపోకిరీతనం పోవటం, చదువునేర్చుకోవటం; శాంతస్వభావం అలవర్చు కోవటం; యివన్నీచూసి అభ్యంతరము చెప్పటం మానేశారు. ప్రతిరోజూ నాకూ హాయిగా గడిచిపోతోంది. సుందరితో నా స్నేహం పెరుగుతూ వచ్చింది.

## కలా ? నిజమా ?

సుందరి తల్లిదండ్రులతో నా చనువూ స్నేహమూకూడ పెరగసాగాయి. ఆయింట్లో చనువుపెరిగినకొద్దీ మాయింటిమీద ఆకర్షణ తగ్గసాగింది. ఇదివరలో నేను యింట్లో వున్నంతసేపూ అల్లరిచేస్తూండేవాడిని; అందరికీ నామీద విసుగ్గా కోపంగావుండేది. అందువల్ల సుందరివాళ్ళింటికి ఎప్పుడు వెళ్ళినా ఎవరూ అడ్డుచెప్పేవారుకాదు. సుందరితోపాటు చదువుకోవటంవల్ల ఆరు మాసాల్లో నేను క్లాసులో మూడోవాడిగా వచ్చాను. అమ్మమ్మ చాలా సంతోషించింది. ఇంట్లో అందరికీ పాయసం చేసిపెట్టింది. అయితే అమ్మమాత్రం మొదటివాడిగా ఎందుకురాలేదు; మూడోవాడిగా ఎందుకొచ్చావని తిట్టింది. కాని అమ్మకికూడా లోలోపల సంతోషంగానే వుంది. ఎందుకంటే ఒకనాడు తాతతో చెబుతూవుంటే చాటుగావుండి విన్నాను. "వాడికి చాలాబుద్ధి వచ్చింది; వాడింత బుద్ధిమంతుడౌతాడని నేనుకల్లోకూడ అనుకోలేదు.... ఇదంతా ఆ శివరామ్‌పంత్‌గారి పుణ్యమే! .... ఆయన చాలామంచివాడు .... ఆ పిల్ల మాత్రం ...."—అని చెబుతూ యింతలో నన్నుచూసి, కొంచెంనవ్వి, కోపం తెచ్చుకుని— "ఓరి దొంగ వెధవా : చాటుగా వుండి వింటున్నావా ? చూడు, నిన్నేం చేస్తానో....!"— అంది అమ్మ.

నేనప్పటికే అక్కడినుంచి మాయమై పోయాను. నేను శివరామ్ పంత్‌గారి దగ్గర చదువుకోవటం ప్రారంభించి నప్పట్నించీ, నేనుకూడ శ్రద్ధగా చదువుకోవ

టంతో ఆయనకి నామీద ఆసక్తి పెరిగింది. 'కుర్రాడు తెలివైనవాడు'- అనే అభిప్రాయం ఆయనలో కలిగింది. అందువల్ల నాకు చదువు చెప్పడానికి యింకా ఎక్కువ సమయం వెచ్చించడం ప్రారంభించారు.

ఈ రకంగా నాదినచర్య సాగుతోంది. నాకూ సుందరికీ మధ్యవున్న స్నేహం యింకాయింకా పెరగసాగింది. 'సుందరిని పెళ్లి చేసుకుంటే బావుండును' అన్న ఆలోచన నాలో కలగ సాగింది. కాని- సుందరి మనసులో ఏముందో మాత్రం నేను తెలుసుకోలేక పోయాను. కాని ఒకనాడు- చాలా ఆసక్తికరమైన సంఘటన ఒకటి జరిగింది.

మా అమ్మమ్మ స్నేహితురాలి యింట్లో పెళ్లి. పెళ్లికూతురూ, మాఅమ్మమ్మ స్నేహితురాలూకూడా మా యింటికి వస్తూవుండేవారు. అమ్మమ్మ వాళ్ళని సుందరి తల్లికికూడా పరిచయం చేసింది. అంచేత సుందరి తల్లినికూడా వాళ్ళు పెళ్లికి పిలిచారు. పెళ్ళిచూసి- నా మనసులోకూడ పెళ్లికి చెందిన ఆలోచనలు రాసాగాయి. "నేనుకూడా సుందరిని ఇలాగే పెళ్లి చేసుకుంటాను; పురోహితుడు చెప్పిన ప్రకారం అన్నీ యిలాగే చేస్తాను..."— అని ఊహించుకోసాగాను.

ఇలా ఆలోచిస్తూ ఆలోచిస్తూ సుందరివంక చూశాను. మాయిద్దరి కళ్ళూ కలిశాయి.

రాత్రి యింటికొచ్చాక నా మనసు మనసులోలేదు. పడుకుని - 'నా పెళ్ళి ఎందుకు చెయ్యరు!'- అని ఆలోచించసాగాను. అమ్మమ్మని అడగాలనుకున్నాను. అమ్మఅంటే ఎలాగూ భయం. మెల్లిగా అమ్మమ్మ పక్కలో చేరాను. మనసులో ఏ ఆలోచనవస్తే దాన్ని గురించి అమ్మమ్మకి చెప్పేసే వయసు నాది. సిగ్గులేకుండా అడిగాను. అమ్మమ్మ మేలుకునే వుంది, మెల్లగా చెవిలో- "అమ్మమ్మా! నా పెళ్ళెందుకు చెయ్యవు?"- అని అడిగాను. నా ప్రశ్నవిని అమ్మమ్మ ఒక్కసారి బిగ్గరగా నవ్వింది. నవ్వి- "రేపు చేస్తాంలే! రేపట్నుంచీ పిల్లని వెదుక్కో!"- అంది.

నేను ఆశ్చర్యపోయి, వెంటనే— "పిల్లని వెదుక్కోవాల్సిన అవసరమేముంది? సుందరిని తప్ప నేను యింకెవర్నీ చేసుకోను! నువ్వు సుందరిని మర్చిపోయావా? నీకెలా గుర్తులేదు?"—అన్నాను.

"ఆహా, అలాగా! నీబోటి వెఱ్రివాడికి సుందరి నెవరిస్తారు? సుందరికి బాగా చదువుకున్నవాడినీ, బాగా డబ్బున్న వాడినీ చూస్తాడు వాళ్ళ నాన్న!"— అంది అమ్మమ్మ. ఇంకా ఏమిటేమిటో అందిగాని, నేను వినిపించుకోలేదు.

నాకొకటే చింతపట్టుకుంది— 'చదువూ డబ్బూ బాగా లేక పోవటంవల్ల నేను సుందరికి పనికిరానన్నమాట!'—ఆ విషయంగురించి అమ్మమ్మని యింకా అడగాలనుకున్నాను. కాని—చూస్తే, కునికిపాట్లు పడుతోంది. నేనుండలేక పోయాను. అమ్మమ్మని లేపి అడిగాను. అమ్మమ్మ విసుక్కుంటూ— "పడుకో! వూరికే వాగకు!"— అని విదిలిచ్చికొట్టి, నిద్రపోయింది. నాకు చాలాసేపటివరకూ నిద్ర పట్టలేదు. నిద్రలో— సుందరికీ నాకూ పెళ్లి జరుగుతున్నట్టుగా కల వచ్చింది. నిన్న పెళ్లిలో జరిగిన తతంగమంతా మా పెళ్లిలోనూ జరుగుతోంది. నేనూ సుందరీ ఆనందంగా ఒకరి నొకరు చూసుకుంటున్నాం. మంత్ర పాఠాలు జరుగుతున్నాయి. మంగళాష్టకం పూర్తయింది. ఇంతలో పెళ్లికొడుకు స్థానంలో నా బదులు నాకు తెలిసిన కుఱ్ఱాడే యింకెవరో కూర్చుని వున్నారు. నేను అదే పనిగా చూస్తున్నాను; పెళ్లికొడుకు స్థానంలో నారూపం క్రమంగా అస్పష్టమై అదృశ్యమైపోయి మరెవరిదో రూపం ఏర్పడింది. నాకు కోపంవచ్చి— బిగ్గరగా అరిచాను. నేను అరిచిన అరుపుకి నాకే మెలుకువొచ్చింది. చూస్తే, అంతా చీకటి. నేను నిద్రలో వున్నానో, మేలుకునే వున్నానో నాకు తెలియలేదు.

## నా మొదటి రచన

కళ్ళుతెరిచాను. కాని మంచంమీదనుంచి లేవలేకపోయాను. ఆ కల మళ్లీ మళ్లీ నా కళ్ళముందు మెదులుతోంది. కలలో— నా స్థానం ఆక్రమించుకున్న పెళ్లికొడుకు అస్పష్టరూపాన్ని గుర్తు పట్టడానికి ప్రయత్నం చెయ్యసాగాను.

అప్పటిదాకా సుందరితో నా స్నేహం పవిత్రమైనది. కలిసివుండేవాళ్ళం; కలిసి చదువుకునేవాళ్ళం; కలిసి ఆడుకునేవాళ్ళం; అంతే. కాని ఆవేళ — నిష్కళంకమైన నా ప్రేమలో అసూయా భావం ప్రవేశించింది. కలలో నాస్థానమాత్ర

మించుకున్న వ్యక్తి గురించే ఆలోచించ సాగాను. ఆవ్యక్తిని శత్రువుగా భావించుకుని, అతన్ని ద్వేషించసాగాను. ఆవేళ సుందరిగారికి— వాళ్ళ అమ్మమ్మ దగ్గర్నించి ఉత్తరమొచ్చింది. వాళ్ళ అమ్మమ్మకి ఆరోగ్యం బావుండలేదట; చూడ్డానికి రమ్మని ఉత్తరమొచ్చింది. సుందరికి వెళ్ళాలని లేదుగాని, వెళ్ళక తప్పలేదు. సుందరీ వాళ్ళమ్మాకూడా వూరికి ప్రయాణమయ్యారు. సుందరిని వొక్కదాన్నే యిక్కడ విడిచిపెట్టి వెళ్ళటం పార్వతీబాయికి యిష్టం లేదు. సుందరికి నాకలగురించి చెప్పాలనుకున్నాను. కాని వీలుదొరకలేదు. చివరికి ఎప్పుడో ఒక్కక్షణం అవకాశం లభించింది.

"సుందరీ! నేను నిన్నపొద్దుట్నించీ నీతో ఒకమాట చెప్పాలనుకుంటున్నాను ....కాని ఆమాట యింకెవరన్నా వున్నప్పుడు చెప్పడానికి వీల్లేదు ....!"— అన్నాను.

ఆమాట చెబుతున్నప్పుడు నేను ఆవేశపడ్డాను.

"ఏమైంది? ఏంచెప్పాలి? మరి నిన్నటినుంచీ ఎందుకు చెప్పలేదు?"— అని అడిగింది సుందరి. "ఏం చెయ్యను? నువ్వు వొంటరిగా దొరకలేదు!"— అన్నానేను.

"నేను వొంటరిగా కావాలా?"—అంది సుందరి ఆశ్చర్యపోతూ.

"అవును"— అన్నాను నేను మెల్లిగా.

"ఏమిటావిషయం?"—అంటూ కుతూహలంగా అడిగింది సుందరి. నేను నా కథంతా ప్రారంభించాను. "చూడూ, మొన్న మనం పెళ్ళికి వెళ్ళాం చూడూ...."— అంటూ చెప్పబోతుండగా, ఇంతలో సుందరిని వాళ్ళమ్మ పిలిచింది. సుందరి పరుగెత్తి వెళ్ళిపోయింది. "నామాట వినవా?"— అన్నాను సుందరి వెళుతుంటే. "ఇప్పుడుకాదు....అమ్మ పిలుస్తోంది...."—అంటూ పైకి వెళ్ళిపోయింది సుందరి.

బండికి వేళైంది. వాళ్ళు వెళ్ళిపోతూవుంటే నేను విపరీతంగా ఏడ్చాను. నాకు కూడా స్టేషన్‌కి వెళ్ళాలనివుంది. కాని అమ్మ వద్దంది.

చివరికి శివరామ్‌పంత్‌గారు నన్ను స్టేషన్‌కి తీసుకెళ్ళారు. బండి బయల్దేరే వేళయింది. "వెళ్ళగానే ఉత్తరంరాయండి!"— అని ఆయన భార్యకీ కూతురికీ చెప్పారు. నా బుర్ర చురుగ్గా పనిచేసింది. నేనుకూడా— "నువ్వుకూడా నాకు ఉత్తరం

వ్రాయి; నేను ఎదురుచూస్తూ వుంటాను....!"—అన్నాను సుందరితో. "తప్పకుండా రాస్తాను; అమ్మ దగ్గర కార్డుతీసుకుని రాస్తాను!"—అంది సుందరి. ఆ సమయాన నామనసులో ఒకటే ఆలోచనవుంది— 'ఉత్తరం!' నాకలంతా ఉత్తరం ద్వారా సుందరికి చెప్పాలనుకున్నాను.

## ఆద్యంతాలు

ఇంటికి వెళ్ళగానే ఉత్తరం రాయాలి అని ఆలోచించుకున్నాను దారిలో. కాని యింట్లో అడుగు పెట్టగానే— "వెధవా ! స్టేషన్‌కి ఎందుకెళ్లావ్ ? స్కూలుకి వేళయింది; త్వరగా స్కూలుకి తగలడు !" —అని తిట్టి, పుస్తకాలసంచి నా మొహాన పారేసింది అమ్మ.

మాట్లాడకుండా సంచి తీసుకుని స్కూలుకి బయల్దేరాను. 'ఛీ ! ఇక యింటికి ఎప్పుడూ వెళ్ళకూడదు'—అనుకున్నాను. బళ్లోకి వెళ్ళకుండా ఎక్కడికో దూరంగా వెళ్ళిపోయి, ఏ చెట్టుకిందో కూర్చుని, ఉత్తరం రాయాలనుకున్నాను.

రాత్రి భోజనాలయ్యాక గంటా ఒరగంటా చదువుతూవుండేవాణ్ణి నేను. ఆ రోజు ఆ సమయంలో ఉత్తరం రాయాలని నిశ్చయించుకున్నాను. ఉత్తరం యింట్లో ఎవరైనా చూస్తారేమోనన్నభయం నాకెంత మాత్రమూలేదు. ఎందుకంటే, అమ్మకీ అమ్మమ్మకీ అక్షరాలుకూడా రావు. అంచేత నేనేమిరాస్తున్నానో వాళ్ళకి తెలీదు. పైగా, కష్టపడి చదువుతున్నానని సంతోషిస్తారుకూడాను.

నాకే మళ్ళీ ఒక సందేహ మొచ్చింది. అంతసేపు మేలుకుని కూర్చుని రాస్తూవుంటే— ఏంరాస్తున్నావని అమ్మ అడిగితే ఏం సమాధానం చెప్పాలి ? అప్పుడేం జరుగుతుంది ? — ఈ ఆలోచన నన్నుభయపెట్టింది.

రాత్రి పదకొండూ పదకొండున్నరైంది. అంతా నిద్రపోయారు. నేను ఏక దీక్షగా ఉత్తరం రాస్తున్నాను. నేను ఏంరాస్తున్నానో నాకేతెలీదు. అలా రాస్తూనే వుండిపోయాను. వాటంతటవే భాష; భావాలు; వర్ణనలూ అన్నీ వచ్చేశాయి నాకు.

చివరికి ఉత్తరం రాయటం ముగించాను. ఇంతలో ఎక్కడో ఏదో చప్పుడైంది. అమ్మా, అమ్మమ్మా యిద్దరూ నిద్రలేచి—''ఏమిటి, ఏమిటి ?"—అంటూ అడిగారు. నేనింకా మేలుకునే వుండటంచూసి—"ఇంకా నిద్రపోలేదా ? ఇక చాల్లే చదువు; పడుకో !"—అంది అమ్మమ్మ. ఉత్తరం అంతా ఒకసారి చదవాలనుకున్నాను. కాని అమ్మమ్మకి భయపడి పుస్తకాలన్నీ పుచ్చుకుని లేచాను. ఉత్తరం పుస్తకాల మధ్య పెట్టాను. మంచమెక్కి పడుకున్నాను. అప్పటి నామనోస్థితిని బట్టి నిద్ర రావాల్సింది కాదు. కాని ఉత్తరం రాసిరాసి అలిసిపోవడంవల్లా, అంతసేపు మేలుకుని వుండటంవల్లా వెంటనే నిద్రపట్టింది. మర్నాటి ఉదయం – ఎప్పటిలా పెందరాడే మెలకువరాలేదు. అక్క నిద్రలేపితే, అప్పుడు లేచాను. లేవటంతోటే, నా ఉత్తరంవుందా లేదా అని చూశాను. నేనీరకంగా రాయటం ఇదే మొదటి సారి. రచనలు ఎలా చెయ్యాలో శివరామ్ పంత్‌గారు నాకు చెప్పారు. ఆయన రోజూ రెండుగంటలపాటు రచనలు చేస్తూవుండేవారు. ''రచనలు చెయ్యటం మహాకార్యం''— అని ఆయనే చెప్పారు నాకు. మనసులోవున్న భావాలన్నీ సుందరికి నేనురాసిన ఉత్తరంలో రావటం నాకు ఆనందం కలిగించింది. అప్పట్నుంచే రచనలు చెయ్యాలన్నకోరిక నా మనసులో ఉదయించింది.

## జాగృతి

ఆరోజు స్కూల్లో వున్నంతసేపూ నా మనసక్కడలేదు. అన్నిపనులూ యాంత్రికంగా చేస్తున్నాను. 'నేను రాసిన కాగితాలన్నీ గాలిలో ఎగిరిపోయుంటాయి'— అన్న ఆలోచన వచ్చింది ఎందుకో నాకు. ఎలా ఎగిరి పోయాయన్నది నాకు తెలియదు. కాని ఆలోచనరావటంతోటే నాకు చాలా ఆందోళన కలిగింది.

మధ్యాహ్నపు విరామసమయంలో యింటికి పరుగెత్తు కెళ్ళాను. నా కాగితాలు పెట్టినచోట చూశాను. నేనెన్నడూ వూహించనైనా వూహించని దృశ్యం అక్కడ చూశాను. గంగ నేను రాసిన కాగితాలన్నీ ముందెట్టుకుని ఒక్కో

అక్షరమూ కూడబలుక్కుని చదువుతోంది. నేనెన్నడూ అనుకోని, వూహించని సంఘటన జరగటంతో నాకు పిచ్చెక్కి పోయింది. గంగని ఒక్కచరుపు చరిచి చేతిలోవున్న కాగితాలన్నీ లాక్కున్నాను. పిచ్చికుక్కలా ఆమెమీద విరుచుకు పడ్డాను. పాపం, అక్క అలాగే మాట్లాడకుండా వూరుకుంది. ఒక్కమాటైనా మాట్లాడలేదు. మౌనంగా నిలబడి కన్నీళ్ళు కారుస్తోంది. నేను నోటికొచ్చినట్లల్లా తిట్టాను. కాగితాలన్నీ జేబులో పెట్టుకుని అక్కడినుంచి వెళ్ళిపోతూ- వెళ్ళి పోయేముందు మరోసారి తిడదామని వెనక్కి తిరిగాను. "తమ్ముడూ ! నువ్వు మంచివాడివని, చాలా మంచివాడివని సుందరి మాటిమాటికీ చెబుతూ వుంటుంది. ఇదేనా నీ మంచితనం ?" —అంది, అక్క మెల్లిగా. "కాని....అమ్మకి మాత్రం నాకు చదవటం వచ్చని చెప్పకు...." — అంది ప్రాధేయపూర్వకంగా. సుందరి పేరెత్తగానే నేను చల్లబడిపోయాను. కాని ఆవేశం యింకా పూర్తిగా తగ్గలేదు. అలాగే ధుమధుమలాడుతూ స్కూలుకెళ్ళి పోయాను. ఇంకా గంటకొట్టడానికి కాస్త వ్యవధివుంది. ఎక్కడికైనా వెళ్ళి కూర్చుని నేనురాసిన ఉత్తరం మరో సారి చూసుకోవాలనిపించింది. పాడుబడిన ఒక యింటి ముంగిట్లోకి వెళ్ళి కూర్చున్నాను. జేబులోంచి కాగితాలు తీసిచూశాను. అక్క చదువుతున్నది నాలుగోపేజీ. అక్క నిజంగా నాలుగు పేజీలు చదివిందా అన్న ఆలోచన నన్ను కలవరపెట్టింది. అక్కకి చదువు ఎలా వచ్చింది?

సాయంత్రం యింటికి వెళ్ళగానే చాలా ప్రేమగా అక్కని పిలిచాను. నేను కొట్టినందుకూ, తిట్టినందుకూ క్షమాపణ కోరుకున్నాను. "ఇక ముందెప్పుడూ నిన్నుకొట్టను! తిట్టను" - అని వాగ్దానం చేశాను. మాటలమధ్యలో - "నీకు రాయటం, చదవటం ఎలావచ్చింది? ఎప్పుడు నేర్చుకున్నావ్?"—అని అడిగాను. ఎవరిదగ్గర ఎలానేర్చుకుందని నేను వూహించానో అదే నిజమైంది. ఇన్నాళ్ళు యింట్లో ఈ విషయం ఎవరికీ తెలకుండా ఎలావుందా అని నేనాశ్చర్యపోయాను. ఏమైతేనేం, ఆవేళటినుంచీ మా యిద్దరిమధ్యా వున్న ప్రేమ పెరగసాగింది. సుందరి లేని కారణంగా అప్పటిదాకా నేను వొంటరిగా వున్నట్టు బాధపడ్డాను. కాని ఆరోజు నుంచీ నాలో సుప్తావస్థలోవున్న సోదరీ ప్రేమ జాగృతమైంది.

## అక్క

అక్క ఏడుస్తోంది. ఎవరికీ వినబడకుండా మెల్లిగా ఏడుస్తోంది. మధ్యమధ్యలో కన్నీళ్ళు తుడుచుకుంటోంది. తుడిచినకొద్దీ కన్నీళ్ళు యింకా వస్తూనేవున్నాయి. వెక్కిళ్ళు ఆపుకోవడానికి ప్రయత్నిస్తోంది. సుందరి అక్క వెనకాల నిలబడి వుంది. సుందరికూడా విచారంగానే వుంది. ఇద్దరూ అలావుండటం చూసి, ఏం జరిగిందని అక్కనడగాలనిపించింది. నేను అడగబోయేలోగా, అక్క మెల్లగా–''సుందరీ! నువ్వైనా యినాచెప్పు; అమ్మ తను అనుకున్నది చెయ్యక మానదు! నువ్వెంత అదృష్టవంతురాలివి సుందరీ! మా అమ్మ అన్నప్రకారం చేసి తీరుతుంది. సుందరీ! మీనాన్నగారైతే అలా చేస్తారా?''– అంది.

సుందరికూడా విచారంగా, గంభీరంగా – ''మనిద్దరం అక్కచెల్లెళ్ళమైతే ఎంత బాగుండేది! ఇలాగే వుండిపోయేవాళ్ళం!''–అంది.

''అవును....ఇలాంటే నడివయసు మనిషిని పెళ్ళిచేసుకునేకంటే యిలా వుండి పోవటమే మంచిది. మీనాన్నగారివి ఎంతమంచి అభిప్రాయాలు సుందరీ! నేనెంత అభాగ్యురాలిని! అమ్మఅన్నంతపనీ చేస్తుంది!నాకేమీ తెలియదనుకుంటుంది అమ్మ....కాని నాకంతా తెలుసు. సుందరీ నువ్వు చిన్నదానివి....కాని, నీకుతప్ప ఇంకెవరికి చెప్పుకోను....!''

మాటిమాటికీ కళ్ళు తుడుచుకుంటూ, సుందరి భుజమ్మీద చెయ్యేసి వెనుదిరిగి చూసింది అక్క.

నన్ను చూసింది. నేను వెంటనే – ''అక్కా! నువ్వు అనవసరంగా ఎందు కింత భయపడతావ్? అమ్మ ఆ విధంగా ఎలాచేస్తుందో చూద్దాం!'' –అన్నాను. అక్క కింద చతికిలబడి కూర్చుని – ''తమ్ముడూ! నువ్వెప్పుడొచ్చావ్?''–అంది. మళ్ళీ అక్కకళ్ళు నీళ్ళతో నిండాయి. అశ్రుపూరితమైన కళ్ళతో నావంకచూస్తూ– ''తమ్ముడూ! నీకు నమస్కారం చేస్తాను.... ఇప్పుడు నేనన్నమాటలన్నీ అమ్మతో చెప్పకు....'' అంది జాలిగా! అప్పటి అక్క కరుణామయ స్వరూపం; అశ్రుపూరిత నేత్రాలూ నాకిప్పటికీ కళ్ళకు కట్టినట్లున్నాయి.

నేను అమ్మకీ మాటలన్నీ చెబుతానన్న భావన అక్కకి రావటం నాకు

కలిగించింది. "అక్కా! నేనివన్నీ అమ్మకి చెబుతానని ఎలాఅనుకున్నావ్? నేనంత దుర్మార్గుడిననుకున్నావా? ఒట్టువేసుకుని చెబుతున్నానక్కా! నేను అమ్మకి ఏమీ చెప్పను!" - అంటూ, సుందరివంక చూశాను. సుందరికూడా నన్నుగురించి యిలాగే అనుకుంటుందా, అన్న ఆలోచన వచ్చింది నాకు. సుందరి నిశ్చలంగా నిలబడివుంది. ఒక్కమాటయినా మాట్లాడలేదు.

అప్పుడు మేము మేడిచెట్టుకింద నిలబడివున్నాం. పైనుంచి పళ్ళు రాలుతున్నాయి. మాకు ఆ ధ్యాసయినా లేదు. భవిష్యత్తులో రాబోయే సమస్యల భారమంతా మేమే మోస్తున్నట్టూ, ఆ సమస్యల్ని పరిష్కరించడానికి ప్రయత్నిస్తున్నట్టూ గంభీరంగా ఆలోచిస్తూ వుండిపోయాం.

ఇంతలో లోపల్నుంచి బిగ్గరగా కేకలు వినిపించాయి. మేము ఇంట్లోకి వెళ్ళిపోయాం. అమ్మ మామూలుగా తిట్లు ప్రారంభించింది. అయితే ఈసారి అమ్మకోపమంతా అక్కమీదవుంది—"ఇన్నేళ్ళువచ్చినపిల్ల యింకా ఇంట్లో వుందంటే అందరూ మొహానవూస్తారు!....ఇంటిపని ఏమీ ముట్టుకోదు.... రోజంతా బయట తిరగటం; లేదా పైకెళ్ళి పుస్తకాలు చదవటం! ఈసారి అడుగు బయటకివేశావో, చూసుకో....నీరాత తగలడ!"—అంది.

ఆరోజునుంచీ అక్కప్రవర్తనలో పూర్తిగా మార్పువచ్చేసింది. ఆ చాపల్యం; చాంచల్యం; చిలిపితనం; ఆటపాటలూ అన్నీపోయాయి. నాతో పోట్లాడుతూ, నాతో ఆబలాడుతూవుండే అక్క నిన్నటిదాకా బాలిక; కాని ఇవ్వాళ వున్నట్టుండి ప్రౌఢగా మారిపోయింది! ఎవరేమన్నా, ఎన్ని తిట్టినా నోరు విప్పకుండా అన్నీ భరిస్తూ మౌనంగా వూరుకుంటుంది. అయితే ఒక్క విషయంలో మాత్రం అమ్మమాట లెక్కచెయ్యలేదు అక్క.

పనులన్నీ పూర్తయ్యాక ఏమాత్రం అవకాశం దొరికినా పైకివెళ్ళి చదువుకుంటోంది. శివరామ్ పంత్‌గారి దగ్గర పుస్తకాలూ, పేపర్లూ తీసుకుని చదువుతోంది. అమ్మ ఎన్నితిట్టినా అది మాత్రం మానలేదు. ఆవిషయంలో అక్కకి వున్న ఆసక్తి మా అందరికీ ఆశ్చర్యం కలిగించింది. అక్కలో కలిగినమార్పు యొక్క ప్రభావం నామీదా సుందరిమీదాకూడా పడింది. మేం ముగ్గురమూ కూడా అప్పుడే పెద్దవాళ్ళమైపోయినట్టూ,అనుభవజ్ఞులమైపోయినట్టూ అనిపించింది.

రెండుమూడు మాసాలతర్వాత ఒకరోజు అకస్మాత్తుగా నాన్నగారి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. "పెళ్ళిరోజులు దగ్గరకి వస్తున్నాయి. అమ్మాయిపెళ్ళి తొందర పడి, ఎవడితోనో చేసెయ్యొద్దు. నేనొక మంచి కుర్రాణ్ణి చూసివుంచాను. నా పనులు పూర్తయినవెంటనే నేను అక్కడికొస్తాను. బ్రహ్మాండంగా పెళ్ళి జరిపిద్దాం !"– అని రాశారా వుత్తరంలో. ఉత్తరం చదివి అమ్మ మామూలుగా మండిపడింది. మనసులో ఏదో నిశ్చయించుకుంది. మా దౌర్భాగ్యం వల్లనే తన నిర్ణయం అమలు పరిచింది.

## అమ్మ దృఢనిర్ణయం

నాన్నగారి ఉత్తరం రాగానే, అమ్మ తన నిర్ణయాన్ని యింకా బలపర్చుకుంది. అమ్మమ్మతో—"అమ్మా ! నువ్వాయన మాటలు నమ్మవద్దు ; ఏ పనీపాటా లేనివాళ్ళు అలాగే కబుర్లుచెబుతారు ; మన కులానికీ వంశానికీకూడ కళంకం తెచ్చారు ; ఏమైనాసరే, నేనీ మార్గశిర మాసంలో పిల్లదాని పెళ్ళిచేసితీరుతాను!" —అంది.

మేము దరిద్రనారాయణులం ! మాబోటివాళ్ళ పిల్లలకి మంచి వరులెక్కడి నుంచి వస్తారు ? అక్కని చూడ్డానికొచ్చినవాళ్ళంతా బీదవాళ్ళే. ఒక కుర్రాడొచ్చాడు. యోగ్యుడు ; అందమైనవాడు ; ఆస్తివుంది ; ఒక్కడే కొడుకు ; కాలేజీలో చదువుతున్నాడు. ఏ వంకా లేదు. కాని—ఇరుగుపొరుగు అమ్మలక్కలు అమ్మకి లేనిపోని చాడీలుచెప్పి ఆ సంబంధం చెడగొట్టారు. "ఆ కుర్రాడు సంస్కర్త ; పెళ్ళయినాక అమ్మాయిచేత గొన్లు తొడిగిస్తాడు ; స్కూలుకి పంపుతాడు ; కాఫీలూ, బిస్కట్లూ అలవాటు చేస్తాడు....!"అని ఈ విధంగా రకరకాలుగా చెప్పారు. శివరామ్‌పంత్‌గారు చాలావిధాలుగా నచ్చజెప్పాలని చూశారు—"కుర్రాడు బుద్ధిమంతుడు ; మనం ఒక్క గుడ్డిగవ్వకూడా యివ్వనక్కర్లేదు ; పెళ్ళయ్యాక స్కూలుకి పంపితేమాత్రం ఏంపోయింది ? పెళ్ళయిన

తర్వాత పిల్ల ఎలాగూ పరాయిదేగా? వాళ్ళు ఏంచేసుకుంటే మనకి ఎందుకు? పరాయివాళ్ళ మాటలువిని అనవసరంగా సంబంధం పాడుచేసుకోవద్దు....''—అని శతవిధాల చెప్పారు. కాని అమ్మ వినలేదు. ఆయనకూడా సంస్కర్త అని ఆయనంటేకోపం మావాళ్ళకి. ఇరుగుపొరుగువాళ్ళు ఆయనమీదకూడా అమ్మకి చాడీలు చెప్పారు. ''శివరామ్‌పంత్ ఈసంబంధం కుదర్చడానికి అయిదువందలు అవతలివాళ్ళదగ్గర పుచ్చుకున్నాడు; పైగా ఆ కుర్రాడికి భయంకరమైన రోగం వుంది; ఎవ్వరూ పిల్లనివ్వకపోతే యిక్కడికొచ్చాడు....''—అంటూ చెప్పారు. ఆ మాటలు విని అమ్మ మండిపడింది. శివరామ్‌పంత్‌గారితో—''అంతమంచి వరుడైతే మీ అమ్మాయినే యిచ్చుకోరాదూ!''—అంది కోపంగా. ''మమ్మల్ని మోసంచెయ్యడానికి ప్రయత్నిస్తున్నారు....''—అనికూడా నిందించింది.

ఆ సాయంత్రం అమ్మమ్మ నన్ను పిలిచి— ''రేపు యిల్లు ఖాళీచెయ్యమని శివరామ్ పంత్‌గారితో చెప్పిరా!''— అంది. ఆ మాటవిని నేను అదిరిపడ్డాను. ఆ సంగతి నేనే వాళ్ళతో ఎలా చెప్పడం? నాకు చిక్కువచ్చిపడింది. అమ్మ అక్కడే నిలబడివుంది. నేను తటపటాయించడంచూసి, తిట్లు ప్రారంభించింది—''వెధవా! కదలవేరా! ఏం, నీకుకూడా సంస్కర్త కావాలనివుందా?.... వాళ్ళ అమ్మాయిని నువ్వు పెళ్ళి చేసుకుంటావా? సిగ్గులేదూ ఆమాట అనడానికి? నీపెళ్ళి యిప్పుడే చేస్తానుండు .... పో యిక్కడినుంచి! పోతావా, తన్నమంటావా?''— అంటూ చెయ్యెత్తింది. నేనింక అక్కడ ఒక్కక్షణంకూడా వుండకుండా పరుగెత్తాను. ఆ కబురు పంత్‌గారితో ఎలా చెప్పాలో నాకు అర్థంకావటంలేదు. చెప్పకపోతే యింట్లో కూడుకూడా పెట్టేటట్టులేరు. పంత్‌గారు యిల్లు ఖాళీచేసి వెళ్ళటమంటే ఏమిటో ఆలోచించుకున్నాను. సుందరీ నేనూ విడిపోతాం! ఆ విషయం అనుకోగానే నాకొక ఆలోచన తట్టింది- అమ్మమ్మకి మెల్లిగా ఏదో విధంగా నచ్చజెప్పాలని. అమ్మమ్మదగ్గరకి వెళ్దామని మెట్లు ఎక్కుతుండగా— దార్లో-చీకటి గదిలో కూర్చుని, అక్కా, సుందరీ ఏడుస్తున్నారు. వాళ్ళనిచూసి నాకూ ఏడుపొచ్చింది. అవమానం భరించలేక- వెళ్ళిపోవాలనే నిర్ణయించుకుంది సుందరి తల్లి. సుందరి ఇదంతా అక్కకి చెబుతోంది. ముగ్గురమూ ఏడుస్తున్నాం. ఏడుపు ఎవరైనా వింటారేమోనని భయపడుతున్నాం. కాని నేను ఆగలేక

పోయాను. ఏడుస్తూనే శివరామ్ పంత్‌గారి దగ్గరకెళ్ళాను. ఆయన నన్ను చూస్తూనే– "నువ్వెందుకొచ్చావో నాకు తెలుసు ! నాలుగైదు రోజుల్లో యిలు ఖాళీచేసి వెళ్ళిపోతామని అమ్మతో చెప్పు.... అందాకా...."–అన్నారు.

నేనింక ఏడుపు ఆపుకోలేక పోయాను. ఏడుస్తూనే– "వద్దు; వద్దు; మీరు వెళ్ళొద్దు; కనీసం సుందరినైనా వదిలిపెట్టి వెళ్ళండి ... మాయింట్లో వదిలిపెట్టి వెళ్ళండి....!"–అన్నాను.

నే నేమంటున్నానో నాకే తెలియదు. సుందరిని మాయింట్లో ఎందుకు వదిలి వెళ్ళకూడదో తెలిసే వయసు కాదది. అక్క; సుందరి– ఒకరినొకరు వోదార్చుకుంటూ యిద్దరూ ఏడుస్తున్నారు ! ఏడుస్తూనే అక్క– "సుందరీ ! నువ్వెంత అదృష్టవంతురాలివి ! నువ్వు నీ యిష్టప్రకారం పెళ్ళిచేసుకుంటావ్ .... కాని నా స్థితిచూడు...."-అంది. సుందరితో ఆ కాలేజీకుర్రాడు తనకినచ్చాడనీ, అమ్మ పట్టుదలవల్ల నే తన అదృష్టం యిలా తగలబడిందనీకూడ అంది. కాని ఇది నాతో చెప్పి ఏంలాభం ?

## నోరులేని ప్రాణి

అక్కకి సుందరి చాలా ఆసరాగావుండేది. ఆ ఆసరాఅనేది యిప్పుడు లేకుండా పోయింది. నా కత్యంత ప్రియమైన నా స్నేహితురాలు నాకు దూరంగా వెళ్ళిపోతోంది. మళ్ళీ తిరిగి రావటంకూడా అసంభవం. నాకా చివరిమాటలు మాటిమాటికీ గుర్తు వస్తుంటాయి. వెళుతూ, వెళుతూ–సుందరి– "నేను వెళుతున్నాను" అనగానే మేం ముగ్గురమూకూడా ఏడ్చాం. అక్క వెక్కివెక్కి ఏడుస్తూ–

"సుందరీ, మళ్ళీ మనమెప్పుడూ కలవంగదా ! నువ్వయితే మా యింటికింకరావు....!"–అంది. ఆ మాటవిని నేనుకూడా పూడిపోయిన గొంతుతో– "అలా ఎందుకంటావ్ అక్కా ? సుందరి రాకపోతే మనమే సుందరి దగ్గరికి వెళదాం.... మనం వెళుతూవుందాం....!"–అన్నాను. మేము ముగ్గురమూకూడ

నీళ్ళునిండిన కళ్ళతో ఒకరినొకరు చూస్తూవుండిపోయాం. "నీ మాటవేరు తమ్ముడూ!....నువ్వెప్పుడయినా వెళ్ళవచ్చు; నేనీ యింట్లో ఒక నోరులేని ప్రాణిని! ఎవరైనా కొడితే పడాలి; కూర్చోమంటే కూర్చోవాలి; నుంచోమంటే నుంచోవాలి!"—అంది అక్క. అక్క అన్నమాటలకి అర్ధమేమిటో అప్పట్లో నాకు తెలీలేదు.

రేపు స్కూలు విడిచిపెట్టగానే—సాయంత్రం సుందరిగారి కొత్తయింటికి వెళ్ళాలని నేనప్పుడే నిర్ణయించుకున్నాను. ఇలా వెళతానని అక్కతో చెప్పాను. "నేను పొద్దునే చెప్పానుగా తమ్ముడూ! నేనూ వెళతానని చెప్పే హక్కూ ధైర్యమూ నాకున్నాయా? అందుకనే, నేనీ యింటిలో నోరులేని ప్రాణి నన్నాను!"—అంది అక్క.

సుందరి యింటికి వెళ్ళొచ్చునని ఆ రోజు నాకు చాలా ఆనందంగావుంది. "చూడు తమ్ముడూ! నే నేదోవిధంగా దొంగచాటుగా సుందరి దగ్గరకొస్తానని చెప్పు; ఒకవేళ నేను రాలేకపోతే, రామాలయానికి రమ్మనిచెప్పు; అక్కడ కలుసుకుంటాం...."—అంది అక్క.

అక్క ఆమాటలంటూవుండగానే యింతలో అమ్మ వెనకనుంచివచ్చి, అక్క వీపుమీద ఒక్క చరుపుచరిచింది. చరిచి, తిట్లు ప్రారంభించింది. నేనక్కడి నుంచి తుర్రుమన్నాను.

సాయంత్రం స్కూలు విడిచిపెట్టగానే నేను సుందరిగారి యింటిదారి పట్టాను. సుందరితోనూ, వాళ్ళమ్మతోనూ— "నేను స్కూలు విడిచిపెట్టగానే రోజూ మీ యింటికొస్తాను.. "— అన్నాను. "మీ అమ్మగనక వద్దంటే రావద్దులే"— అంది, సుందరితల్లి. నిన్నటి విషయాలు నే నామెకు చెప్పలేదు. సుందరికి మాత్రం అన్నీ పూస గుచ్చినట్టు చెప్పేశాను. "మీ అమ్మ మళ్లీ గంగని బాగా కొట్టి వుంటుంది గదా....!"— అంది సుందరి బాధపడుతూ. "నేను ఎప్పుడైనా వస్తానని అక్కతో చెప్పు .. "—అంది. నేను యింటికి తిరిగొచ్చేసరికి యిల్లంతా నిశ్శబ్దంగావుంది. అమ్మ; అక్కా యిద్దరూ యింట్లో లేరు. నేను ఆలస్యంగా రావటం అమ్మ చూడనందుకు సంతోషించాను నేను.

అమ్మా, అక్కా చాలా ఆలస్యంగా వచ్చారింటికి. అక్క నన్ను అవతలికి

పిలిచి రహస్యంగా చెప్పింది. అక్కని ఎవరికో చూపించటానికని తీసుకెళ్ళిందట అమ్మ. "నేను సుందరి నాన్నగారికి ఉత్తరం రాశాను.... అది ఆయనకి అంద జెయ్యాలి....నువ్వు మాత్రం చదవకు...."- అంది, అక్క మెల్లగా.

## తుది నిర్ణయం

మర్నాడు ఉదయం భోజనంచేసి నేను స్కూలుకి వెళ్తున్నాను. ఇంతలో అక్క రహస్యంగా నన్ను పక్కకిపిలిచి-మెల్లిగా-"పైన చీకటిగదిలో ట్రంక్ పెట్టెకింద ఉత్తరంవుంది....తీసుకెళ్ళు... కాని నువ్వు చూడకూడదు....చూడనని వాగ్దానంచేశావు; గుర్తుంచుకో...."-అంది. ఆ మాటచెప్పి, వెంటనే అక్కడి నుంచి వెళ్ళిపోయింది. నేను పైకెళ్ళి, మెల్లిగా ఆ ఉత్తరం తీసుకున్నాను. ఉత్తరంపైన శివరామ్‌పంత్‌గారి పేరు రాసివుంది. పేరు సరిగ్గాలేదుగాని అక్ష రాలు మాత్రం అందంగావున్నాయి. ఆ ఉత్తరంలో ఏముందో చూడాలనిపించింది. స్కూలు విడిచిపెట్టగానే సుందరిగారింటికి వెళ్ళాను. లోపలికెళ్ళేముందు మళ్ళీ ఉత్తరంలో ఏముందో చదవాలనిపించింది. జేబులోంచి బయటికితీశాను. అటూ యిటూతిప్పిచూశాను. విప్పి చూడబోయాను. ఇంతలో ఎవరో ఎక్కడినుంచో తియ్యటి కంఠంతో-"అలాంటి పాపం చెయ్యొద్దు!"-అని చెప్పినట్టనిపించింది. ఎదురుగా చూస్తే, సుందరి నిజంగానే అక్కడ నిలబడి నన్ను పిలుస్తోంది. నేను ఖంగారుపడ్డాను. ఉత్తరం చేతిలోంచి జారికిందపడింది. అది తీసే వంకతో, నా మనోభావాలు దాచుకోడానికని కిందికి వంగాను. సుందరి పిలుస్తోంది; కాని సమాధానం చెప్పడానికి ధైర్యం చాలటంలేదు.

నా పరిస్థితిచూసి సుందరికి సందేహం కలిగింది. "ఏమిటి? ఏం జరిగింది? మాట్లాడవేం?" అని అడిగింది. "ఏంలేదు....మీనాన్నగారి కిమ్మని అక్క ఈ ఉత్తరమిచ్చింది"- అంటూ, ఉత్తరం సుందరి చేతిలో పెట్టాను. "ఉత్తరంలో ఏముంది?"- అని అడిగింది సుందరి. నేను మళ్ళీ సంకట పరిస్థితిలో పడ్డాను.

సుందరి నిజంగానే నా ఆలోచన గ్రహించిందా : 'నేనుచూడలేదు .... నాకు తెలియదు'- అన్నాను. ఇద్దరమూ లోపలికెళ్లాం. మనసు బాగుండక పోవటం చేత సుందరితో ఎంతసేపు మాట్లాడినాకూడ నాకు ఆనందం కలగలేదు. ఇంటికి వచ్చేశాను. నేను వచ్చేసరికి - అక్కడ ఒక కారు నిలబడివుంది. అందులోంచి ఎవరో దిగుతున్నారు. నాయీడు కుర్రాడుకూడ ఒకడున్నాడు. అతన్నెక్కడో చూసినట్టుగావుంది.

లోపలికెళ్ళాను. అక్క ఎక్కడా కనబళ్ళేదు. ఇల్లంతా వెదికాను. ముంగిట్లోకి వెళ్ళిచూశాను. సుందరి వెళ్ళేనాడు వాళ్ళిద్దరూ అక్కడే కలుసుకున్నారు. మేడిచెట్టుకింద-మహదేవ మందిరం దగ్గర కూర్చుని ఏడుస్తోంది అక్క. ఏడుస్తూ వుండగానే, ఆమె నోటినుంచి అస్పష్టంగా నాకేవోమాటలు వినబడ్డాయి- "భగవంతుడా ! ఈశ్వరా ! నేనేం పాపంచేశానని నన్నిలా శిక్షిస్తున్నావ్?" నేను ఆవెనకే నిలబడి చూస్తున్నాను.

నేనాదృశ్యం ఎక్కువసేపుచూడలేక పోయాను. అక్క భుజమ్మీద చెయ్యేసి-ప్రేమగా-"అక్కా : నువ్విచ్చిన ఉత్తరం నేను చదవకుండానే సుందరికిచ్చాను; వాళ్ళనాన్నగారు యింటికిరాగానే యిచ్చేస్తుంది...." అన్నాను. ఆ మాటచెబితే అక్క సంతోషిస్తుందేమో అనుకున్నాను. కాని అక్కమొహంలో మార్పేమీ లేదు. "ఇంకా దాని ఉపయోగమేముంది ? జరగాల్సిందంతా జరిగిపోయింది.... తుదినిర్ణయం జరిగిపోయింది :"- అంది.

కాస్సేపుఆగి-"సుందరికూడా నా ఉత్తరం చదివిందా :" అని అడిగింది అక్క. "అది సుందరి పేరలేదుగదా, ఎలా చదువుతుంది ?-" అన్నాను. అక్కనిరాశతో- "సుందరి చదివినా ఫర్వాలేదు...."- అంది. "అయితే నేను చదవకూడదా అక్కా ?"-అన్నాన్నేను.

అక్క దీర్ఘంగా నిట్టూర్చి - "నీనోటిలో మాట దాగదని నిన్ను చదవొద్దన్నాను....అంతే....ఇంకా యిప్పుడేముందిలే : ఏమి జరగాలో అదంతా జరిగిపోయింది...."-అంటూ కళ్లు తుడుచుకుని గబగబా యింట్లోకి వెళ్లి పోయింది.

అక్కపడ్తున్న బాధకి కారణమేమిటో ఆరాత్రి నాకు తెలిసింది. అక్క వివాహం నిశ్చయమైపోయింది. సరిగ్గా ఆరోజుకి తొమ్మిదోనాటి తెల్లవారుఝామున

వివాహం! మామయ్యకి కూడా ఉత్తరం రాశారు. వరుడికి ముప్ఫయ్ అయిదు సంవత్సరాలన్నారు. కాని చూడ్డానికి మాత్రం అరవై ఏళ్ళ వాడిలావున్నాడు.

మొదటి భార్యలిద్దరూ చచ్చిపోయారు. ఇది మూడో పెళ్ళి. మొదటి భార్య కొడుకు పెద్దవాడయ్యాడు. రెండో భార్య కూతురికి పెళ్ళయిపోయింది. ఆయన పిల్లలంతా ఇప్పుడు పెళ్ళిచేసుకోవద్దని తండ్రితో చెప్పారు. కాని ముసలాడికి పెళ్ళిచేసుకోవాలని చాలా ఆత్రంగావుంది.

పిల్లలమాట ఆయన వినలేదు. అక్కని చూసిన దగ్గర్నించీ, పెళ్ళి తొందరగా చేసెయ్యమంటూ పట్టుపట్టాడు. పెళ్ళికూతురికి తనివ్వబోయే ఆభరణాల జాబితా అంతా చెప్పాడు. ఇరుగుపొరుగువాళ్ళంతా–"వరుడు చాలా మంచివాడు; డబ్బున్న వాడు; రెండోపెళ్ళయితే ఏం? మూడోపెళ్ళయితే ఏం? ఆ చింత ఏమీ అక్కర్లేదు; మాట్లాడకుండా కళ్ళుమూసుకుని చేసెయ్యవచ్చు....!"– అని అమ్మకి బోధించారు. అమ్మ పెళ్ళి ప్రయత్నాలు ప్రారంభించింది.

మర్నాటి తెల్లవారుఝామునే, నేనెవరితోనూ చెప్పకుండా శివరామ్ పంత్‌గారి యింటికెళ్ళాను. ఈ కథంతా ఆయనతోచెప్పి– "ఈ నరకంనుంచి మా అక్కనెలాగైనాసరే కాపాడండి....!" – అని ఆయన్ని వేడుకున్నాను. ఆయన మెల్లిగా నావీపు నిమురుతూ–"భావూ, నువ్వింకా చిన్నవాడివి;లేకపోతే నేనే ఈ విషయంలో నీ సలహా అడిగేవాణ్ణి; కాని యిప్పుడు నాచేతిలో ఏమీలేదు; మీ అక్కరాసిన ఉత్తరంతోపాటు నేను మరో ఉత్తరంరాసి రెండూకలిపి మీ మామయ్యకి పంపాను; ఇప్పుడేమైనా జరిగితే ఆయన వల్లనే జరగాలి; లేకపోతే లేదు."–అన్నారు.

చివరిసారిగా చెప్పిచూద్దామని– తనకి జరిగిన అవమానాన్నికూడా లెక్కచెయ్యకుండా ఆయన మాయింటి కొచ్చారు. ఈ పెళ్ళివల్ల కలిగే దుష్పరిణామాల గురించి అమ్మమ్మకీ అమ్మకీ నచ్చజెప్పాలని చూశారు. కాని ఏమీ లాభంలేకపోయింది. తిట్లూచివాట్లూ తిని తిరిగి వెళ్ళిపోయారు.

మామదగ్గర్నించి ఉత్తరమేమీరాలేదు. ఆ ఆశకూడా అంతరించింది. పెళ్ళివారొచ్చారు. పెళ్ళికొడుకు గుర్రం యింటిముందొచ్చి నిలబడింది. పెళ్ళితంతు ప్రారంభమైంది. పురోహితుడు గొంతు చించుకుని మంత్రాలు చదువుతున్నాడు.

బ్యాండు మేళాలుకూడా తారాస్థాయిలో మోగుతున్నాయి. వినేవాళ్ళ చెవులు బ్రద్దలు కాకుండా ఎలా వున్నాయో నాకర్థంకాలేదు. బలిపీఠానికి బలిపశువుని తీసుకొచ్చినట్టుగా అక్కని వివాహవేదికవద్దకు తీసుకొచ్చారు. బలిపశువుమొరలు వినపడకుండా వుండేందుకుగాను పురోహితుడు ఇంకా బిగ్గరగా అరుస్తున్నాడు.

అక్కవెక్కిళ్ళు వినబడకుండానే పురోహితుడు అంత బిగ్గరగా మంత్రాలు చదువుతున్నట్టు అనిపించిందినాకు. చివరికి – పెళ్ళనే పేరుగల ఆయజ్ఞంలో అక్కబలి అయిపోయింది!!

## చిన్ననాటి స్నేహితుడు

అక్క పెళ్ళయ్యాక సుందరిదగ్గర కెళ్ళడానికి నాకు వ్యవధి దొరకలేదు. చివరి కొకనాడు వెళ్ళాను. మాయిద్దరికికూడ ఒకరిమాటలొకరు వినాలని చాలా కుతూహలంగా వుంది. కాని యిద్దరమూకూడ ఏమీమాట్లాడ లేకపోయాం. సుందరికళ్ళల్లో నీళ్ళునిండాయి. గద్గదస్వరంతో – "చివరికి అనుకున్నంతా అయ్యింది...." అంది మెల్లిగా. ఆవేళ శివరామ్‌పంత్‌గారు కూడ త్వరగానే యింటికొచ్చారు. పెళ్ళివిషయాలన్నీ నేను ఆయనతో చెప్పాను. అమ్మ మూర్ఖత్వాన్ని అందరూ నిందించారు. పెళ్ళికి మామయ్య ఎందుకు రాలేదన్న విషయం గురించికూడా చర్చజరిగింది. కబుర్లన్నీపూర్తయ్యాక నేనులేచి నిలబడ్డాను. "నేను నీకోసం పక్కింటివాళ్ళ కుర్రాడిచేత కబురుచేద్దామనుకున్నాను; మీరిద్దరూ చిన్నప్పుడు కలిసిచదువు కున్నారటగదా, అతను చెప్పాడు...."– అన్నారు, శివరామ్ పంత్‌గారు.

నేనాశ్చర్యపోతూ – "ఏ కుర్రాడు?" – అని అడిగాను.

"వినాయక్"

"వినాయక్?"

ఇంతలో వెనకనించి – "అవును, నేనే; అరే భావూరావ్! నన్నప్పుడే మర్చి పోయావా!" – అన్నమాటలు వినిపించాయి. వెనక్కితిరిగిచూస్తే, నాచిన్న నాటి స్నేహితుడు – చిన్నప్పుడు నాతో దెబ్బలాడిన స్నేహితుడు – వినాయక్!

వినాయక్ ఇప్పుడు పెద్దవాడయ్యాడు. పోలికలుకూడ కాస్తమారాయి. అతను మళ్ళీ మాస్కూల్లోనే చేరుతున్నాడన్న సంగతినివిని నాకు సంతోషం కలిగింది.

నాలుగురోజుల తర్వాత వినాయక్ మాస్కూల్లో చేరాడు. అతనికి పరీక్ష పెట్టి, ఆతర్వాత నాక్లాసులో కూర్చోబెట్టారు. చిన్నప్పటి మా వైషమ్యాలు అంతరించాయి. రోజూసాయంత్రం నేను సుందరిగారింటికి వెళుతూ వుండే వాణ్ణి. వినాయక్ యిల్లుకూడా అక్కడే గనుక, అతనుకూడా నాతో పాటు వస్తూండేవాడు.

ఒకరోజు సాయంత్రం వినాయక్ వాళ్ళింటికెళ్ళాను. లోపలికెళ్తుండగా, లోపలి నుంచి– "సుందరి ఎంత అందమైనపిల్ల! వినాయక్‌కిచ్చిచేస్తే ఎంత బావుంటుంది! వాళ్ళుగనక వొప్పుకుంటే, త్వరగా చేశేద్దాం .... వాళ్ళు వొప్పుకోక ఏం చేస్తారులే...."– అన్నమాటలు వినిపించాయి. నా మీద పిడుగుపడినట్లయింది. ఇకలోపలికి వెళ్ళకుండా అక్కడినుంచి వెంటనే పరుగెత్తు కొచ్చేశాను. నా చెవుల్లో ఆమాటలే మాటిమాటికీ మారుమ్రోగుతున్నాయి. ఆమాటలు విన్న మరుక్షణంనుంచి నా బాల్యచాపల్యమంతా అంతరించినట్లని పించింది. విచిత్ర మైన ఆలోచనలు నామనసు నావరించాయి. వినాయక్‌పట్ల నాకొక విధమైన ద్వేషభావం కలగసాగింది.

## అక్కా, పెళ్ళయిపోయిందా ?

మర్నాడు స్కూల్లో – మధ్యాహ్నపు విరామసమయంలోకూడ నేను వినా యక్‌తో మాట్లాడలేదు. సాయంత్రంకూడ అతనిమాట వినిపించుకోలేదు.

సుందరిగారింటికి వెళ్ళకుండా సరాసరి యింటికెళ్ళి పోదామనుకున్నాను. చివరికి వినాయక్ నన్నొదలకుండా నావెంటపడ్డాడు. "ఎందుకు పొద్దుటినుంచీ యిలా వున్నావ్? పొద్దున్నకూడా మాయింటికి రాలేదు; యిప్పుడూ రానంటున్నావు; ఏమిటి? నేనివ్వాళ నీకో మంచికబురు చెబుతాను...." – అంటూ నన్నుతవ పక్కకి లాగుకున్నాడు.

'మంచి కబురు'– అన్నమాట వినగానే నాగుండె దడదడలాడింది. నేననుకునేదేనా ఆమంచి కబురు: బహుశా అదేఅయివుంటుంది. అదే అతనికి 'మంచి కబురు!'

నేను కొంతసేపు సందిగ్ధావస్థలో పడ్డాను. చివరికి ఆ మంచికబురేమిటో వినాలన్న కుతూహలం కలిగింది. అతని యింటివేపు నడవసాగాను. "నన్ను ఏడిపించవు గదా ?" – అన్నాడు వినాయక్.

నేను కొంచెం కోపంగా – "నేను నిన్నెందుకేడిపిస్తాను ?" – అన్నాను.

మెల్లిగానవ్వుతూ – "ఏంలేదు ; మాయింట్లో నాపెళ్ళి గురించి ఆలోచిస్తున్నారు...." – అన్నాడు వినాయక్.

"అహం....అలాగా ? పెళ్ళి కూతురెవరు ?" —— అని అడిగాను నేను—— గంభీరంగా.

"చెప్పుకో చూద్దాం – నీకు తెలిసిన అమ్మాయే !"

కోపం; విచారం కలిగిన కంఠంతో – "ఎవరూ, సుందరా ?" అని అడిగాన్నేను.

"అవును ! సరిగ్గాచెప్పావ్ !" – అన్నాడు వినాయక్ సంతోషంగా.

"సుందరా ?" – అని మరోసారి అడిగి, అతని సమాధానం వినకుండా, వెంటనే అక్కడినుంచి పరుగెత్తి వెళ్ళిపోయాను.

నా బుర్ర ఆలోచనలతో దిమ్మెక్కి పోయింది. దారిలో అదే ఆలోచన; ఇంట్లో అదే ఆలోచన. నామనసులో మహా కల్లోలం చెలరేగింది. రాత్రి నిద్ర పట్టలేదు.

ఎంత రాత్రి గడిచినా ఎంత ప్రయత్నించినా నిద్రరాలేదు.

ఉదయానికి తల బరువెక్కిపోయి, నొప్పితో పగిలిపోసాగింది. ఒంట్లోంచి

వేడి పొగలు వస్తున్నట్టుగావుంది. మంచమ్మీద నుండి లేవాలని ప్రయత్నించినా లేవలేక పోయాను. తలతిరుగుతోంది. రోజూ నేను పెందరాడే నిద్రలేస్తాను. ఆవేళ యింకా లేవక పోయేసరికి యింట్లో అంతా నన్నులేపడానికి వచ్చారు. చూస్తే, నాకు కొద్దిగా జ్వరం తగిలింది.

అంతా భయపడ్డారు. అకస్మాత్తుగా జ్వరమెందుకు వచ్చిందో ఎవరికీ అర్థం కాలేదు. ఒక రోజు; రెండు రోజులు; మూడు రోజులు; నాలుగు రోజులు గడిచి పోయాయి. జ్వరం ఎక్కువయిందే గాని తగ్గలేదు. రోజురోజుకీ ఎక్కువయింది. నేను జ్వరపు బాధలో, అపస్మారక స్థితిలో ఏమేమివాగానో నాకే తెలియదు. పదిహేడో రోజునో, పద్దెనిమిదో రోజునో అర్ధరాత్రి సమయాన నాకు తెలివి వచ్చింది. కళ్ళువిప్పి చూశాను. ఇంట్లోవాళ్ళంతా నాచుట్టూ కూర్చుని వున్నారు. ఎవరెవరున్నారో నాకు తెలియలేదు. కాని అక్కమాత్రం మంచమ్మీద నాపక్కనే కూర్చునివుంది. అది మాత్రం తెలిసింది. అక్కని చూసి నాకు సంతోషం తగిలింది.

అందరివంకా మరోమారు చూసి, మెల్లిగా అతికష్టమ్మీద చెయ్యిలేపి, అక్కవొడిలో పెట్టి — "అక్కా! పెళ్ళయిపోయిందా?"— అని క్షీణస్వరంతో మెల్లిగా అడిగాను. అక్క నాదగ్గరకి జరిగి — "నీకు తెలివొచ్చిందా తమ్ముడూ? ఏమిటి అడుగుతున్నావ్?" — అంది. అక్కకళ్ళనుంచి వేడివేడి కన్నీటి బొట్లు జారి నా బుగ్గలమీద పడ్డాయి. అక్క ఎందుకలా ఏడుస్తోంది? మరో రోజున్నర వరకూ నేను మళ్ళీ తెలివి లేకుండా పడివున్నాను. నాకేమీ తెలియదు. కానియింట్లో అందరూ నా ఆశవొదులుకున్నారు. నాకు తెలివొచ్చేసరికి—ఉదయం పదకొండు గంటలైంది. ఎవరూలేరు. నా మంచమ్మీద ఒకే ఒక వ్యక్తి కూర్చుని వుంది. ఎవరా అని మెల్లగా చేత్తోతడిమాను. ఇంతలో బాధా పూరితమైన ప్రేమ పూరితమైన అక్క కంఠస్వరం వినిపించింది — "భావూ, భావూ! నీకు తెలివొచ్చిందా! నీ మనసులో ఏముందో చెప్పుభావూ! నువ్వు ఎవరి పెళ్ళిసంగతి మాట్లాడుతున్నావ్? నా పెళ్ళా? నాపెళ్ళి అయిపోయింది గదా; ఆ సంగతి నీకూ తెలుసుగా?"

"నీ పెళ్ళికాదు....నే నడిగింది నీ పెళ్ళి గురించికాదు...." — అన్నాను నేను

మెల్లి గా.

"మరియింకెవరిపెళ్ళి ? జ్వరంలో ఏమైనా కల'వచ్చిందా ?"

"లేదు.... నేను కలలేమీకనలేదు.... తెలివిలోవుండగానే నిన్ను అడిగాను...."

"అయితే యింకెవరి పెళ్ళి తమ్ముడూ : నా పెళ్ళి కాకపోతే మరి యిం కెవరిది :....మనయింట్లో యింకా పెళ్ళి కాకుండా ఎవరున్నారు ? మాటిమాటికీ నువ్వెవరి పెళ్లి గురించి యిలా అడుగుతున్నావ్ :"

ఆ మూడక్షరాల పేరు నా పెదిమల మీదికి కనీసం యాభయిసార్లయినా వచ్చింది. కాని చెప్పలేక, భారంగా కళ్ళు మూసుకున్నాను. అక్క మెల్లిగా మళ్లీ అడిగింది – "బావూ, ఏమైనా చెప్పదలచుకుంటే త్వరగా చెప్పు; యిప్పుడిక్కడ ఎవరూ లేరు; అంతా భోజనాలు చేస్తున్నారు; మళ్ళీ యిక్కడ కొచ్చేస్తారు....త్వరగా చెప్పు...." – అంది. నా మనసులో ఏదో విషయం దాగివుందని అక్క గ్రహించింది. నేను అక్క చెవిలో మెల్లిగా ఆ పేరు చెప్పేశాను. అక్క ఆశ్చర్యంతో – "ఏమిటీ ? సుందరిపెళ్ళా ?" – అంది.

"అవును"

"సుందరి పెళ్ళయిందని నీకు ఎవరుచెప్పారు ?"

"నాకు తెలుసు"

"నీకెలా తెలుసు ?"

"నాకు తెలుసులే; పెళ్ళయిందో లేదో నాకు చెప్పు...."

"వెర్రివాడిలా మాట్లాడకు :"

"చెబుతానన్నావుగా ? త్వరగా చెప్పు...."

"నేను నీ చెవిలో ఒక మంచిమాట చెబుతాను...."

నేను కుతూహలంతో ఆత్రంతో వినబోయాను.

"సుందరిపెళ్ళి...." – అని అక్క చెప్పబోయేలోగా –

"అరె! వీడికి తెలివొచ్చిందే!" – అన్న అపరిచిత కంఠం వినిపించింది. అక్క చెబుతానన్న మంచివార్త అలాగే వుండిపోయింది. నాకు నిరాశ కలిగింది.

## ఈయనెవరు ? ఇదేమిటి ?

"భావూ ! ఒరేభావూ ! చూడు, నేనొచ్చాను చూడు ! ఇక నీకు తగ్గిపోతుందిలే....నా హస్తవాసి అటువంటిది!"

"అరె సిగ్గుపడతావెందుకే ? పెళ్ళయిపోయిందని సిగ్గుపడుతున్నావా ? రా, నా ప్రక్కనకూర్చో.... !" – అంటూకూర్చుని, ఆయన ఒక పొడుగాటి సంచి తీసి, అందులోంచి వక్కలూ కత్తెరాతీసి, వక్కలు కత్తిరించటం ప్రారంభించాడు. ఇంత చనువుగా మాట్లాడే ఈ వ్యక్తి ఎవరా అని నేను ఆలోచించసాగాను.

ఆయన మళ్ళీ ప్రారంభించాడు – "చూడరా అబ్బాయ్! త్వరగా లేచి తిరుగు ! మనం కొత్తయిల్లు అద్దెకి తీసుకుని అందులోకి వెళ్దాం....నువ్వు కోలుకుంటేగాని, యిల్లు మారటానికి వీల్లేదు. కొత్తయింట్లోకి వెళ్ళాక, నేను నా ఉద్యోగానికి వెళ్ళిపోతాను. సరేనా? పిల్లపెళ్ళి తొందరపడి చెయ్యొద్దు; నేను కుర్రాణ్ణి చూసి వుంచానూ అని, నేను లక్ష ఉత్తరాలు రాశాను.

"కాని ఎవరూ వినిపించుకోలేదు. సర్లే, గతించినదాన్ని గురించి యిప్పుడేమనుకుని ఏంలాభం? నాగ్రహదశ అలావుంది; ఎవర్నని ఏంలాభం ! సరే ! పెళ్ళయిపోయింది; మంచిదేగా? నాకు ఎప్పుడూ చెడు జరగదు. ఆ సంగతి నాకుతెలుసు. నా జన్మ చాలా ఉత్తమమైనది. ఒక్కటే గ్రహం సరిగ్గా లేదు; చంద్రుడు గనక మంచి స్థానంలోకి వచ్చాడంటే నేను ఏదో స్థానానికే అధిపతినౌతాను....!"

అమ్మమ్మతో ఆయన ఈ మాటలన్నీ చెబుతున్నాడు. అమ్మమ్మ ఏమీ మాట్లాడకుండా వింటోంది. ఇంతలో అమ్మ లోపల్నుంచి – "భావూ భోజనం తయారైంది....!" – అంటూ బిగ్గరగా అరిచింది.

ఆ అపరిచితవ్యక్తి – "పట్రా, పట్రా ! నేనిక్కడే వున్నాను.... నేను తినిపిస్తాను తీసుకురా...." – అన్నాడు. అమ్మ యింకా బిగ్గరగా, అమ్మమ్మతో "నువ్వుపెడితే పెట్టు; లేదా నేనొచ్చి తినిపిస్తాను!" – అంది. "ఇంకెవరూ పెట్టడానికి వీల్లేదు!"– అనికూడా అంది, శాసిస్తున్నట్టుగా.

ఆ మాట వినటంతోటే ఆ కొత్తవ్యక్తి –

"చూడండి! మొదట్నుంచీ దీని స్వభావమింతే! తను ఏది అనుకుంటే అది జరగాల్సిందే! దాన్నని ఏంలాభంలే....అసలు నా జాతకంలోనే అంతా వుంది.... ....అందులో ఒక్క అక్షరం కూడా తప్పకుండా జరుగుతోంది. చేతిలో డబ్బు నిలవదు; వేళ్ళమీద కూడా తొమ్మిది శంఖాలున్నాయి. పదోశంఖం కూడా వుంటే అంతా నష్టమైపోయేది. అసలు నా గ్రహబలం మంచిది; ఒకటీ అరాగ్రహాలు బాగాలేదుగాని, లేకపోతే ఈపాటికి మహారాజు నయ్యేవాడిని....!"

రావుగారు రావటంవల్ల కానివ్వండి; నాకష్టకాలం పూర్తికావటంవల్ల కానివ్వండి– నాఆరోగ్యం ఆవేళటినుంచీ బాగుపడింది. నాలుగైదు రోజులతర్వాత మెల్లిగాలేచి యింట్లో అటూఇటూ తచ్చాడటం ప్రారంభించాను. శివరామ్‌పంత్ గారు ఒకటిరెండుసార్లు వచ్చిచూసివెళ్ళారు. అక్క నాతో చెబుతానన్నమంచి మాట చెప్పేసింది.

రావుగారు వేరేయిల్లు తీసుకున్నారు. మేము అమ్మమ్మగారి యింట్లోంచి వెళ్ళి అందులో వుంటున్నాం. రోజులు హాయిగానే గడుస్తున్నాయి. ఆరోగ్యం పూర్తిగా బాగుపడ్డాక నేను స్కూలుకి వెళ్ళటం ప్రారంభించాను. మళ్ళీ సుందరి గారింటికి కూడ వెళ్ళటం ప్రారంభించాను. ఇలా నాలుగుమాసాలు గడిచాయి. రావుగారి స్వభావం మొదటవున్నట్టుగాలేదు. నేను ఏదైనాకావాలని అడిగితే ఆయన తీసుకురావటంలేదు. అప్పుడప్పుడూ తిట్లుకూడా తిడుతున్నారు. ఒకి నాడు నన్ను పక్కనకూర్చోబెట్టుకుని – సిమ్లాలోనూ కలకత్తాలోనూ తను చేసిన పనులకి ప్రతిఫలంగా ఎంతడబ్బు రావలసివుందో చెప్పారు. గుర్రపుబగ్గీలూ; నౌకర్లూచాకర్లూ ఇలాంటి వైభవాలన్నీ నాకళ్ళముందు మెదిలాయి. నేనొక రోజు సాయంత్రంస్కూలు నుంచి యింటికి తిరిగివచ్చేసరికి – అమ్మా, నాన్నా యిద్దరూ హోరాహోరి పోట్లాడుకుంటున్నారు. నేను ఆ గది బయట అలాగే కూర్చున్నాను. లోపలినుంచి మాటలు వినిపిస్తున్నాయి.

"ఈ రోజులు ఎప్పుడూ యిట్లాగే వుండవని; ఇది మూణ్ణాళ్ళముచ్చటేననీ నాకు ముందే తెలుసు!"

"నీ మెడలోవున్న బంగారపు కంటెయివ్వు; ఫాజల్‌పూర్ నవాబు దగ్గర్నించి

నాకు అయిదువందలు రావాలి! నేను యివ్వాళే ఆయనకి టెలిగ్రాంయిచ్చాను: రేపో ఎల్లుండో టెలిగ్రాంద్వారా డబ్బువస్తుంది. నువ్వుకంటె యివ్వు. రేపు సిమ్లాలో దొరగారిని కలిశానంటే ఇక చూసుకో నాజాతకం! టెలిగ్రాం రాగానే నేను వెళ్ళిపోతాను. నా మీద నీకు అంతనమ్మకం లేకపోతే సరేలే. నేనిలాగే వెళ్ళిపోతాను. నేనింత కష్టపడి డబ్బుసంపాదించ వలసిన అవసరం నాకేమీ లేదు. నేను ప్రతినెలా యాభై, వందరూపాయలు పంపుతాను. నువ్వేంచేసు కుంటావో చేసుకో: కాని— నాకవసరమొచ్చి అడిగితే నువ్వు యివ్వటంలేదు. ఏదీ, ఆకంటె యివ్వు!"

"నాలుగురోజుల కిందట గాజులు తీసుకున్నావ్ ! ఇప్పుడు మళ్లీ కంటె అడుగుతున్నావ్ ! కాని యివ్వాళ నా ప్రాణం పోయినా సరే కంటెయివ్వను ! నేనెప్పుడోనే అనుకున్నాను; రెండుమూడు వందలు తెస్తారు; అవి అయి పోగానే నా నగల మీద పడతారూఅని; అబద్ధాలుచెప్పి గాజులు తీసుకున్నారు; పిల్లపెళ్ళి చేశేశాను; లేకపోతే మీరు ఆ డబ్బుకూడా అడిగేవారే! నాజాతకమూ నా పిల్లల జాతకమూ ఎటువంటిదో నాకు తెలుసు : ఆ దరిద్రుడివల్ల నాకు లభించే సుఖం ఎటువంటిదో కూడ నాకుతెలుసు...."

"ఛీ,ఛీ,ఛీ! అంతాతప్పే. మన అబ్బాయి చాలా అదృష్టవంతుడు! నేను వాడి జాతకం తయారుచేశాను. బ్రహ్మాండమైన జాతకం! వాడికి మంచి గ్రహ బలం వుంది! ఒకటి రెండు గ్రహాలు మాత్రం నీచస్థానంలో వున్నాయి; అవి కూడా సరిగ్గావుంటే చక్రవర్తి అవుతాడు! వాడు పితృధనంతోనే పైకొస్తాడు!.... ఊఁ కంటె యిస్తావుగా?"

"మళ్ళీమళ్ళీ ఆ ప్రశ్నే అడుగుతారెందుకు ? నేనిప్పటికి కనీసం యాభై సార్లయినా చెప్పాను; మళ్ళీ చెబుతున్నాను; బాగావినండి! నేను మీకు ఏమీ యివ్వను; యివ్వను; యివ్వను! ముందు నా గాజులు తీసుకురండి!"

"నేను వెళ్ళిపోయాక నీ గాజులు నీ కొస్తాయి; నే నా ఏర్పాటుచేసే వెళు తున్నాను. నా గ్రహదశ పదమూడురోజుల తర్వాత బాగుపడుతుంది. ఈలోగా కొద్దిరోజులు కాస్త గడ్డుగా వుంటాయి; నేను గ్రహశాంతి చేయిస్తు న్నాను...."

ఇంతలో నాచేతిలోవున్న పుస్తకాలు కింద పడ్డాయి. ఆ శబ్దంవిని – "ఎవరు?" – అన్నారు రావుగారు లోపల్నుంచి. "సరే! సరే ; ఇక ఆపండి ! పిల్లాడొచ్చివుంటాడు. వాడి ముందుకూడా నన్నవమానించకండి!" – అంది అమ్మ. "నేనంటే నీకెప్పుడూ గౌరవంలేదు; ఆ సంగతి నాకుతెలుసు!" – అంటూ రావుగారు బయటికొచ్చి నన్నుచూసి – "ఎప్పుడొచ్చావురా?"–అన్నారు. నాకేం సమాధానం చెప్పాలో తెలీదు. చెప్పకుండా తప్పించుకోవడానికి, కింద పడిన పుస్తకాలు తీసుకోవడం ప్రారంభించాను.

నేను అప్పటిదాకా విన్న మాటల గురించి ఆలోచిస్తున్నాను. మర్నాడు నాలుగున్నర వందల రూపాయల మనియార్డర్ రావలసివుంది – రావుగారి మాటల ప్రకారం; మనియార్డర్ రాలేదు. రాలేదని రావుగారు ఎవరినో తిట్టుకున్నారు. గ్రహదశ సమాప్తమయ్యేరోజుల్లో యిలాంటి కష్టాలే వస్తాయట ! మనియార్డర్ పక్కింటి వాళ్ళకొచ్చిందిగాని మాకు రాలేదు.

రావుగారి గ్రహదశ పూర్తయిందిగాని, కష్టాలు మాత్రం పూర్తి కాలేదు! అందువల్ల ఆయనగ్రహాల్ని కూడ తిట్టుకొన్నారు ! ఆ కోపం నామీదకి కూడ కొద్దిగా మళ్ళింది. ఇప్పటిదాకా నేనాయన నయనతారని ; కాని యిప్పుడు ప్రేమ తగ్గింది. అమ్మపట్లకూడ ఆయన ధోరణి మారింది. ఇద్దరూ నాఎదటే పోట్లాడుకోవటం ప్రారంభించారు. అమ్మకూడా తక్కువేమీ తినలేదు. అందుచేత మేఘగర్జనలాంటి తన స్వరసహాయంతో తుఫానులు సృష్టించ సాగింది ! ఆ తుఫానుల వల్లనాకు దుర్దశ ఏర్పడింది. రావుగారు అమ్మని తిడుతూ వుంటారుగాని, కొట్టడానికి మాత్రం ఎన్నడూ చెయ్యెత్తలేదు. అమ్మ కర్కశ వాగ్బాణాల ముందు ఆయన నిరుత్తరులైపోయేవారు! ఆయన దృష్టిఅంతా రెండు మూడు వస్తువులమీదే వుంది. ఒక రోజాయన అమ్మతో – "నేనివ్వాళ ఎట్టి పరిస్థితుల్లోనూ వెళ్ళిపోవాలి; ఇంటి అద్దెకి డబ్బుకావాలి. అందుకే నీ కంటె యివ్వు !....ఏదో ఒక రోజున నేను సన్యాసినై పోతాను ! నా జీవితమంతా సర్వనాశనమైపోతుంది ; మళ్ళీ ఎప్పుడూ నీకు నా మొహమైనా చూపించను !"— అన్నారు. మొదట్లో సౌమ్యంగానే అన్నారుగాని, చివర్లో మాత్రం ప్రళయకాల రుద్రావతారం దాల్చారు !

## రావుగారు వెళ్లిపోయారు

ఆ రోజు ఆయన చెయ్యెత్తబోయారు. కాని — "నా వొంటిమీద చెయ్యి వేశారంటే జాగ్రత్త! పిల్లలముందు నన్ను కొట్టారో, నేను మరుక్షణమే ఆత్మ హత్యచేసుకుంటాను!" — అని గర్జించింది అమ్మ. అమ్మకోపం నేను చాలా సార్లు చూశాను. కాని ఆవేళ అమ్మ నిజంగానే కోపంతో మండిపోతోంది. కొంత సేపటికి ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అమ్మ ఆరకంగా ఏడుస్తూండగా నేనెప్పుడూ చూళ్ళేదు. ఆ వేళ అమ్మ ఏడుపు కూడా అదోవిధంగానేవుంది. నడుం మీద చెయ్యి వేసుకునిలబడి — "ఇక ఆపండి మీ వాగుడు! నేనిప్పటిదాకా మీ పనులన్నీ సహించాను. కాని ఇక లేశమాత్రమైనా సహించను! మీరేం చేసు కుంటారో చేసుకోండి! ఎక్కడికి పోతారో పొండి! నేను మాత్రం మరొక్క క్షణమైనా యిక్కడ వుండను. నేను మామూలు ఆడదాన్నికాను! నేను పట్టు పట్టానంటే విడవను. నేను మా పుట్టింటికి వెళ్ళిపోతాను. అవసరమైతే అడుక్కు తింటాను. కాని ఇకనుంచి మీతో కలిసి మాత్రం వుండను! ఇప్పటిదాకా అను భవించింది చాలు:" — అంది. కాస్సేపు ఆగిపోయింది. ఆమె కంఠం రుద్ధమై పోయింది. ఆమె ధైర్యం తగ్గిపోయింది.

కాని మళ్ళీ కాస్సేపటికే, దృఢంగా —"పెళ్ళయింది మొదలు, యివ్వాల్టిదాకా ఒక్కరోజుకూడా సుఖమంటే ఏమిటో ఎరగను! అత్త నన్ను నానాబాధలూ పెట్టింది. అవన్నీసహించాను. అత్తపోయిన తర్వాత రెండుమూడేళ్ళు కాస్త బాగాగడిచాయి. అంతే. ఆ తర్వాత మీ ఆగడాలూ అఘాయిత్యాలూ ప్రారంభ మైనాయి; ఇంట్లోవున్న నగలూ డబ్బూ అన్నీపోయాయి; ఉద్యోగం వదిలేశారు; చివరికి నన్నే వదిలేసి వెళ్ళిపోయారు! మీరెక్కిన కొమ్మ మీరే నరుక్కున్నారు! అదృష్టాన్ని తిడితే ఏమొస్తుంది? మీ అదృష్టాన్ని మీరే చేతులారా నాశనం చేసు కుంటూ వుంటే, యింకా అదృష్టం ఏమి చేస్తుంది? నేను డబ్బుమనిషి నంటారు మీరు. కాని మీదిపొరపాటు. మీరు సంపాదించి మీచేతితో నాకు నెలకి పదో పరకో తెచ్చియివ్వండి. నేను ఏదోవిధంగా సంపారం గడుపుతాను; నాకూ హాయిగా సుఖంగా సంసారం చేసుకోవాలనే వుంటుంది. కాని నాకాఅదృష్టమెక్కడిది?

వెళ్ళండి! మీయిష్టమొచ్చిన చోటికివెళ్ళండి; సన్యాసుల్లో కలుస్తానన్నారుగా? వెళ్ళి కలవండి! ఆడదాన్నిగదా అని మీకు భయపడతాననుకున్నారేమో! అది కల్లో మాట....!''—అంటూ ఏకధాటిగా మాట్లాడింది. చివరి కొచ్చేసరికి ఆమె కంఠం గద్గదమైంది.

కళ్ళవెంట నీళ్ళుకారసాగాయి. కన్నీళ్ళుకారిన కొద్దీ ఆమె ఆవేదన తగ్గసాగింది. మనసులోనుండే ఆవేదనని చల్లార్చడానికే అన్నట్టుగా అదేపనిగా ఆమె కళ్ళవెంటనీళ్ళు కారసాగాయి. అమ్మమాటలు; ఆమె భయంకరరూపం; ఆమె ఆవేదన, అన్నీచూసి రావుగారు చకితులైపోయారు. ఆయన ఒక్క మాటకూడా మాట్లాడకుండాలేచి స్థాణువులా నిలబడ్డారు. కొంతసేపున్నతర్వాత, చొక్కా తొడుక్కుని, పాగా తగిలించుకుని బయటికెళ్ళి పోయారు. అమ్మ యింట్లో ఒకమూల కూర్చుని ఏడవటం ప్రారంభించింది. బాగాఏడ్చింది. అమ్మ అంతగా ఏడవటం నేనిప్పటిదాకా చూళ్ళేదు. ఆమె దీనావస్థచూసి, నాకామెపట్ల కాస్త సానుభూతి కలిగింది. నేనప్పటికి మరీ చిన్నవాణ్ణికాను. కాస్త జ్ఞానం వచ్చింది. అమ్మతో కాస్సేపు ప్రేమగా మాట్లాడదామనే వుద్దేశ్యంతో, మెల్లిగా భయపడుతూవెళ్ళి, ఆమెకెదురుగా నిలబడ్డాను. అమ్మగమనించలేదు. ఇంకాస్త ముందుకు జరిగాను. అమ్మభుజమ్మీద చెయ్యివేశాను. అమ్మ తలెత్తిచూసి, వెంటనే నా చెయ్యివిదిలించి కొట్టి—''ఛీ! సిగ్గులేని వెధవా! పో యిక్కడినుంచి! నా దగ్గరకి రావద్దు పో! నువ్వూఅలాంటి వాడివే; నువ్వూ ఆతండ్రి కొడుకువే! మీ యిద్దరివల్లా ఎవరికీ సుఖపడే రాతలేదు! నువ్వు పెద్దవాడివయ్యాక నువ్వూ నీ పెళ్ళాన్ని యిలాగే ఏడిపిస్తావు! దాన్ని యిలాగే జీవితాంతం ఏడిపిస్తావ్! పోరా వెధవా! ఆయన వెళ్ళిపోయారు; ఆయనతోపాటు నువ్వూ పో!..........నా చావేదో నేను చస్తాను!''—అంటూ కసిరికొట్టింది. నేను బిక్కచచ్చిపోయాను. ఆమె దగ్గరకూర్చుని, కాస్సేపు ప్రేమగా మాట్లాడి ఆమెకికాస్త మనశ్శాంతి కలిగిద్దామని దగ్గరకెళ్లాను. కాని నా ఆశలన్నీ నీరుకారి పోయాయి. అమ్మకి నేనంటే ఎంతమాత్రం యిష్టంలేదనీ, పైగా విపరీతమైన అసహ్యమనీ నిర్ధారణైపోయింది. అక్కడినుంచి అవతలికెళ్లి పోయాను. రావుగారు రారేమో అనుకున్నాను. కాని కాస్సేపటి తర్వాత ఆయన మళ్ళీ వచ్చారు.

రెండు మూడు రోజులు ఏమీగొడవలేకుండానే గడిచిపోయాయి. ఎక్కడికో వెళ్ళిపోతానన్నరావుగారూ వెళ్ళలేదు; పుట్టింటి కెళతానన్న అమ్మా వెళ్ళలేదు.

అక్కకూడా నాలుగు రోజులనుంచీరాలేదు. ఈ గొడవంతా అక్కతో ఎప్పుడు చెబుదామాఅని నాకు మహా తొందరగావుంది.

మళ్ళీ ఒకనాటిరాత్రి మామూలు గొడవ ప్రారంభమైంది. రావుగారు వెళ్ళిపోతాను వెళ్ళిపోతానని చాలాసార్లు అన్నారు. అంచేత మే మాయన మాటలు పట్టించుకోవడం మానేశాం. కాని ఆవేళ ఆయన చాలా ఉద్రేకంగా వున్నారు. నోటికొచ్చినట్లల్లా మాట్లాడారు. ''నువ్వు ఎవరి అండచూసుకుని యిలా మిడిసిపడుతున్నావో నాకుతెలుసు. నీ అన్న పంచన చేరి బ్రతుకుతున్నావ్; వాడికి డబ్బుంది. ఇంకా నీ మొగుడు బికారై పోతే మాత్రం నీకేం పట్టింది!'' – అన్నారు అమ్మని. అమ్మకూడా అప్పటిదాకా వూరుకుందిగాని, ఇక వూరుకోలేక పోయింది. ''ఇక చాలు! ఆపండి! ఇంకా ఒక్కమాట మాట్లాడినా నేను సహించను. ఇదుగో, ఈ కంటె తీసుకోండి; ఇంకా యింట్లో ఏమైనావుంటే అవన్నీ తీసుకుపోండి! నేను వెళ్ళిపోతున్నాను; ఎవరి పంచనో బ్రతుకుతున్నావన్నారుగా? అక్కడికే పోతున్నాను!'' – అంటూ, సరాసరి యింట్లోంచి బయటికెళ్ళిపోయింది అమ్మ.

ఇంకెవరి జీవితంలోనూ నా జీవితంలో వచ్చినన్ని ఒడిదుడుకులూ పరివర్తనలూ వచ్చి వుండవేమోనని నా ఉద్దేశ్యం. చిన్నప్పట్నించీ కూడ, నా పరిస్థితులు, నా పెంపకం; నా అనుభవాలూ అన్నీ మిగతా అందరి జీవితాలకీ భిన్నమే. కొన్నిసార్లు – చాలాసార్లు – నా ఆలోచనలు నా వయసుకి మించి వుంటాయ్! నాజ్ఞాపకాలు కూడా అంతే !

పోట్లాట ముగిశాక అమ్మ యింట్లోంచి వెళ్ళిపోయింది. కొంతసేపు రావుగారు ఏమీ చలించలేదు. కాని ఆ వెంటనే – ''భావూ, భావూ! నువ్వువెంటనే మీ అమ్మమ్మగారింటికెళ్ళి, మీ అమ్మ అక్కడికెళ్ళిందేమో చూడు! ఎక్కడైనా పడి ప్రాణాలు తీసుకుందేమోచూడు!'' – అన్నారు. నేను వెంటనే లేచి పరుగెత్తాను. అమ్మమ్మగారింటికెళ్ళే దారిలో మూడు నాలుగు నూతులు చూపి

వెళదామనిపించింది. కాని చూళ్లేదు. సరాసరి అమ్మమ్మగారింటికే వెళ్ళాను. నేను వెళ్ళేసరికి - అమ్మ అక్కడ కూర్చుని ఏడుస్తోంది. సాయంత్రం అమ్మమ్మ — "ఇంటికెళ్ళి చూడు! రావుగారు ఏంచేస్తున్నారో!" అని నన్ను పంపింది. నేను యింటికొచ్చి చూస్తే రావుగారు లేరు. తలుపు తాళం వేసి వుంది. నాకు చిన్నప్పుడు బొంబాయిలో జరిగిన సంఘటన గుర్తొచ్చింది. అమ్మమ్మ దగ్గరకెళ్ళి తలుపు తాళం వేసి వుందని చెప్పాను. అమ్మ - యిలా జరుగుతుందని ముందే వూహించింది. నేను కుతూహలం కొద్దీ మర్నాటి పొద్దున కూడా వెళ్ళి చూశాను. తాళం యింకా అలాగేవుంది. నా పుస్తకాలన్నీ లోపల వున్నాయి. అందువల్ల నేను స్కూలుకి వెళ్ళకుండా యింట్లోనే వుండిపోవలసి వచ్చింది.

నాకు ఇంట్లో వుంటే ఏంసుఖం లేదు. అందుచేత మాట్లాడకుండా సుందరి గారింటికెళ్ళి పోయాను.

ఆ వేళ శివరామ్‌పంత్‌గారి వొంట్లో బాగుండక యింట్లోనే వున్నారు. నేనా సమయాన వెళ్ళటం చూసి ఆయన కాశ్చర్యం కలిగింది. "స్కూలు కెళ్ళ లేదా?" - అని అడిగారు. ఆయనాప్రశ్న అడగ్గానే, నేను జరిగిన కథంతా చెప్పేశాను. ఆయనంతా శ్రద్ధగావిని, ఒక్కసారి బరువుగా నిట్టూర్చారు. నా వీపు ఆప్యాయంగా నిమురుతూ—"భావూ! నేను చాలా రోజుల్నించి నీకో మాట చెప్పాలనుకుంటున్నాను. నువ్వింకా చిన్నవాడివి; నేను చెప్పేదేమిటో నీకు అర్థంకాదూ అని యిన్నాళ్ళూ వూరుకున్నాను. కాని ఈ కథంతా విన్నాక— నువ్వుకూడా ఆలోచించగలవు; నీ భవిష్యత్తుని అర్థం చేసుకోగలవు అనిపిస్తోంది నాకు. నేను చెప్పేదంతా తెలుసుకోగలవనే నేను ఆశిస్తున్నాను.... చెప్పమంటావా?"—అంటూ ప్రారంభించారు.

# శివరామ్ పంత్ ఉపదేశం

"భావూ ! నీ పరిస్థితి గురించి నువ్వు సరిగా ఆలోచిస్తున్నట్టు కనబడదు. కాని ఆలోచిస్తే నీకే తెలుస్తుంది. నువ్వు నీ చదువెంత త్వరగా పూర్తిచేస్తే, అంత త్వరగా నీ కాళ్ళమీద నువ్వు నిలబడ గలుగుతావ్ ! నీ తండ్రి పరిస్థితి ఏమిటి; నీ తల్లి స్వభావం ఏమిటి? ఇవన్నీగనక నువ్వు గట్టిగా ఆలోచించక పోతే నీ స్థితి ఎప్పటికీ బాగుపడదు. నీ కృషితో, నీ సాహసంతో నువ్వు పైకి రావాలి; బాగాచదవాలి; స్కాలర్‌షిప్పులు ఎన్నోఉన్నాయి; బాగ కష్టపడి చదివి అవి సంపాదిస్తే, నువ్వు ఎవరిమీదా ఆధారపడి బతకాల్సిన అవసరంవుండదు. నువ్వు బాగా చదవటం లేదనికాదు నా ఉద్దేశ్యం. కాని నువ్వు జీవితాన్ని ఒక మంచి మార్గాన నడపదల్చుకుంటే,—నువ్వు నీ చదువులో ఎప్పుడూ ప్రథమ శ్రేణిలో, ప్రప్రథముడివిగా వుండాలి. నీది తెలివైన బుర్ర. కాని నువ్వు గర్వంతో వుంటే మాత్రం నీ భవిష్యత్తంతా నాశనమై పోతుంది. నీ తెలివిని నువ్వు సద్వినియోగం చేసుకోలేకపోతే తెలివి వున్నా లేక పోయినా ఒకటే !

"నువ్వంటే నాకు అమితమైన ప్రేమవుందిగనక నీ కింతగా చెబుతున్నాను. నువ్వు తెలివైన వాడివి.

"నీ పరిస్థితులూ, నీ తల్లి ప్రవర్తనా చూసినప్పుడు నాకు చాలా బాధ కలుగుతుంది. మీ అమ్మలో ఒక ప్రత్యేకతవుంది. జనం ఆమెని ఎన్నివిధాల దూషించినా, నేను మాత్రం ఆమెని ఏమీ అనను. ఆమె అంటే నాకు గౌరవముంది. ఎందుకంటే ఆవిడ చాలా పట్టుదలగల మనిషి. ఆవిడ గుణాలు నీకు చాలా ఉపయోగపడతాయ్ ! అయితే ఒకటి. ఆగుణాలు నీకు ఉపయోగపడవలసినచోట, నీకు అద్దుతగిలితే మాత్రం ఆ గుణాలవల్ల నీకు లాభమేమీ ఉండదు. ఆమెలోవున్న దృఢనిశ్చయం, స్వాభిమానం నువ్వులలవర్చుకున్నావంటే వాటిని సకాలంలో వినియోగించావంటే, నువ్వు ఏదో ఒకనాడు తప్పకుండా గొప్పవాడివవుతావ్ !

"నేను మరోసంగతి కూడ నీకు చెప్పాలనుకుంటున్నాను. మీ అమ్మ పట్టుపట్టిందంటే వదలదు. నీ పెళ్ళి చెయ్యాలీ అన్న ఆలోచన గనక మీ

అమ్మకి వచ్చిందంటే, ఆ పని చేసి తీరుతుంది. అందువల్ల నేను నీకు చెప్పే దేమిటంటే, మిగతా ఏ విషయంలోనైనా నువ్వు మీ అమ్మ ఆజ్ఞపాటించు. ఫర్వా లేదు. కాని నువ్వు చదువు పూర్తిచేసి, ఆపైన నాలుగైదేళ్ళు వుద్యోగంచేసి, నీవంటూ నాలుగురాళ్ళు సంపాదించేదాకా నువ్వు పెళ్లిమాట ఎత్తకూడదు. పెళ్లి గురించి ఆలోచించకూడదు.

"ఇవ్వాళటి నీ పరిస్థితుల్నిబట్టి, ఇప్పుడే నువ్వు పెళ్ళి గురించి ఆలోచించటం నీకెంత అనర్థదాయకమో నువ్వే వూహించుకో! నువ్విప్పుడు మీ మామయ్య దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి బ్రతుకుతున్నావు. ఆసంగతి మర్చిపోకు.... నేను నీకు మరోసంగతి కూడా చెప్పాలనుకుంటున్నాను. ఏమిటంటే...."

శివరామ్‌పంత్‌గారు ఆసంగతేమిటో పూర్తిగా చెప్పకుండానే ఆగిపోవలసి వచ్చింది. ఆయన్ని కలుసుకోవడానికెవరో వచ్చారు. నేనక్కడి నుంచి వెళ్ళిపోవలసి వచ్చింది.

## ఆశ్చర్యం ! అద్భుతం !

నాలుగు సంవత్సరాలు గడిచాయి. నేను యువకుడినయ్యాను. చిన్నప్పుడు బక్కగా వుండేవాడిని. కాని యిప్పుడు కాస్త వొడ్డూపొడుగూ ఎదిగాను. నేను అందంగా వుంటానని కొందరంటారు. కాని నా ఆర్థికస్థితిలో చెప్పుకో దగ్గ మార్పేమీ రాలేదు. మా తాత చచ్చిపోయాడు. అందువల్ల మాఅమ్మమ్మ మామయ్య దగ్గర కెళ్ళిపోయి, అక్కడే వుంటోంది. అమ్మనికూడ రమ్మంది. కాని, నా చదువు కారణంగా అమ్మ రానంది. క్లాసులో ఎప్పుడూ నేనుమొదటి స్థానంలోనో, రెండో స్థానంలోనో వుంటున్నాను. అందువల్ల ఎప్పుడూ ఏవో స్కాలర్‌షిప్పులూ బహుమతులూ లభిస్తూనే వున్నాయి. నా మార్కులూ; పరీక్షఫలితాలూ చూసి, మామయ్యకూడా నాకు ఆర్థిక సహాయం చెయ్యడానికి బాధ పడటం లేదు. స్కూల్లో నాకు బుద్ధిమంతుడన్న పేరుకూడా వుంది.

అంచేత ఆడపిల్లలున్న వాళ్ళంతా నా కోసం ఎగబడటం ప్రారంభించారు. కొందరు అమ్మ దగ్గర కొస్తున్నారు; కొందరు మామయ్యకి ఉత్తరాలురాస్తున్నారు. ఇలావుండగా – ఒకసారి మామయ్య స్నేహితుడి కూతురి సంబంధం వచ్చింది. అమ్మమ్మకి కూడా ఆ సంబంధం యిష్టమే. ఆ సంబంధం గురించి మామయ్య అమ్మకి పెద్ద ఉత్తరంరాశాడు. అమ్మ ఏమీమాట్లాడకుండా వూరుకుంది. మామయ్య మళ్ళీ మూడు నాలుగు ఉత్తరాలు రాశాడు. "వేసవి శెలవుల్లో అక్కడి కొస్తాం; అప్పుడు మాట్లాడదాం!" – అని, అమ్మ నాచేత మామయ్యకి ఉత్తరం రాయించింది.

చూస్తూవుండగానే వేసవి శెలవలు రానేవచ్చాయి. అమ్మా, నేనూ మామయ్య గారి వూరు వెళ్ళాం. ఆ విషయం ప్రస్తావనకిరాగానే, నా నిర్ణయం నేను చెప్పొచ్చునని, ఆఅవకాశం కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాన్నేను. అమ్మమ్మ, మామయ్య అడిగితే తన ఉద్దేశ్యాలు చెబుదామని అమ్మ వూరుకుంది.

అమ్మ ఆ ప్రస్తావనతెస్తే, అప్పుడే అమ్మను వొప్పించవచ్చునని అమ్మమ్మా, మామయ్యా వూరుకున్నారు. చివరికి ఎవరూ మాట్లాడలేదు. అలా వారం రోజులు గడిచింది. చివరికొకనాడు అమ్మమ్మ ఆ సంబంధం సంగతి ప్రస్తావించింది. నేనూ అక్కడే వున్నాను. అమ్మ ఏమీమాట్లాడలేదు. ఒకసారి నావంక చూసింది. అమ్మమ్మ మళ్ళీఅడిగింది. "వాడంతటవాడు సంపాదించుకునే దాకా వాడి పెళ్ళి సంగతి నాముందు ఎత్తవద్దు; ఈ అయ్యగారు ముందు ముందు ఎలా తయారవుతాడో ఎవరికి తెలుసు! నాకు పట్టిన గతే ఆరాబోయే దానికీ పట్టటానికి వీల్లేదు!" – అంది అమ్మ దృఢంగా.

అమ్మ అలాంటి జవాబివ్వటం విని నా ఆశ్చర్యానికి అంతు లేక పోయింది. నాలుగేళ్ళక్రితం శివరామ్‌పంత్ గారు చెప్పిన మాటలు గుర్తొచ్చాయి–"మీ అమ్మ పట్టుదల నీకు అప్పుడప్పుడూ వుపయోగపడుతుంది!"

అమ్మ పట్టుదల చూసి, యింకేమీ మాట్టాడ్డానికి మరెవరికీ ధైర్యం లేక పోయింది. అయినా అమ్మమ్మవూరుకోలేదు. నన్నడిగింది. "అమ్మ చెప్పింది సరైనది. అందుకు వ్యతిరేకంగా నేనేమీచెయ్యలేను;" – అని సమాధానం చెప్పాను.

# అక్క సంగతి ఏమైంది ?

అక్క పెళ్ళయింది. కాని ఎక్కువ కాలం భర్తతో కలసిమెలిసి వుండలేక పోయింది. ఒక సంవత్సరంపాటు అన్నిబాధలూ భరించింది. రెండు, రెండున్నర సంవత్సరాల తర్వాత అక్కస్వభావం పూర్తిగా మారిపోయింది. ఆమె భర్త ఆమెని చాలా బాధలుపెట్టాడు. కాని చివరకి అక్క తెగించింది. భర్త ఆమెని కొడుతూ వుండేవాడు. అక్కని ఎప్పుడూ సుఖపెట్టలేదాయన. ఎప్పుడైనా పుట్టింటికి పంపితే నగలన్నీ వొలుచుకునిపంపేవాడు. లేదా పుట్టింటికి నగలతో వస్తే – ఆ తరువాత ఎవరినైనా పంపి నగలు తెప్పించుకునేవాడు. ఇప్పుడైతే అసలు పుట్టింటికి రావటమే మానేసిందిఅక్క. చాలా రోజుల తర్వాత ఒకనాడు వచ్చింది. వస్తే రాత్రి పదిగంటలకి నౌఖర్నిపంపి – వెంటనే యింటికి రమ్మని కబురు చేశాడామెభర్త. అక్కకి కోపమొచ్చి – "నేనీరాత్రి ఏమైనాసరే రాను ! రేపొద్దున నేనే వస్తాలే," పొమ్మని నౌఖర్ని పంపివేసింది. కొంతసేపటికి నౌఖరు మళ్ళీవచ్చాడు. "ఈ రాత్రిగనక యింటికిరాకపోతే నేను మళ్ళీపెళ్ళి చేసుకుంటాను !" – అని కబురు చేశాడు మా 'బావ' ! అమ్మ యిక వూరుకోలేక పోయింది. "ఏమైనా సరే, నేను దాన్నిపంపను !" అని నౌఖర్ని తిరగగొట్టింది.

అక్కకి అమ్మమాటలు నచ్చలేదు. అమ్మకి నచ్చజెప్పడానికి ప్రయత్నించి, ఆ రాత్రేయింటికి వెళ్ళిపోయింది.

కొన్నిరోజుల తర్వాత మరో విచిత్రమైన సంఘటన జరిగింది. ఏదో అవసరమైన పనిమీద – ఉదయం ఆరూ ఆరున్నరకి అక్కగారింటికి వెళ్ళిరమ్మని పంపింది అమ్మ. నేను అక్కగారింటి గుమ్మంముందు కెళ్లేసరికి – లోపల్నుంచి ఒక స్త్రీ బయటికొస్తోంది. చూడ్డానికంత గౌరవప్రదమైన వ్యక్తిలా కనిపించలేదు. నన్ను గుచ్చిగుచ్చి చూస్తోంది. ఆ స్త్రీ ఎవరా అన్న విషయం నే నప్పుడంతగా ఆలోచించలేదు. నేను లోపలికి అక్క దగ్గరకెళ్లాను. అక్కతో యింటికిరమ్మనిచెప్పి, ఆమె భర్తకి కూడా చెబుదామని–ఆయనగదిలో కెళ్ళబోయాను. "వద్దు....ఇప్పుడు వెళ్లొద్దు!" - అని, అక్క నన్ను

ఆపేసింది. నేను అక్క మొహంవంక పరీక్షగా చూశాను. ఆ తర్వాత – "అక్కా! ఇప్పుడే ఎవరో ఒకమ్మాయి అలంకరించుకుని – ఈ యింట్లోంచి బయటి కెళ్ళింది; ఎవరాఅమ్మాయి"? – అని అడిగాను. నే నామాట అడగ్గానే– అక్క ఏడవటం ప్రారంభించింది. అక్క వున్నట్టుండి ఎందుకలా ఏడుస్తోందో నాకర్థం కాలేదు. కాస్సేపటికి అక్క శాంతించి – కళ్ళు తుడుచుకుంటూ – "భావూ; నువ్వు యింటికెళ్ళిపో! నే నివ్వాళ రాలేను....ఆయన్ని కూడ పిలవొద్దు!" – అని, గొంతు తగ్గించి –"నువ్విక్కడ ఏంచూసిందీ, ఎవర్ని చూసిందీ ఎవరికీ చెప్పొద్దు. నామీద వొట్టు!" – అంది. అక్క చిన్నచిన్న విషయాలకి వొట్టుపెట్టదు. అందుకే అక్క అలాఅనడం చూసి నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. అసలు సంగతేమిటని అక్కనే అడిగాను. కాని అక్క నాకు ఏ మాత్రం తెలియనివ్వలేదు. మాట్లాడకుండా బయటి కొచ్చేశాను. ఇందాక నాకు కనిపించిన స్త్రీ బయట నిలబడి మిద్దెవేపు సైగచేస్తోంది. నేను భయపడ్డాను. అక్క ఏదో వలలో చిక్కుకుందని వూహించుకున్నాను.

ఆదివారం, అమ్మ ఏదోపని మీద బయటికి వెళ్ళింది. ఇంట్లో నే నొక్కడినే వున్నాను. సాయంత్రం అయిదుగంటలైంది. వర్షాకాలం కావటంచేత బాగా మబ్బుపట్టివుంది. నేను కిటికీదగ్గర కూర్చుని పుస్తకం చదువుకుంటున్నాను. పుస్తకంలో పూర్తిగా లీనమైపోయాను. ఆ పుస్తకంలోని కథలో– నాయికానాయకులకి కష్టాలేవో వచ్చాయి; అంచేత నేను కళ్ళవెంట నీరు కారుస్తూ, పుస్తకం చదువుతున్నాను. ఇంతలో అత్యంతకోమలమైన, ఒక చల్లటి చెయ్యి నా భుజమ్మీదపడింది. నేను వులిక్కిపడి, వెనుదిరిగి చూశాను.

ఆ కరుణామూర్తి పూర్తిగా వానలో తడిసిపోయివుంది! అశ్రుపూరితమైన తన కళ్ళతో నావంక తదేకంగా చూస్తోంది. మెల్లిగా నోరువిప్పి – "నాకు జీవితమంటే విరక్తి కలిగిపోయింది. ఏదైనా ఒకనాడు నాకేమైనా జరిగితే ఏడవకు! నా ఒక్కగానొక్క అక్క – నా ముద్దుల అక్క – ఈ నరకం నుంచి విముక్తి పొంది వెళ్ళి పోయిందని సంతోషించు!" – అంది.

ఆ మాటలు విన్న నాగుండెలో విషనాగులు నర్తించినట్టయింది. "అక్కా! ఏం జరిగింది? నాకు పూర్తిగాచెప్పు...."– అని ప్రాధేయ పూర్వకంగా అడి

గాను. కాని అక్క చెప్పలేదు. ఏడవటం ప్రారంభించింది. మళ్ళీ తనంతట తానే సర్దుకుని – "భావూ ! నేను చెప్పిన మాటలు గుర్తుంచుకో! నేను వెళు తున్నాను; అమ్మ యిప్పుడు యింట్లో లేకపోవటం మంచిదే అయింది....!" – అంటూ వెళ్ళిపోయింది. నా మాట వినిపించుకోకుండా వెళ్ళిపోయింది. ఎంత బ్రతిమాలినా లాభం లేక పోయింది.

అక్క యిప్పుడు పూర్తిగా నిర్భయంగా ప్రవర్తించటం ప్రారంభించింది. తన యిష్టమొచ్చినప్పుడల్లా యింట్లోంచి బయటికి వచ్చేస్తుంది. తన కిష్టమైన స్నేహితురాళ్ళ యింటికి వెళుతుంది; అప్పుడప్పుడూ మాయింటికొస్తుంది.

ఏ సమయాన్నయినా సరే వచ్చేస్తుంది. ఎవరైనా అడిగితే – "నేను నా యిష్టమొచ్చినట్టు చేస్తాను ! నా యిష్టమొచ్చిన సమయంలోవస్తాను; వెళతాను. నేనిప్పుడెవరికీ దాసీదాన్నికాను. ఇన్నాళ్ళూ సహించివూరుకోవటమే నాతప్పయి పోయింది !" – అంటుంది. ఈ రకంగాచేస్తే నీభర్త సరిగా చూడడని ఎవరైనా అంటే – వెంటనే – "ఆయనెప్పుడూ నన్నుసరిగ్గా చూళ్ళేదు !" – అంటుంది. ఇలా అయితే – మీ ఆయన నిన్నుకొడతాడు, అని ఒకసారి ఎవరో అంటే – పళ్ళతో పెదవికొరుకుతూ, కోపంగా – "నేను అందుకోసమే ఎదురు చూస్తున్నాను!"– అంది. ఆ జవాబు అర్థంగాక మళ్ళీ అడిగితే – "సమయం వచ్చినపుడు అంతా తెలుస్తుంది !"–అంది, దృఢంగా, స్పష్టంగా.

## ఒక ముఖ్యమైన రోజు

ఒక రోజు సాయంత్రం శివరామ్‌పంత్ గారు నన్నువాళ్ళింటికి భోజనానికి పిలిచారు. ఆయన స్నేహితుడు కూడ ఒకాయన భోజనానికొస్తున్నాడు. స్కూలునుంచి నేను సరాసరి వాళ్ళింటికెళ్ళాను. నేను వెళ్ళేసరికి శివరామ్‌పంత్ గారు ఆయన స్నేహితుడితో మాట్లాడుతున్నారు. వాళ్ళ మాటల్లో నాకంత ఆసక్తి కలగలేదు. అంచేత అక్కడొక పుస్తకం వుంటే, అది తీసుకొని,

కిటికీ దగ్గరకెళ్ళి కూర్చుని ఆ పుస్తకం తిరగవెయ్య సాగాను. ఆ పుస్తకంపేరు 'లూథర్ సంక్షిప్తచరిత్ర'. సుందరిలోపల వాళ్ళమ్మకి సాయంచేస్తున్నట్టుంది. బయటిరాలేదు. సుందరి కాస్త పెద్దదయింది. అందువల్ల మేమిద్దరమూ వెనకటంత చనువుగా మాట్లాడుకోవటం లేదు.

పుస్తకం చదువుతున్నాను. లూథర్ మిత్రులు అతన్ని పోప్ దగ్గరకి వెళ్ళొద్దని చెప్పే సంఘటన చదువుతున్నాను. ఆసక్తిదాయకంగావుంది. అందులో నిమగ్నుడినైపోయాను. ఇంతలో శివరామ్‌పంత్‌గారి మిత్రుడు బిగ్గరగా అంటున్న మాటలు నాధ్యానానికి భంగం కలిగించాయి. "మీఅమ్మాయి పెళ్ళెప్పుడు చేస్తావ్?" అని అడుగుతున్నాడాయన.

''చేద్దాం; ఇప్పుడేతొందరేముంది ?''-అన్నారు, శివరామ్‌పంత్‌గారు.

ఆయన స్నేహితుడు కాస్తవుద్రేకంగా — "ఇదుగో, ఈ రకంగా తెలివితక్కువ మాటలు మాట్లాడకు ! అమ్మాయి కప్పుడే పధ్నాలుగేళ్ళొచ్చాయి; ఇంకా చేద్దాంలే, చూద్దాంలే అంటావేమిటి ?''- అన్నాడు.

శివరామ్‌పంత్‌గారు చిరునవ్వు నవ్వారు.

ఆయన స్నేహితుడు - ''నవ్వుతావెందుకు ? నేనడిగిన దానికి సరిగ్గా సమాధానంచెప్పు. నేను మొన్న ఒకళ్ళింటికి వెళ్ళాను. అక్కడ మీ అమ్మాయి ప్రస్తావనవచ్చింది. ఇంకా పెళ్ళికాలేదంటే అంతా ముక్కుమీద వేలేసుకున్నారు, తెలుసా ?'' - అన్నాడు. శివరామ్‌పంత్‌గారు మెల్లిగా - "చూడుబాపూ ! మనం దగ్గరదగ్గర ముప్ఫయ్ సంవత్సరాలనుంచి స్నేహితులం; నేను నీదగ్గర ఎన్నడూ ఏ విషయమూ దాయలేదు. ఇదిమాత్రం దాచాల్సిన అవసరమేముంది ? కనీసం యింకా అయిదేళ్ళదాకా అమ్మాయి పెళ్ళిచెయ్యదలచుకోలేదు !''-అన్నారు.

ఆ మాటవిని ఆయన స్నేహితుడు తెల్లబోయాడు. ఆశ్చర్యంతో నోరువెళ్ళబెట్టి, కళ్ళుపెద్దవి చేసుకుని చూడసాగాడు. శివరామ్‌పంత్‌గారు అలాంటి సమాధానంచెబుతారని బహుశా ఆయన వూహించివుండడు. కాస్సేపటికి తేరుకుని - "చూడు శివరామ్‌పంత్ ! నీకేం పిచ్చా, వెర్రా ? ఇలాంటి మాటలు మాట్లాడానికి కావలసిన అర్హతలుగాని, ఆర్థిక బలంగాని మనకిలేవు ! ఈడొచ్చిన పిల్లని యింట్లోపెట్టుకుని కూర్చోవడం మంచిదికాదు. అది పెద్దవాళ్ళకే చెలు

తుంది. డబ్బున్నవాళ్ళుగాని, పలుకుబడివున్నవాళ్ళుగాని ఏంచేసినా ఫర్వాలేదు. నీకారెండూలేవు. ఏదైనా జరగరానిది జరిగితే ఎలావుంటుందో ఆలోచించుకో"— అన్నాడు.

శివరామ్‌పంత్‌గారు మెల్లిగా గంభీరంగా అన్నారు — "బాపూ: నేను తీసుకున్న నిర్ణయం బాగా ఆలోచించినమీదటే తీసుకున్నాను. ఇలాంటి నిర్ణయంలో డబ్బుకిగాని, పలుకుబడికిగాని ప్రమేయంలేదు. నే నీ విషయంలో అమ్మాయి అంగీకారం కూడ తీసుకున్నాను. ప్రపంచం దృష్టిలో నీకు పెళ్ళి డొచ్చింది; నా ఉద్దేశ్యం యిలావుంది, అని అమ్మాయికి తెలియజేశాను. అమ్మాయి కూడ నా అభిప్రాయంతో పూర్తిగా ఏకీభవించింది."

"ఇదంతా బాగానేవుంది; కాని, పిల్ల వయసులో పొరపాటున కాలు జారితే, దానికెవరు బాధ్యులు?" — అని ప్రశ్నించాడు బాపూ.

శివరామ్‌పంత్‌గారికి నవ్వొచ్చింది. "నే నిప్పుడు పెళ్ళి చేసేస్తాననుకో: మర్నాడు మొగుడు పోతాడు; ఆ తర్వాత నీతి తప్పితే అప్పుడెవరు బాధ్యులు? నీ ప్రశ్నకి అర్థంలేదు. మంచిమార్గాన నడిచే శిక్షణ నేను దానికిచ్చాను. నా దగ్గర వున్నంతకాలం అది సంస్కారం విడిచి నడవదని నా నమ్మకం. నాపేరు నిలబెడుతుందని దానిమీద నాకు పూర్తి నమ్మకముంది. బాల వైధవ్యంలో తన సద్గుణాలను కాపాడుకో గలిగిన పిల్ల పెళ్ళి కాకుండా యౌవనంలో వున్నా కాపాడుకోగలదు" — అన్నారాయన.

ఆయన, ఆయన మిత్రుడూ కూడ నిశ్శబ్దం వహించారు.

కొంతసేపు ఎవరూ ఏమీ మాట్లాడలేదు. ఇంతలో లోపల్నుంచి భోజనాలకి లెమ్మని పిలుపు వచ్చింది. అంతా లేచి లోపలికి వెళ్ళాం. భోజనాలు కాగానే నేను యింటి కొచ్చేశాను. కాని ఆరోజు శివరామ్‌పంత్‌గారు చెప్పిన మాటల వల్ల నాకు చాలా ఆనందం కలిగింది. ఆరోజునుంచీ నా మనసులో ఒక క్రొత్త ఆశ చిగురులు వెయ్యసాగింది.

## సుందరి జీవితంలో కొత్తమలుపు

ఆయన వుద్దేశ్యాలూ భావాలూ, శివరామ్‌పంత్‌గారి మీద నాకు ఆ రోజునుంచీ మరింత గౌరవాన్ని కలిగించాయి.

మరికొన్ని సంవత్సరాలు పెళ్ళి చెయ్యక పోవటమే కాకుండా సుందరికి కొత్త చదువు చెప్పించాలని కూడ నిర్ణయించారు. ఆ చదువుకోసం సుందరిని ఏదైనా ఒక మంచి స్కూలుకి పంపాలని చూస్తున్నారు. ఇన్నాళ్ళూ సుందరి యింట్లోనే చదువుకుంటోంది.

నే నా వేళ వాళ్ళింటికెళ్ళేసరికి శివరామ్‌పంత్‌గారు సుందరికేదో చెబుతున్నారు. నే నక్కడ వుండటం మర్యాదగా వుండదేమోనని యివతలికి రాబోయాను. ఇంతలో నన్నుపిలిచి – "నేను సుందరికి చెప్పేవిషయం నువ్వు కూడా వినొచ్చు; ఫర్వాలేదు'' – అన్నారు, శివరామ్ పంత్‌గారు.

సుందరి తండ్రి మాటలు శ్రద్ధగా వింటోంది. నేను కూడా ఏకాగ్రతతో వినసాగాను. "సుందరీ! నే నింకో సంగతి నీకు చెప్పాలనుకుంటున్నాను. నువ్వు వెళ్ళబోయే స్కూలు పరమతం వారిది. ఆ స్కూలుకి నిన్ను పంపటం నాకిష్టం లేదు. కాని మరోమంచి స్కూలులేని కారణంగా అక్కడికే పంపాల్సివస్తోంది. మన ఆశయాలు నెరవేరాలంటే ఉన్నత విద్య అవసరం. ఆ స్కూల్లోక్రైస్తవ మతానికి ప్రాధాన్యత యిస్తారు. వీలు దొరికినప్పుడల్లా ఆ మతాన్ని కీర్తిస్తూ వుంటారు. కాని నువ్వు ఆ మాటలన్నీ నమ్మకూడదు. ఎట్టి పరిస్థితుల్లోనూ మన జాతినీ, సంస్కృతినీ, మన మతాన్నీ విస్మరించకూడదు. విద్యకి మతానికీ సంబంధంలేదు." – అన్నారు శివరామ్‌పంత్‌గారు గంభీరంగా.

''వాళ్ళు తమమత ప్రభావాన్ని వీలైనంతగా వ్యాపింప జెయ్యడానికి ప్రయత్నిస్తూవుంటారు. కాని నీ మీద నాకు నమ్మకముంది. వాళ్ళ తియ్యటి మాటలకి నువ్వు మోసపోవని నా నమ్మకం!'' – అనికూడా అన్నారాయన, సుందరితో.

వినాయక్ పొరుగింట్లోనే వుండటం చేత సుందరి స్కూలుకెళ్ళే సంగతులన్నీ వాడికి తెలిశాయి. వాడూ, వాడి స్నేహితులు మరికొందరు పోకిరీవాళ్ళూ కలిసి సుందరి యింట్లోంచి బయటికొచ్చే ద్వారాని కిరువైపులా ఇకిలిస్తూ నిల

బడ్డారు. మన మధ్యనుంచి ఎలా బయటికి వెళుతుందో చూద్దామని వాళ్ళ ఉద్దేశ్యం.

స్కూలు కెళ్ళేసమయమైంది. ముందు పుస్తకాలు పుచ్చుకొని నౌఖరూ, ఆవెనక సుందరీ బయటికొచ్చారు. వాళ్ళు గుమ్మం దగ్గర అలాగే నిలబడ్డారు. వాళ్ళని తప్పుకోమని చెప్పాడు నౌఖరు. "మేం నిలబడితే ఏం? మధ్యనుంచి వెళ్ళలేరా?" అన్నాడు వినాయక్. "మాలాగా పుస్తకాలు స్వయంగా తీసుకెళ్ళడానికి సిగ్గా?" – అన్నాడు వినాయక్ మిత్రుడొకడు వెటకారంగా. సుందరి ఏమీ మాట్లాడకుండా తలొంచుకొని బయటికొచ్చేసింది.

## జరగవలసినంతా జరిగి పోయింది!

స్కూలునుంచియింటికెళ్ళేసరికి అమ్మ, అక్కయిద్దరూ కూడా ఏడుస్తున్నారు. అక్క ఎప్పుడొచ్చిందో ఏం జరిగిందో. నాకేమీ తెలీదు. అక్క జుట్టంతారేగి పోయివుంది. కళ్ళు ఎర్రబడి వుబ్బాయి. మూర్తీభవించిన శోకమూర్తిలా వుంది. ఎప్పుడూఏడవని అమ్మకూడ యివ్వాళ అక్కతోపాటుగా కంటతడిపెడుతోంది. నేను వెళ్ళినాకూడా, యిద్దరిలో ఎవరూ నన్ను పట్టించుకోలేదు. ఏంజరిగిందని నేను అడుగుదామనుకునేలోగా అక్క అమ్మతో మెల్లిగా చెప్పసాగింది – "నువ్వు నన్ను చెప్పెట్టికొట్టినా సరే, నేను మాత్రం మళ్ళీ ఆయింటికెళ్ళను! నన్ను మెడబట్టి బయటికిగెంటితే, ఏనూతిలోనో గోతిలోనో పడిచస్తానుగాని, ఆ యింటికి మాత్రం వెళ్ళను!"

ఆ మాటలవల్ల విషయమేమిటో నాకు చూచాయగా అర్థమైంది. కొంత సేపటికి అమ్మ, అక్క యిద్దరూకూడా ఏడుపుమానేశారు. అమ్మ అసలేమీ మాట్లాడలేదు. రాత్రి పదిగంటలకి – జరిగిపోయిన విషయాలన్నీ తలుచుకుంటూ పడుకున్నాను. మనసు వుద్విగ్నమై పోయింది. ఇంతలో బయట ఎవరో పిలిచినట్టయింది. ఇంత రాత్రి నన్ను పేరుపెట్టిపిలిచేదెవరా అని నేను కొంచెం

భయపడ్డాను. అంతాచీకటి. అంతానిశ్శబ్దం. నేనులేచి తలుపుదగ్గర కెళ్ళాను. తలుపుసందులోంచి చూస్తే - మామునలిబావగారు, ఆయనవెంట మరో ముసలాయన లాంతరు పుచ్చుకుని నిలబడ్డారు. ఇద్దరు ముగ్గురు నౌకర్లుకూడ వెంటవున్నారు. వాళ్ళు వచ్చిన కారణంనాకర్థమైంది. తలుపు తెరిచాను. తెరవగానే ఆ రెండో ముసలాయన - "వదిననితీసుకెళ్ళడానికి అన్నగారొచ్చారు; ఎవరైనా వస్తే, రాకపోవచ్చని ఆయనే స్వయంగా వచ్చారు ! ఎక్కడుంది?"- అన్నాడు.

ఆ ముసలాడి మాటలు విని నాకు కోపమొచ్చింది. నేనేదో అనబోయేలోగా- "ఇక్కడ నిలబడి ఉండాలిసిన అవసరం మాకులేదు ! అది ఎక్కడుందోపిలువ్! ఎవర్నిఅడిగి వచ్చిందిక్కడికి ?....ముసలాణ్ణిగదా అని, అది ఆడించినట్లల్లా ఆడతాననుకుందిగావును; కాని నేనట్టా ఆడేవాడిని కాదు ! నా సంగతేమిటో దానికి పూర్తిగా తెలియ జేద్దామనేవచ్చాను ! అది ఎక్కడుందో చెప్పు....నా వెంట నోరుమూసుకుని వస్తుందాసరే! లేదా చూసుకో ఏం చేస్తానో ...." - అంటూ ప్రారంభించాడు మాబావ. కోపం ఎక్కువై పోయి మాటలు పూర్తిగా నోట్లోంచిరావటం లేదాయనకి.

నేను శాంతంగా-"అంతా నిద్ర పోతున్నారు; నేను రేపు ఉదయాన్నే మీరు వచ్చి వెళ్ళారని చెబుతాను....ఇప్పుడే పడుకుంది...తలనొప్పి కూడావచ్చింది...." అన్నాను.

"అదేంకుదరదు! నే నిప్పుడే దాన్ని చూడాలి ! అది ఏ మే మి నగలు తెచ్చిందో కూడా నేను చూడాలి....!"-అన్నాడు బావ వుద్రేకంగా.

రాత్రి పది, పదకొండు గంటల సమయం. ఆ వేళప్పుడు పోట్లాడుకోవటం బాగుండదని - నేను అమ్మనీ అక్కనీ పిలిచి, బావగారొచ్చారని చెప్పాను. మధ్యాహ్నమంతా ఏడుస్తూనే వుండటంవల్ల యిద్దరూ త్వరగానే పడుకున్నారు.... నా పిలుపు విని ఖంగారు పడుతూ లేచివచ్చారు.

ఇక మా బావగారు అరుస్తాడనుకున్నాను నేను. కాని, ఆయన కంటే ముందే - "నువ్వు ఎవరికి చెప్పి వచ్చావిక్కడికి? అన్నగారు యింటికొచ్చి చూస్తే తమరులేరు ! ఇదివరకూ్కడా ఒకసారిలాగే చేశావ్! అర్ధరాత్రి పిలి

పించాల్సి వచ్చింది.; ఇప్పుడూ అలాగే చేశావు; ఇదిచాలా తప్పు! మాట్లాడకుండా యింటికి నడువు !" – అన్నాడు, బావగారి ముసలి మిత్రుడు ఆజ్ఞాపిస్తున్న ధోరణిలో.

ఆ ముసలాడికి అక్కగారింట్లో ముఖ్యమైన స్థానముంది. అక్క ఏం జవాబు చెబుతుందోనని నేను భయపడుతున్నాను. అక్క మొహం గంభీరమై పోయింది. అలాంటి పరిస్థితిలో వున్నప్పుడు అమ్మ మొహం ఎలావుంటుందో, ఇవ్వాళ అక్క మొహం కూడ అచ్చం అలాగే వుంది. నేనూ మౌనం వహించాను. ముసలాడు వాగుతూనే వున్నాడు. అమ్మ గోడ కానుకుని నిలబడి వుంది. ఎవరూ ఏమీ జవాబు చెప్పకపోయేసరికి – బావగారు బెదిరింపులు ప్రారంభించారు – "మళ్లీ యింకోసారి యిలా వచ్చావంటే, యిక యింటికి రానివ్వను! ఎవర్ని అడిగొచ్చావ్? నన్నడిగావా? నా యీ మిత్రుణ్ణి అడిగావా? నీ ఆటలు యిక సాగనివ్వను నేను! నోరు మూసుకుని నా వెంటరా! తెచ్చిన నగలన్నీ వున్నాయో లేవో కూడచూడు!" – అన్నాడు. అక్క కదల్లేదు; మెదల్లేదు. లాంతరు వెలుగులో ఆమె కన్నీళ్ళు చెక్కిళ్ళ మీద మెరుస్తున్నాయి. బావగారి ముసలి మిత్రుడు మళ్ళీ పాతపాటే ప్రారంభించాడు – "పద, పద, త్వరగా పద! అన్నగారింకా భోజనం కూడ చెయ్యలేదు. నువ్వింకా ఆయన కోపాన్ని రెచ్చగొట్టడం మంచిదికాదు! జరిగిపోయిన దాన్ని గురించి మేం అడగంలే, పద!" – అన్నాడు.

అప్పటికీ మేమెవరమూ ఏమీమాట్లాడలేదు. చివరకి బావగారు బిగ్గరగా – "ఏమిటిది? మేము ఎవరితో మాట్లాడుతున్నామనుకున్నారు? మేం మనుష్యుల మనుకున్నారా, జంతువుల మనుకున్నారా? వస్తావా, జుట్టుపుచ్చుకొని ఈడ్చుకెళ్ళమంటావా? నేను పెళ్ళికి ముందే అనుకున్నాను, మీకు నగలమీద, డబ్బుమీదా మోజని! నన్నుచేసుకుంటే, డబ్బుకూడబెట్టవచ్చు; నగలు సంపాదించవచ్చు; యిష్టమెచ్చినట్టు తిరగవచ్చూ అని నన్ను చేసుకున్నావు. నా దగ్గర ఆపప్పులేమీ వుడకవు! ఒక గుడ్డిగవ్వకూడా యివ్వను....వస్తావా, రా, లేదా...."

"రాను....రాను....రాను!" – అంటూ ఒక్కసారి అరిచింది అక్క. కావ్పేపు ఆగిపోయింది. తన భార్య అంతధైర్యంగా మాట్లాడ్డం చూసి బావ

గారు తెల్లబోయారు. అక్కయింక మౌనంగావుండలేక పోయింది. "మీరేం చేస్తున్నారు? మీరు చేసేపనులన్నీ బాగున్నాయా? నన్ను ఎంత మోసం చేస్తున్నారు? ఎన్నివిధాల ఏడిపిస్తున్నారు? ఇవన్నీ నేను అమ్మకికూడా చెప్ప లేదు. చెప్పేదాన్నికాను. కాని యింక నేను వుండలేను. మీరేం చేసుకుంటారో చేసుకోండి. మీ పోకిరీ స్నేహితులు; ఆ సిగ్గులేనిముండా యింట్లో వున్నంత కాలం, నేనాయింట్లో అడుగుపెట్టను! చూస్తాను....ఏంచేస్తారో !" — అంది.

అక్క క్రోధం చరమావస్థకి చేరుకుంది. కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి. ఎవరి మీదికైనా సరే కయ్యానికి కాలుదువ్వేఅమ్మ ఆ సమయంలో మౌనంగావుండటం నా కాశ్చర్యాన్ని కలిగించింది. ఇది నా మూర్ఖత్వానికి పరిణామమే; ఇప్పుడింక చేసేదేమీ లేదు; నాకూతురికి నా కంటే కోపమూ, దృఢనిశ్చయమూ వున్నాయి, అనుకుని మౌనంగా వూరుకుందేమో. ఆ ముసలాడు, బావగారితో — "ఇలా జరుగుతుందని నాకు ముందే తెలుసు! మంచి వంశానికి చెందిన పిల్లని చూసి చేసుకోమని నేను మీకు అప్పుడే చెప్పాను; కాని...." ఆ మాటలువిని నేను కోపంతో మండిపోయాను. కాని — అగ్నికి ఆజ్యంతోడు చెయ్యటం యిష్టంలేక నిగ్రహించుకుని వూరుకున్నాను. ఆ తర్వాత బావగారు ప్రారంభించాడు.— "నువ్వు చెప్పింది అక్షరాలా నిజం! భర్తని వదిలిపెట్టివుండే అలవాటు ఆ తల్లి నుంచి ఈ కూతురికి కూడా వచ్చింది....ఇప్పుడిది కూడా అలాగే చేస్తుంది.... అందులో సందేహమేమీ అక్కర్లేదు....!" — అన్నాడు.

నాయింట్లో నాముందు — నాతల్లితండ్రుల గురించి, యిలాంటి నీచులీవిధంగా మాట్లాడుతూంటే నేను సహించి వూరుకోవడమా? అది నా వల్లకాదు.

"నోరుముయ్యండి! నీ బోటి భర్తదొరికితే ఏ ఆడదైనా వదిలి పెట్టక ఏం చేస్తుంది? నా అక్క గౌరవనీయ కుటుంబంలోంచి వచ్చింది కాబట్టే యిన్నాళ్ళూ సహించి వూరుకుంది! ఇంట్లో బజారుముండల్ని తీసుకొచ్చి పెట్టిందేకాక యింకా మా అక్కనంటారా! మా అక్క యిక్కడి కొచ్చేసినందుకు నాకు గర్వంగా వుంది. ఇక్కడనుంచి పొండి! అదిరాదు! మీరేం చేస్తారో నేనూ చూస్తాను!"— అని గర్జించాను. అలా అంటూ ఆముసలాళ్ళిద్దరి ముందుకి వెళ్ళి నిలబడ్డాను— నా కప్పుడు అంత సాహసం ఎలావచ్చిందో నాకే తెలియదు. అంతకు ముందెు

వ్పుడూ నే నలా ప్రవర్తించక పోవంటవల్ల మా అమ్మకూడా ఆశ్చర్య పోయింది. నా కోపం చూసి బావగారూ, ఆయన స్నేహితుడూ కూడ జడిసి పోయారు. అయినాకూడ సిగ్గులేకుండా – "అయితే అదిరాదా?" అని మరో సారి అడిగారు బావగారు.

"రాదు!" – నేను ఖచ్చితంగా చెప్పేశాను.

ఇంక వాళ్ళు నోరెత్తలేక పోయారు. అయినా పోతూపోతూ – "నీ జాతి చెడ్డది; నీ తల్లి చెడ్డది; నువ్వు చదువుకున్నావు; అందుకనే మొగుణ్ణి విడిచి వచ్చావు....!"– అంటూ గొణుక్కుంటూ పోయారు బావగారు. చివరి మాటగా– "సరే, అలాగేవుండు : మొగుడున్న విధవలా బ్రతుకు!" – అని కూడా అన్నారు.

## రంధ్రాన్వేషణ

అంతా వెళ్లి పోయాక కూడా నేను చాలాసేపు గుమ్మంలోనే బొమ్మలా నిల బడ్డాను. ఇంతలో–"ఏం జరిగింది?"– అన్నారెవరో. మా యిరుగుపొరుగున వుండే ఒక వ్యక్తి! మాయింట్లో జరిగిన గొడవ యిరుగుపొరుగు అందరికీ తెలిసి పోయిందన్న మాట. నాకు బాధనిపించింది. నన్నడిగిన వాడికి సమాధా నంగా – "ఏంలేదు!"– అన్నాను. "వూరందరికీ తెలిసిపోయింది; యింకా మా దగ్గర దాచిపెట్టి ఏం లాభం?" – అంటూ వాడు తన యింట్లోకి వెళ్లి, దభాలున తలుపు మూసుకున్నాడు. ఆ పక్కింటి వాడు కూడా హేళనగా నవ్వుతూ తలుపు మూసుకున్నాడు. అమ్మా, అక్కా ఏమి ఆలోచిస్తున్నారో నేను వూహించ లేక పోయాను. అక్క ఏడుస్తూ అలాగే నిలబడివుంది. కదల్లేదు. మెద ల్లేదు. ఒక్క అక్షరం పలుకు కూడా పలకలేదు. నేను ఇద్దరి మొహాల వంకా మార్చిమార్చి చూస్తున్నాను. అమ్మ తల వొంచుకుని నిలబడింది. ఆరిపోవడానికి సిద్ధంగావున్న దీపం తవింకా వెలుగుతూనే వున్నానని చెప్పుకో

దానికా అన్నట్టు వెలగలేక వెలగలేక వెలుగుతోంది. అందులో నూనె ఎప్పుడోనే అయిపోయినట్టుంది. కాని ఆ సంగతి ఎవరూ పట్టించుకోలేదు. దీపం ఆరిపోవడానికి సిద్ధంగా వుంది.

"అమ్మా! నూనె ఎక్కడుంది?" - అని అడిగాను నేను. అమ్మ సమాధానం చెప్పలేదు. నేను నూనె కోసం వెతుకుదామనుకునే లోగా దీపం ఆరిపోయింది. అంతటా చిక్కటి చీకటి ఆవరించింది. అగ్గిపెట్టె ఎక్కడుందని నేను అమ్మని అడగబోయేలోగా - ఏదో పెద్దవస్తువు ఒక్కపాటున కింద పడిన చప్పుడైంది. అక్క ఖంగారు పడుతూ - "భావూ భావూ! అమ్మ పడిపోలేదుగదా?" - అంది. నాకూ అలాగే అనిపించింది. కాస్సేపు వెతికినా అగ్గిపెట్టె ఎక్కడా దొరక లేదు. అగ్గిపెట్టెకోసం వెదుకుతూ వుండగా, ఏదో చల్లటి వస్తువు నా చేతికి తగి లింది. పరీక్షగా తడిమిచూస్తే -అది-అమ్మపాదం! మనసులో ఏదో ఒకవిచిత్ర మైన ఆలోచన వచ్చింది. నా గుండె ఆగిపోయినట్టయింది. నేనేమి వెదుకు తున్నానో ఎక్కడ వెదుకుతున్నానో కూడ మర్చిపోయాను. గుండె వేగంగా కొట్టుకోసాగింది. వెతగ్గా వెతగ్గా అగ్గిపెట్టె దొరికింది. భయం మూలాన వెంటనే అగ్గిపుల్ల వెలగలేదు. అగ్గిపుల్ల వెలిగాక చూస్తే - అమ్మ శవంలా కిందపడివుంది. అక్క ఎక్కడుందో కనబడలేదు. నేను ఆలోచిస్తూండగానే అగ్గిపుల్ల ఆరిపోయింది. ఇంకోపుల్ల గీశాను. కాస్త ధైర్యం వచ్చింది. దీపం బుడ్డిలో నూనెపోసి వెలిగించాను.

ఇంతలో అక్క పొరుగింటి ఆడవాళ్ళిద్దర్ని తీసుకుని వచ్చింది. నేను వెంటనే అమ్మదగ్గరకెళ్ళి వొంటి మీదచెయ్యేసి చూశాను. అమ్మకి పూర్తిగా స్పృహలేదు. వొళ్ళంతా చల్లగావుంది. అమ్మ ఈ లోకాన్నివిడిచిపెట్టి వెళ్ళిపోలేదుగదా అన్న భయంకరమైన ఆలోచనవచ్చింది. అక్క ధైర్యం పూర్తిగా అంతరించింది. నేను కూడ ఏడవటం ప్రారంభించాను. పొరుగింటి ఆడవాళ్ళిద్దరూ వోదార్చడం ప్రారంభించారు. నేను మాటిమాటికీ అమ్మనిపిలుస్తూ, వూపిరాడుతోందా లేదా అని ముక్కుదగ్గర చెయ్యిపెట్టి చూస్తున్నాను. అమ్మకిలా అవుతుందని నేను వూహించలేదు. ఇంతలో అమ్మనిట్టూర్చినట్టూ, కాళ్ళూచేతులూ కదపడానికి ప్రయత్నిస్తున్నట్టూ అనిపించింది. అక్క బిగ్గరగా ఏడుస్తోంది. డాక్టర్ని పిలవా

లన్న ఆలోచన అకస్మాత్తుగా వచ్చింది నాకు. వెంటనే బయటికి పరుగెత్తాను. సరాసరి శివరామ్‌పంత్‌గారింటికి వెళ్ళాను. ఆయన్నీ ఆయనకి తెలిసిన ఒక డాక్టర్నీ వెంటబెట్టుకొచ్చాను. ఈలోగా అమ్మ ఏమైందోనన్న ఆందోళన ; ఇంటి కొచ్చిచూస్తే, అమ్మకి కొద్దిగా తెలివొస్తున్నట్టుగావుంది. మూలుగుతోంది. డాక్టర్‌దార్లోనే జరిగిన విషయమంతా అడిగితెలుసుకున్నాడు. "అమ్మా, అమ్మా! నీకేమైంది ?"—అంటూ అమ్మ పక్కన కూర్చుని ఏడుస్తోంది అక్క.

అమ్మకి తెలివొస్తున్నందుకు ఒక పక్క ఆనందంగానూ, ఏమౌతుందోనని మరోపక్క భయంగానూవుంది నాకు. డాక్టర్ అమ్మని పరీక్షించాడు. కళ్ళల్లో అంజనం వేశాడు. నోట్లో అల్లపురసం పోయించాడు. కొద్దిగా స్పృహవచ్చి నట్టుగావుంది. బాగా జ్వరం వచ్చింది. మళ్ళీ కాస్సేపటికే తెలివితప్పింది. డాక్టర్ ఏమీ చెప్పకుండా మందుల చీటీ రాసియిచ్చాడు. ఆ చీటీ తీసుకుని నేనూ, శివరామ్‌పంత్‌గారూ డాక్టర్‌గారి బండిలోనే వెళ్ళాం. నేను మళ్ళీ డాక్టర్ని అమ్మ గురించి అడిగాను. "మనసుకి తీవ్రమైన ఆఘాతం తగిలింది; అంజనం వేస్తే కొద్దిగా తెలివివచ్చింది. అయినా యిప్పుడే ఏమీ చెప్పలేం; నేనిప్పుడు రాసి యిచ్చిన మందులు ఎలా పనిచేస్తాయో చూడాలి; ఆమె ప్రాణాలగురించి ఖచ్చితంగా ఏమీ చెప్పలేం ; కాని, పరిచర్యలు మాత్రం చాలా జాగ్రత్తగా చెయ్యాలి"— అన్నాడు డాక్టర్.

నేను మందులు తీసుకుని యింటి కొచ్చేసరికి అమ్మజ్వరంయింకా పెరిగింది. అంతకు ముందున్న ఆడవాళ్ళు కొందరు వెళ్ళిపోయారు. నేను వెళ్ళాక మిగతాయిద్దరు కూడ వెళ్ళిపోయారు. నేనూ, అక్కా రాత్రితెల్లవార్లూ అమ్మ దగ్గరే కూర్చున్నాం.

డాక్టరు చెప్పిన ప్రకారం అరగంట అరగంటకీ మందులు యిస్తూనేవున్నాం. మధ్యమధ్యలో 'అమ్మా, అమ్మా'-అని పిలుస్తూనే వున్నాం. కాని అమ్మకి తెలివి రాలేదు. మా ధైర్యం యింకా దిగజారిపోయింది. ఆఖరుకు – ఉదయం ఎనిమిది తొమ్మిది గంటలకి జ్వరం తగ్గింది. మెల్లిగా కళ్ళువిప్పింది. అప్పుడు అమ్మ పక్కన నే నొక్కడినే వున్నాను. అక్కలోపల పనిలోవుంది. 'అమ్మా!' అని పిలిచాను. అమ్మకళ్ళు విప్పిచూసిందిగాని, ఏమీ మాట్లాడలేదు. మధ్యాహ్నం

మళ్ళీ మూర్ఛవచ్చింది. మళ్ళీ కళ్ళల్లో అంజనం పెట్టాం. నోట్లో అల్లపురసం పోశాం. కాని తెలివిరాలేదు. జ్వరం పెరిగిపోయింది. మామయ్యకి టెలిగ్రాం యిచ్చాం. మే మిద్దరమూ చిన్నవాళ్ళం కావటంచేత – అమ్మమ్మ, మామయ్యా వొచ్చేవరకూ సుందరితల్లి మా యింట్లో వుండేట్టుగా ఏర్పాటు జరిగింది. సుందరి కూడా అప్పుడప్పుడూ వస్తోంది. మూడు రోజులపాటు అమ్మ స్థితి అలాగే వుంది. రోజుకి రెండుసార్లు మూర్ఛవస్తోంది.

ఈ మూడు నాలుగు రోజుల్లోనూ మా మానసిక స్థితి విచిత్రంగా మారి పోయింది. అమ్మ స్వభావం ఎలాంటిదైనా కావచ్చు; ఆమె చేసిన పనులు ఎలాంటివైనా కావచ్చు; నాపట్ల అమ్మ ఎలాగైనా ప్రవర్తించవచ్చు; కాని అమ్మ ఏం చేసినా అదంతా మాకోసమే గదా అన్నసంగతి మాకు తెలుసు. నేనుపెద్దవాడి నైన కొద్దీ అమ్మపట్ల నాకు ఆదరభావం పెరగసాగింది. నేను పెద్దవాడినై అమ్మని సుఖపెట్టాలనుకున్నాను. ఇలాంటి దశలో అమ్మ నన్ను విడిచి వెళ్ళి పోతే ఏమవుతుందన్న భావన నన్ను భయకంపితుణ్ణి చేసింది.

మూడు రోజుల్నుంచీ డాక్టర్ వస్తూనే వున్నాడు; వెళుతూనే వున్నాడు. మందులు వాడుతూనే వున్నాం. డాక్టరు ఒక్కోసారి మమ్మల్ని భయపెడు తున్నాడు; మరోసారి ధైర్యం చెబుతున్నాడు. నాలుగోరోజు వుదయం అమ్మకి మళ్లీ మూర్ఛవచ్చింది. ఎంతసేపటికీ తెలివిరాలేదు. శరీరం కట్టెలా బిగుసుకు పోయింది. నేను రెండు మూడుసార్లు డాక్టరుకోసంతిరిగి తీసుకు వచ్చాను. సరిగ్గా చూస్తే బ్రతుకుతుందనే చెబుతున్నాడు డాక్టరు. కాని నాకు నమ్మకంలేదు. సుందరి, సుందరితల్లి కూడా యింట్లోనే వున్నారు. సుందరి కూడా అప్పుడప్పుడూ అక్కతోపాటు ఏడుస్తోంది. సాధ్యమైనంత వరకూ అమ్మ పక్కనే కూర్చోమని చెప్పింది – సుందరితల్లి నాతో. నేను అలాగే కూర్చున్నాను. సాయంత్రానికి తెలివొస్తుందన్నాడు డాక్టరు. సాయంత్రం వరకూ ఎదురుచూస్తూ కూర్చున్నాం. కాని తెలివిరాలేదు. సాయంత్రం అయిదు; అయిదున్నర; ఆరు; ఆరున్నర కూడా అయింది. తెలివి రాలేదు.

ఒక్కో నిమిషం; ఒక్కో క్షణం ఒక్కో యుగంలా అనిపిస్తోంది నాకు. డాక్టరు చెప్పిన గడ్డు సమయం దాటిపోయింది. అందువల్ల నాకు కాస్త ధైర్యంగా

వుంది. చివరికి అమ్మకి తెలివి వచ్చింది. అటూయిటూ కదిలి, కళ్ళు విప్పి చూసింది. కాని ఆ కళ్ళల్లో వెలుగులేదు. ఆమెలో అంతశక్తి ఎక్కడి నుంచి వచ్చిందో తెలీదుగానీ – 'భావూ!' అని పిలుస్తూ లేవబోయింది. లేవలేక మళ్ళీ మంచమ్మీద పడిపోయింది. నేను వెంటనే అమ్మని పట్టుకున్నాను. అమ్మతల నా వొడిలో పెట్టుకుని కూర్చున్నాను. ఏదో చెప్పడానికి ప్రయత్నిస్తోంది! నా చెవి అమ్మ నోటి దగ్గరకి చేర్చాను. అస్పష్టంగా కొన్నిమాటలు వినిపించాయి—"భావూ, భావూ! దాన్ని నీతోనే వుంచుకో....అది బొత్తిగా.... ఒంటరిది....ఏమైనాసరే...."

కొద్ది నిమిషాల తర్వాత అమ్మ జీవనజ్యోతి ఆరిపోయింది.

## ఇకముందు....

అడవిలో నడుస్తూనడుస్తూ వుండగా – అకస్మాత్తుగా తుఫానువచ్చి, చేతిలో వున్నదీపం ఆరిపోయి, నలువైపులాగాఢాంధకారం చుట్టుముడితే ఎలా వుంటుందో, మా పరిస్థితి అలావుంది. బాల్యంనుంచీ మా జీవన మార్గంనిండా కంటకాలే! మేమంతా నిర్జనాటవిలో సహయాత్రికులం! ఈ భయంకరాటవిలో దృఢ నిశ్చయం; ఆత్మ విశ్వాసాల జ్యోతి వెలిగించుకుని అమ్మ మా వెంటవుండేది. మేమెన్నడైనా కాస్త సరైనరోజులు చూశామంటే; దానికి అమ్మ కష్టమే కారణం. ఇప్పుడా జ్యోతి ఆరిపోయింది. అమ్మవుంటే; అన్నీ వున్నాయి: అమ్మే మనకి ఆధారం; అమ్మే మనకి ఆశ్రయం అనిపించేది. అమ్మేగనక జీవించి వుంటే ప్రపంచాన్నీ ప్రజల్నీ లెక్కచెయ్యకుండా—ఏదో విధంగా అక్క జీవితం సుఖంగా గడిచి పోయేట్టుచూసేది. మరణించే ముందు అమ్మ పలికిన మాటలే అందుకు నిదర్శనాలు. తన మూర్ఖత్వానికి పశ్చాత్తాపపడి, ఆ పశ్చాత్తాపంలోనే అమ్మ ప్రాణాలు విడిచిందని నా ఉద్దేశ్యం. అమ్మ తుది శ్వాస తీసుకుంటూ వుండగా – అమ్మతల నా వొడిలో పెట్టుకుని—నేను మనసులోనే ఒక

శపథం తీసుకున్నాను.

"అమ్మా ! నేను అక్కని ఎన్నడూ విడిచిపెట్టను ! అంతేకాదు—అక్క సుఖంకోసం త్రికరణశుద్ధిగా కృషిచేస్తాను; ఎప్పటికీ సత్యమార్గాన నడుస్తాను ! ఇందుకు నువ్వే సాక్షివి ! నీమీదవొట్టు !"— అనుకున్నాను మనసులో.

నా మనోభావం అమ్మ ఆత్మ గ్రహించిందా అన్నట్టుగా, అప్పటికే నిర్జీవమై పోయిన అమ్మ మొహాన ఒకరెప్పపాటు కాలం కాంతివంతమైంది. అమ్మ నవ్వుతున్నట్టుగా అనిపించింది. ఆ ఒక్కక్షణం – ఒకేఒక్క క్షణం నా జీవితంలో పరివర్తన తెచ్చింది. నామానసిక దౌర్బల్యమంతా అంతరించింది. మనసు రాయిచేసుకున్నాను. ఎన్ని కష్టాలొచ్చినా సరే, వాటిని నేను ఎదుర్కొంటానూ అన్న ధైర్యం వచ్చింది. అమ్మ మొహాన ఆ పరివర్తన కలిగినప్పుడే నాలోనూ పరివర్తన కలిగింది. ఇప్పటిదాకా నా మనసులోవున్న అంధకారమంతా విడిపోయి వెలుగురేఖలు వికసించాయి. అమ్మ హృదయంలో ఇన్నాళ్లూ నివసించిన దృఢనిశ్చయపు జ్యోతివచ్చి నా మనసులో ప్రవేశించిందా అనిపించింది.

జరిగిందేదో జరిగిపోయింది. కష్టాలు కలకాలం వుండవు ! చిన్నతనం నుంచీ కష్టాలూ కడగళ్ళూ అనుభవిస్తూనే వున్నాం.

నేను నా దుఃఖమంతా దిగమింగి, అక్కకి ధైర్యం చెప్పడం ప్రారంభించాను. నాలో యింత ధైర్యం; స్థైర్యం ఎక్కడినుంచి వచ్చాయా అని చూసేవాళ్ళందరకీ ఆశ్చర్యం కలిగింది. ఒకావిడ అందికూడా– "ఈ పిల్లాడు విచిత్రమైన వాడే ! అమ్మపోయిందన్న విచారమే వున్నట్టులేదు !.... కంటతడైనా పెట్టలేదు... !"

మామయ్యొచ్చాడు. "జరిగిందంతా మర్చిపోయి, మీ ఆయన్ని క్షమాపణ కోరుకుని, ఆయనదగ్గర కెళ్ళిపో!"– అని అక్కకి సలహా యిచ్చాడు. ఆ సలహా నాకూ అక్కకీ కూడ రుచించలేదు. అమ్మ వుంటే ఈ ప్రసక్తే వచ్చేదికాదుగదా అనిపించింది నాకు. నా శపథం గుర్తొచ్చింది. నా మనోబలం ప్రదర్శించాల్సిన సమయ మిదేననుకున్నాను. "ఏమన్నావ్? అలాంటి దుష్టుడైన ముసలాడి దగ్గరకి అక్క మళ్ళీ వెళ్లాలా? ఇంట్లో వాడుంచుకున్న వేశ్యలకి సేవలు చెయ్యడానికి, వాడిని క్షమాపణ కోరుకుని వెళ్ళాలా? అమ్మ అక్క పరిస్థితులు చూసి

ప్రాణాలు వదిలింది. అలాంటి అమ్మని గురించే ఆ ముసలాడు నీచంగా మాట్లాడాడు. అలాంటి సిగ్గులేని వాడింటికి నా అక్కని ఎన్నటికి పంపను!"– అన్నాను, దృఢంగా, ధైర్యంగా. నాలో అంత ధైర్యం ఎక్కడి నుంచి వచ్చిందో నాకే తెలియదు. అప్పుడు శివరామ్‌పంత్‌గారు కూడా అక్కడే వున్నారు. నా మాటలు విని అంతా ఆశ్చర్యపోయారు. మామయ్య తెల్లబోయి, కళ్ళు పెద్దవిచేసుకొని నావంక చూస్తున్నాడు. నేను ఆవేశంలో అదేపనిగా మాట్లాడుతూనే వున్నాను. నా మాటలు విని అక్క మనస్సుకి శాంతి కలిగి నట్టుంది. శివరామ్‌పంత్‌గారి మొహానకూడ ఆనందరేఖలు వెలిశాయి.

## ఆలోచనా తరంగాలు

నేను ఆరోజు దాకా నాపరిస్థితి గురించి ఆలోచించుకోలేదు. కాని మామయ్య అన్నమాటలు విన్నాక–నేనెంత దుర్బలస్థితిలో, నిరాశ్రయస్థితిలో వున్నానో అర్థమైంది. నాకు చాలా బాధకలిగింది. ఎన్నో వేల ఆలోచనలు మనసునిండా ముసురుకున్నాయి. నా దారిద్ర్యం; అసహాయస్థితి; యివన్నీ నా మనసుకు బాధకలిగించాయి. కాని యిప్పుడు విచారించి ఏం లాభం ?

నే నొక మూలకూర్చుని యివన్నీ ఆలోచించుకుంటూ వుండగా, యింతలో "భావూ, భావూ" – అన్న కోమల స్వరం, ఆవేదనాపూరితమైన స్వరం వినిపించింది. నేను వెనక్కితిరిగి చూశాను. అక్క! అక్క దీనదశ చూసి నాకు మరింత బాధ కలిగింది.

చిన్నప్పుడు అక్క చాలా అందంగా వుండేది. కాని రోజు రోజుకీ ఆమె శరీరం కృశించిపోతోంది. అక్క శరీరం చూసి నాకు భయమేసింది. ఒక్క క్షణంపాటు–కొన్ని భయంకరమైన ఆలోచనలు మనసులో మెదిలాయి. అమ్మ లాగా అక్క కూడా నన్ను విడిచిపెట్టి వెళ్ళిపోదుగదా! రోజు రోజుకీ అక్క

యిలాగే ఎండిపోతుందా? అమ్మ మరణ దృశ్యం నా కళ్ళముందు మెదిలింది. అమ్మ స్థానంలో అక్క రూపం కనిపించసాగింది. నా మనసు కుంగిపోయింది.

అక్క వెనకటిలాగే, బలహీనమై రుద్ధమైపోయిన కంఠంతో— "బావూ! బావూ! నువ్వు మాట్లాడవేం? నీకు బరువుగా బ్రతకటం నాకిష్టంలేదు. మామయ్య చెప్పిన ప్రకారమే చేస్తాను. పూర్వజన్మలో నే చేసుకున్న పాపం అనుభవించక తప్పదు. నా జీవితంలో మిగిలిన కొద్దిరోజులూ త్వరగా ముగించుకుంటాను....!"—అంది. ఆమాటలు విని నామనసు నీరైపోయింది. ఏడుస్తూ— "అక్కా....అక్కా! ఏమిటి నువ్వంటున్నది? నీకు మళ్ళీ...."—అన్నాను.

అక్క కళ్ళుతుడుచుకుని—"బావూ! మామయ్య నీతో చెప్పిన మాటలన్నీ నేను విన్నాను. మామయ్య చెప్పినదంతా నిజమే. ఈ పరిస్థితుల్లో మనరోజులు ఎలా గడుస్తాయ్? నేను పూర్తిగా ఆయన మీద ఆధారపడివున్నాను. అందువల్ల ఆయనచెప్పిందల్లా వినక తప్పదు. బావూ! నీ చదువింకా పూర్తికాలేదు; మనం గనక మామయ్య మాట వినకపోతే, ఆయన మనకి సాయం చెయ్యడు!"—అంది.

"చెయ్యకపోతే చెయ్యకపోనీ! ఇప్పట్నుంచీ నా ఏర్పాట్లు నేను చేసుకోవాలి— ఇంతేగా? నేను ఏమైనా చేస్తాను; కాని నాశపథం మాత్రం విడిచిపెట్టను! నిన్ను విడిచిపెట్టి వుండను! ప్రపంచం నవ్వనీ; తిట్టనీ! మనం ఎలాగూ ఎమ్మేలూ, బియ్యేలూ చదవలేం. వందలూ వేలూ సంపాదించలేం! నాకు అయిదు, పది రూపాయలు దొరికినా సరే; వాటితోనే మనం గడుపుకుందాం; నాలుగైదు మాసాలు ప్రయత్నిస్తే ఏదో ఒక వుద్యోగం దొరక్కపోదు. అక్కా, నాశపథాన్ని గనక విడిచిపెట్టి, నిన్ను పంపేస్తే, అమ్మ ఆత్మ...."—అన్నాను నేను.

మాటి మాటికీ నేను శపథం అనటం అక్కకేమీ అర్థంకాలేదు. నాశపథం సంగతి అక్కకి ఎంతమాత్రం తెలీదు.

నేను మళ్ళీ ప్రారంభించాను——

"అక్కా! మామయ్య అమ్మవుండగా పంపినట్టే డబ్బు పంపుతాడా మంచిదే; నాలుగు రోజులు నిన్ను తన దగ్గర వుంచుకుంటే వుంచుకోనీ; కాని నిన్ను అత్తవారింటికి పంపాలని ఆయన పట్టుపడితే మాత్రం — మనం

మనదారి వెతుక్కోవలసిందే! ఈ పరిస్థితిలో గనుక నువ్వు అత్తవారింటికెళితే, నీకు గౌరవముండదు. నీ భర్తకి మరీ చులకనైపోతావు. ఇది గతిలేక చివరికి నా దగ్గరకే వచ్చిందనుకుని, యింకా హీనంగా చూస్తాడు. అంచేత నువ్వు ఏమైనా సరే వెళ్లొద్దు; ఏదో విధంగా రోజులు గడిపేద్దాం; నీకు విచారమెందుకు? కొన్ని రోజులు దరిద్రం అనుభవించాలి; ఇందుకేగా? అయితే ఏం?"

అక్క మౌనంగా వింటోంది. "భావూ! నాకో ఆలోచన వచ్చింది. ఒక వేళ మామయ్య గనక నన్ను తీసుకెళ్ళకపోతే...."– అని ఏదో చెప్పబోయింది.

ఇంతలో మామయ్య మమ్మల్ని పిలిచాడు.

## సోదరీ వియోగం

మేము యిద్దరమూ మామయ్యదగ్గరకెళ్ళి కూర్చున్నాం. మామయ్య చాలా ఆప్యాయంగా – "భావూ! ఏం నిర్ణయించావు? బాబూ! పత్నిపతిని విడిచి వుండటం భావ్యం కాదు. సరే, పోనీ, యివ్వాళ ఆవిషయంగురించి మనంఆలోచించ వద్దు; కాని అమ్మాయిని కొన్నాళ్ళపాటు నాదగ్గర వుంచుకుంటాను. నువ్విక్కడుండు; నాళ్తికికొద్దీ నేను నీకు సాయంచేస్తాను. నువ్వుబాగా చదువుకుంటావని నాకునమ్మకముంది. బాబూ! మీ అమ్మ నా ఒక్కగానొక్క సోదరి. ఆమె ఎలాంటిదైనా, ఆమె స్వభావం ఎలాంటిదైనా ఆమెపట్ల నాకు ఎంతో ప్రేమ వుండేది. ఇప్పుడు మీ అమ్మలేదు. ఆమెస్థానంలో మీరిద్దరూ వున్నారు; ఇలాంటిస్థితిలో నేను మిమ్మల్ని విడిచిపెడతానా? అత్తారింటికెళితే సుఖపడుతుందే మోనని నేను అక్కని వెళ్ళమన్నానుగాని, మీకెవరికీ యిష్టంలేకపోతే నేనా విషయంలో పట్టుపట్టను. నేను నాదగ్గరికి తీసుకెళ్ళి, మీ అమ్మని చూసుకున్నట్టే చూసుకుంటాను!"– అన్నాడు.

మామయ్య కంఠంగద్గదమైపోయింది. ఆయన కళ్ళల్లోనీళ్లు నిండాయి. అమ్మఅంటే మామయ్యకి చాలాప్రేమ. ఆయన మనసు యింతసున్నితమైన

దని నేనువూహించలేదు. నా మనసుకూడ ఆయన మాటలతో ఆర్ద్రమై పోయింది. "మామయ్యా! నేను నీతో కఠినంగా మాట్లాడివుంటే క్షమించు. తప్పుగా భావించకు!"– అన్నాను. తలవొంచుకున్నాను. మామయ్యమాటలు విని అక్కకూడ ఏడవసాగింది. కొంతసేపు ముగ్గురమూ మౌనంగానేవున్నాం. ఆ తర్వాత మామయ్య మెల్లిగా– "భావూ! నీ మాటలకి నేనేమి బాధపడలేదు; నీ అక్కపట్ల నీకున్న ప్రేమచూసి సంతోషించాను. నేను అక్కని నాతోపాటు తీసుకెళతాను. మీరిద్దరూ యిక్కడ వుంటే చూసేవాళ్ళకంత బావుండదు. నువ్వు లేనప్పుడు దాని భర్త వచ్చి దాన్నేమైనా బాధలుకూడ పెట్టవచ్చు. మీతోపాటు అమ్మకూడ వుండివుంటే ఆ సంగతివేరు; ఆ ఆసరా యిప్పుడు లేదుగదా? నీభవిష్యత్తు బాగా వుండాలనే నేనుకోరుకునేది. నాకు నీమీదవున్నంతప్రేమ నాబిడ్డలమీద కూడలేదు. నాశక్తివున్నంతమేరకు నీకుడబ్బుకి చెందిన చింత అక్కర్లేదు. నువ్వెంతవరకూ చదవాలనుకుంటావో అంతవరకూ చదువుకో. చదువుకయ్యేఖర్చంతా నేనుపంపుతాను. మీఅమ్మ స్వభావం విచిత్రమైంది. కాని ఆమెలో ఒక గొప్పగుణంవుంది; సూటిగావుండేది ఆమెస్వభావం; ఆమె మనసు నిష్కపటమైనది!"– అన్నాడు.

మామయ్యయింకేమీ మాట్లాడలేక పోయాడు. ఆయనగొంతు పూడి పోయింది. "ఇక మీరు వెళ్ళండి: నేను వొంటరిగా కూర్చోవాలి...." అని మాత్రం అనగలిగాడు. వెంటనే మేమిద్దరం అక్కడినుంచి లేచి వచ్చేశాం. మామయ్య మాటలన్నీ మాకు ఆశ్చర్యం కలిగించాయి. అమ్మగుర్తొచ్చి –నేనూ, అక్కా అశ్రుపూరిత నేత్రాలతో ఒకరినొకరు చూసుకున్నాం.

## తదుపరి సంఘటనలు

ఉదయంలేవగానే భోజనానికి ఏహోటలుకి వెళ్ళాలా అని ఆలోచించసాగాను. చిన్నతనంనుంచే ఎన్నోకష్టాలు అనుభవించి వుండటంచేత భోజనానికి ఇబ్బంది

పడటం నాకు పెద్ద కష్టమనిపించలేదు. హోటలు భోజనం వల్లవుండే బాధల గురించి అంతకుముందే విన్నాను. కాని నేనే యింతత్వరగా ఆ బాధల్ని ఎదుర్కొనవలసి వస్తుందనుకోలేదు. ఈ ఆలోచనలతో వుండగా, నన్నెవరో పిలిచారు. కంఠం పరిచితంగావుంది. కాని ఇప్పుడే నాకోసం ఎవరొస్తారా అనుకున్నాను. కుతూహలంతో తలుపు తెరిచి చూద్దునుగదా–సుందరి! ఈ వేళప్పుడు సుందరి ఎందుకొచ్చిందా అని ఆలోచించసాగాను.

ఇంతలో సుందరి నవ్వుతూ– "బాపూరావ్! నిన్న నాన్నగారు మిమ్మల్ని కలుసుకోవడానికి రెండుసార్లువచ్చారు. కాని, రాత్రి తొమ్మిదీ తొమ్మిదిన్నర వరకూ మీరు యింటికి రాలేదు. మీరు మీ మామయ్య వెంట వెళ్ళిపోయారేమో అనుకున్నారు నాన్నగారు. నాన్నగారికి పనుండి యిప్పుడు రాలేకపోయారు. మిమ్మల్ని వెంటనే మా యింటికి రమ్మన్నారు!"– అంది. ఆ మాటలు చెప్పేసి, సుందరి కాస్త సిగ్గుతో తల వంచుకుని నిలబడింది. సుందరి నన్ను "మీరు.... మీరు"– అనడం నాకాశ్చర్యం కలిగించింది. కొద్దిరోజులక్రితం వరకూ నన్ను 'నువ్వు....నువ్వు' అనేది. ఇప్పుడు మీరు మీరనడం నాకు కర్ణకఠోరంగావుంది. వెంటనే అడిగేశాను– "సుందరీ, ఏమిటివ్వాళ కొత్తరకంగా మాట్లాడుతున్నావ్! మన చిన్ననాటి స్నేహబంధాన్ని ఒక్కసారి తెంచిపారేశావా? నువ్వు నన్ను మీరు, మీరనడం నేనుభరించలేను. నేనొక్కసారిగా నీకు పరాయివాడినై పోయానా సుందరీ! నువ్వూ, మీఅమ్మా నాన్నా తప్ప నాకీప్రపంచంలో ఇంకెవరున్నారు సుందరీ? సర్లే....నేను మీ నాన్నగారి దగ్గరికి సాయంత్రం వస్తానని చెప్పు.... నేను భోజనానికి హోటలు వెదుక్కోవాలి...."

నా మాట పూర్తికాకముందే అడ్డుపడి—

"లేదు, లేదు .... నువ్వు భోజనానికి హోటలుకి వెళ్ళకూడదు .... నిన్ను నాన్నగారు భోజనానికే మా యింటికి పిలిచారు...."–అంది సుందరి.

"ఏమిటి ఇవ్వాళ విశేషం?"– అని అడిగాను.

"విశేషమేముంది?....వూరికే...." – అంది సుందరి, – చిరునవ్వుతో.

నేనింక ఎక్కువగా మాట్లాడకుండా సుందరి వెంట బయలుదేరాను. అక్క గురించి మాట్లాడుకుంటూ వెళుతున్నాం. తన కెప్పుడూ వుత్తరాలు రాస్తూ

ఉండమని, అక్కకి చాలా కవర్లూ కాగితాలూ యిచ్చిందట సుందరి. మేమిద్దరం రోడ్డుమీద పక్కపక్కనే నడవటంచూసి - కొందరు పోకిరీ వెధవలు హేళనగా నవ్వటం ప్రారంభించారు. ఇలాంటివన్నీ సుందరికి అలవాటయిపోయాయి. మాట్లాడకుండా తలవంచుకుని నడవసాగింది. మేం వెళ్ళేసరికి శివరామ్‌పంత్ గారు మా కోసమే ఎదురుచూస్తూ కూర్చున్నారు. నన్ను చూడగానే-"భావూ! నువ్వు భోజనానికి హోటలు కెళ్ళడం మా యింట్లో ఎవరికీ యిష్టంలేదు. నువు రోజూ యిక్కడికే వచ్చి భోజనం చెయ్యి; దగ్గర్లో ఎక్కడన్నా గది తీసుకో, అలా చేస్తే యిక్కడికి రావడానికీ పోవడానికీ నీ కెక్కువ సమయం వృథా కాదు; చదువులోకూడ, నేను నీకు సహాయం చేస్తాను...."-అన్నారు.

నేను ఆశ్చర్యపోయాను. నేను సందేహించటం చూసి - "నువ్వు సందేహించనక్కర్లేదు భావూ! నీవల్ల మామీద ఏదో బరువుపడుతుందని నువ్వనుకోనక్కర్లేదు. నువ్వు హోటల్లో భోంచెయ్యడం మాయింట్లో ఎవరికీ యిష్టం లేదు....పద,పద....కాళ్లూ చేతులూకడుక్కుని భోజనంచెయ్ .... వెళ్ళు....!" - అన్నారు, శివరామ్ పంత్‌గారు.

ఆయన మనసు, ఆయన వ్యక్తిత్వం ఎంత ఉన్నతమైనవో నా కంతకు ముందే తెలుసు. ఆయన ఔన్నత్యానికి ఇది మరొక నిదర్శనం.

ఏ యింటిపట్ల నాకు అమితమైన ఆకర్షణవుందో! ఆ యింటి సభ్యుల్లో నేనూ వొకడినై వుండసాగాను.

మూడునెల్లు గడిచాయి. నా పరీక్షలు దగ్గరకొచ్చాయి. నేను చదువులో మునిగిపోయాను.

## ఆ ఉత్తరం యిటూ; ఈ ఉత్తరం అటూ

మెట్రిక్ పాసయ్యాను. స్కూలు విడిచిపెట్టి కాలేజీలో చేరాను.

అక్క ఉత్తరాలు రాస్తోంది; నేనూ రాస్తున్నాను. ఒకో ఉత్తరం చది

వితే—అక్క ఏదో బాధ పడుతోంది; నాదగ్గర ఆ విషయం దాస్తోంది, అనిపించేది. ఒకరోజు నా కాలేజి చిరునామాకి అక్క దగ్గర్నుంచి ఒక ఉత్తరం వచ్చింది. అది చదివిన మీదట – నా వూహ మరింత బలపడింది. 'నీ కక్కడ ఏ మాత్రం కష్టంగావున్నా వెంటనే బయలుదేరి ఇక్కడికి వచ్చెయ్....'– అని, నేను వెంటనే అక్కకి ఉత్తరం రాశాను. "నీ మనసులో ఏమైనా బాధవుంటే అది దాచిపెట్టవద్దు....నాకు అన్నీ వివరంగా రాయి...."– అని కూడా రాశాను. ఆ వేళ అక్కరాసిన ఉత్తరం చదివి నేను చాలా బాధపడ్డాను. ఆ ఉత్తరంలో అంతబాధపడాల్సిన విషయం ఏమీలేదు; కాని అక్క ఆ ఉత్తరం రాస్తూరాస్తూ ఏడిచిందేమో అనిపించింది నాకు. కొన్నికొన్ని అక్షరాలు కన్నీటి తడికి చెరిగి పోయినట్టుగా వున్నాయి. నేను ఉత్తరం రాసిన మూడు రోజులకి కూడా, అక్క దగ్గర్నించి సమాధానం రాలేదు. సుందరికి కూడా ఉత్తరం రాలేదు. అందువల్ల మే మిద్దరమూ కూడా బాధపడ్డాం.

నేనొకరోజు సుందరికి—అక్క నాకు రాసిన ఉత్తరంలో వున్న సంగతులు చెప్పాను.

ఆ వేళ సుందరి చాలా అందంగా కనబడుతోంది. నేను రెప్పవెయ్యకుండా ఆమెవంకే చూస్తున్నాను. సుందరి దృష్టి నామీద లేదు. ఏదో కూనిరాగంతీస్తూ– హఠాత్తుగా నావైపుచూసి – "అరె, భావూరావ్! నువ్వెప్పుడొచ్చావ్!"– అంటూ లేచి నిలబడింది. నేను కొంచెం సిగ్గుపడ్డాను. నేను లోపలికొచ్చేముందే పిలిచి, రావలసింది. కాని నేను సరాసరి లోపలికొచ్చేశాను. "అక్క అక్కడ సుఖంగా వుందోలేదో అనుమానంగా వుంది"–అన్నాను సుందరితో. "మీ ఉత్తరంలో గనుక అక్క ఉన్నదున్నట్టుగా అన్ని విషయాలూ రాస్తే, నాకు నిజమేమిటో చెప్పండి!"– అని కూడా అన్నాను.

నేను సుందరిని అప్పుడప్పుడూ కావాలని– 'మీరు,మీరు' అంటూవుంటాను. సుందరి ఏమీ మాట్లాడలేదు. ఆ తర్వాత మెల్లిగా, మధురంగా –"భావూరావ్! నేను నువ్వడిగిన ప్రశ్నకి సమాధానం అయిదురోజుల తర్వాత చెబుతాను; ఈలోగా ఏమి చెప్పలేను...."–అంది. ఆ తర్వాత సుందరి ఏమందో నేను సరిగా వినలేదు. తలుపు సందులోంచి ఎవరో తొంగిచూసినట్టనిపించింది. నేను

కోపంతో తలుపు తెరిచి చూద్దామని వెళ్ళేలోగా, ఆ వ్యక్తి అదృశ్యమైపోయాడు: నేను ఏదో అనబోయేలోగా- సుందరితల్లి వచ్చింది. నేను త్వరగా వచ్చివుండటం చూసి ఆమెకి కూడా ఆశ్చర్యం కలిగింది. "నువ్వెప్పుడే వచ్చావా?"- అంది ఆశ్చర్యపోతూ. నేను మాటమార్చాను. కొంతసేపటికి సుందరి నాన్నగారుకూడా వచ్చారు. నాకు మరోపావుగంట గనుక సమయం దొరికితే - సుందరిని అక్క-గురించి అంతా అడిగి తెలుసుకునేవాడిని. ఆ తర్వాత ఆదివారం-సుందరిని వొంటరిగా కలవడానికి అవకాశం దొరకలేదు. మూడురోజుల తర్వాత అక్క-దగ్గర్నించి నాకు ఉత్తరం వచ్చింది. విప్పిచూస్తే - లోపల ఉత్తరం నాపేర లేదు. అది సుందరి ఉత్తరం. అక్క- నాకూ సుందరికీ ఒకేసారి ఉత్తరాలురాసి, పొరపాటున సుందరి ఉత్తరం నాకూ, నా ఉత్తరం సుందరికీ పంపివుంటుంది. చాలా పెద్దదిగావున్న ఆ ఉత్తరం చూడగానే వెంటనే చదవాలన్న కుతూహలం కలిగింది.

## అక్క ఉత్తరం

ఉత్తరం చదవాలని నాకు చాలా ఆత్రంగా వుంది. కాని నా మనసులో వున్న సద్భావన నన్ను హెచ్చరించింది—'ఈ ఉత్తరం పొరపాటున నీకు వచ్చింది; ఇది నువ్వు చదవటం మర్యాదకాదు.' ఆ ఉత్తరం తీసికెళ్ళి సుందరి కిస్తూ— "ఒక షరతు మీద ఈ ఉత్తరం నీ కిస్తున్నాను; ఇందులో వున్న ప్రతి అక్షరమూ నువ్వు నాకు చదివి వినిపించాలి"—అన్నాను. నాపేర రావలసి వున్న ఉత్తరం సుందరి నాకు యిచ్చేసింది. అందులో—"నా గురించి నువ్వనుకుంటున్నది సరికాదు. నే నిక్కడ బాగానే వున్నాను. నా గురించి బెంగపెట్టుకోకుండా నువ్వు జాగ్రత్తగా చదువుకో. ఒకవేళ నా కేదైనా కాస్తయిబ్బంది కలిగినా, నువ్వు దాన్నిగురించి అంతగా బాధపడ నక్కర్లేదు"—అని రాసింది అక్క. ఉత్తరం చాలా క్లుప్తంగా వుంది. సుందరికి రాసిన ఉత్తరం మాత్రం చాలా

పెద్దది. అక్కడక్కడా అక్షరాలు కన్నీళ్ళుచింది చెరిగినట్టుగా వున్నాయి!

సుందరి ఆ ఉత్తరం శ్రద్ధగా చదవసాగింది. ఆమెవంక ఎప్పుడూ అదే పనిగా చూడ్డం బావుండదని, నేను నా ఉత్తరం మొహాని కడ్డంపెట్టుకొని, మధ్య మధ్యలో సుందరి వంక చూస్తున్నాను. మనసంతా అక్క సుందరికి రాసిన ఉత్తరం మీదే వుంది. సుందరి కళ్ళలో నీళ్ళు తిరగటం చూసి—ఉత్తరంలో ఏవో ముఖ్యమైన విషయాలే వున్నాయని పసికట్టాను. "నువ్వాఉత్తరం నాకు గనక యివ్వకపోతే—నేను వెంటనే వెళ్ళి అక్కని తీసుకొచ్చేస్తాను! ఆ తర్వాత ఏమైనా కానీ!"— అన్నాను సుందరితో మొండిగా. నేనలా అనడం చూసి సుందరి ఆశ్చర్యపోయింది. కాస్సేపటి తర్వాత మెల్లగా— "అక్క తన విషయాలేమీ దాయలేదు; కాని మనం చదువు పాడుచేసుకుంటామనే భయంతో ఆ విషయాలన్నీ మనకి చెప్పటం తన కిష్టంలేదు....ఇదుగో ఉత్తరం.... చదవండి....అక్కని ఈ పరిస్థితుల్లో తీసుకురావటమే మంచిదేమో...."—అని, ఉత్తరమిచ్చింది.

అక్క ఆ ఉత్తరంలో ముందు కొంతమేరకి—సుందరికి సంబంధించిన విషయాలేవో రాసింది. తర్వాత నా గురించి రాసింది.

"సుందరీ! మా అక్కా-తమ్ముళ్లిద్దరం బ్రతికున్నంతకాలం ఒకరికొకరం అండగా వుంటాం. నిజమే. కాని నా బాధలన్నీ వాడికి చెప్పటం నాకిష్టంలేదు. నా దౌర్భాగ్యపు జీవితంవల్ల, నా బాధలవల్ల వాడి చదువు పాడుకావటం నేను భరించలేను.

"ఉన్న సంగతులన్నీ రాస్తే, వాడు మనసు పాడుచేసుకుంటాడు. వాడు గొప్ప వాడు కావాలి; పెద్ద జీతగాడు కావాలి—అదే నా కోరిక. నా బాధలన్నీ వాడు ఆలోచిస్తే, చదువు మానేస్తాడు. అయిదు, పదిరూపాయల ఉద్యోగం చేస్తాడు. ఈ రకంగా వాడి భవిష్యత్తు పాడుకావటం నా కిష్టంలేదు....నా జీవితం నాశన మైనట్టే, వాడి జీవితంకూడా నాశనం కావటం నేను భరించలేను. మీ రిద్దరూ కలిసి గనుక ఏదైనా మంచి ఉపాయం ఆలోచిస్తే, దాని ప్రకారం నడుచుకో టానికి నేను సిద్ధంగా వున్నాను.

మామయ్య నన్ను ఎప్పుడూ ఏమీ అనడు. కాని అమ్మమ్మ, అత్త నన్ను

నానా మాటలూ అంటున్నారు. అత్తవారింటి యమయాతనలనుంచి బయట పడ్డానేగాని, యిక్కడా అంతకంటే దుర్భరంగానేవుంది, నా పరిస్థితి. "నువ్వు కళంకినివి ; మీ అమ్మా భర్తని వదిలేసింది; నువ్వూ వదిలేశావ్; భర్తల ఆజ్ఞ ప్రకారం భార్యలు నడుచుకోవాలి. ఏం చేసినా ఏం అన్నా సహించి వూరుకోవాలి. అంతేగాని సంసారపు గుట్టు అంతా బయట పెట్టుకొని భర్తల్ని విడిచి పెడతారా ! .... నువ్వు బయల్దేరావ్ .... మహా గొప్పదానివి ! .... దీని అమ్మదీ దీనిదీ ఒకటే బుద్ధి! గట్టిగా పట్టుపట్టి అత్తవారింటి కెళ్ళమంటే ఇది ఎక్కడ ఆత్మహత్య చేసుకుంటుందోనని దీని అమ్మ కూడా మాట్లాడకుండా వూరుకుంది. ఆత్మహత్య చేసుకోవటం అంతతేలికా!...."—అని తిట్టింది, అత్త ఒకనాడు నన్ను. ఆ పైన నేనింక వినలేకపోయాను. ఏడుస్తూ అవతలికి వెళ్ళి పోయాను. ఇంక ఈ కష్టాలు భరించలేను; ఏదో ఒకనాడు నా జీవితాన్ని నేను అంతం చేసుకోవాలి అని నిర్ణయించుకున్నాను....".

చాలా సేపటివరకూ ఆ పైన చదవలేక పోయాను. అక్క యిప్పటికే ఆఘాయిత్యం ఏమీ చెయ్యలేదుగదా? తర్వాత చదవటం ప్రారంభించాను—

"నా జీవితాన్ని నేను అంతం చేసుకోవడమనేది నిజంగా చాలా సాహసం; ఆ సాహసం నాలో లేదు. ఆ సాహసమే వుంటే ఎప్పుడో నే ఆపని చేసేదాన్ని. అమ్మగనుక ఏవిధంగా తన శీలాన్ని కాపాడుకుంటూ, లోక నిందలు లెక్క చెయ్యకుండా తన జీవితం గడిపిందో నేనూ ఆవిధంగానే చేస్తాను. నాకు చదువు మీద బాగా ఆసక్తి కలుగుతోంది. అందుకే యింత పెద్ద ఉత్తరం రాస్తున్నాను. నా వైవాహిక జీవితం మామూలు స్త్రీలవంటిది కాదని నేను గట్టిగా నిర్ణయించుకున్నాను. అందువల్ల, మరికొన్ని యితర మార్గాలవల్ల నా జీవితం గడపాలని నేను అనుకుంటున్నాను....!"

అక్క ఉత్తరంలో చివరి భాగం చదివి నేను ఆశ్చర్యపోయాను. నా ఎదట సుందరి నిలబడి వుందన్న సంగతే నేను మర్చిపోయాను. "అంతే అలాగే చేద్దాం....మన శక్తి ఏమిటో ప్రపంచానికి చూపుదాం.... ."—అన్నాను, నన్ను నేను మర్చిపోయి. సుందరి ఆశ్చర్యంగా నావంక చూడసాగింది. "ఇక ఆలోచించే సమయం లేదు....అక్కని తీసుకొచ్చి యిక్కడ స్కూల్లో చేర్పిద్దాం...."—

అన్నాను, మెల్లిగా.

"మీరు చెప్పేది నిజమే. కాని ఈ నిర్ణయం తీసుకునే ముందు మనం బాగా ఆలోచించాలి. అక్కని తీసుకురావటం మామయ్యకి యిష్టం లేకపోతే, అది ఆయన్ని అవమానించినట్లవుతుంది. అప్పుడాయన నెలనెలా పంపేడబ్బు పంపరు; ఇప్పుడు మనకి ఆయన పంపే డబ్బు చాలా అవసరం"- అందిసుందరి మెల్లిగా.

నేను ఆవేశంతో- "ఆయన నాకు పంపేడబ్బు నాకు అవసరమే. కాని అందుకోసం అక్కడ అక్క కష్టాలుపడటం నేను సహించలేను! మామయ్యకి కోపమొస్తే, నాకు డబ్బుపంపడం మానేస్తాడు. అంతేగా? అందుకు నేనేమి బాధ పడను!" అన్నాను.

నేను ఈ విధంగా అన్న తర్వాత, సుందరి ఒక అనుమానం వ్యక్తపరిచింది- "మనమిదంతా చేస్తే, దీనివల్ల అక్కకి నిజంగా సుఖంలభిస్తుందా? స్కూలు కెళ్ళేటప్పుడు ఆమె భర్త గనుక ఆమెనేమైనా బాధపెడితే"-అంది.

ఆ అనుమానం విని నేనుకూడా ఏమీ మాట్లాడలేకపోయాను. చివరికి- ఈ విషయాలన్నీ సుందరి నాన్నగారికి చెప్పాలనీ, ఆయన ఎలా చెబితే అలా చెయ్యాలనీ నిశ్చయించాం.

## తిరుగుబాటు

చివరికి నేను మామయ్యగారి వూరువెళ్ళి అక్కని తీసుకొచ్చేశాను. అప్పుడు మామయ్య యింట్లోలేడు. ఏదోవూరు వెళ్ళాడు. మామయ్య పేర ఒక ఉత్తరం రాసిపెట్టి, అందులో నా నిర్ణయం తెలియపర్చాను. అమ్మమ్మ, అత్తల్ని లెక్క చెయ్యకుండా అక్కని తీసుకొచ్చేస్తుంటే - "విత్తు ఎలాంటిదైతే పండూ అలాంటిదే అవుతుంది! తండ్రి దేశమంతా తిరిగి అడుక్కుతింటున్నాడు; ఇక వీడూ అదేపని చేస్తాడు":-అన్నమాటలు మా వెనకనించి వినిపించాయి.

అక్కని యింటికి తీసుకొచ్చేశాను. మూడు నాలుగు రోజులతర్వాత అక్క

కూడా సుందరి వెంట స్కూలుకి వెళ్ళటం ప్రారంభించింది. సుందరిద్వారా అక్క కథంతా విని స్కాలర్‌షిప్పు యివ్వడానికి ప్రధానోపాధ్యాయిని అంగీకరించింది. ఈ రకంగా మా ప్రయత్నాల ప్రారంభం బాగానే జరిగింది. సమస్యలేమీ రాలేదు.

ఉన్నట్టుండి ఒకనాడు మామయ్య దగ్గర్నించి ఉత్తరం వచ్చింది. మామయ్యకి నేను మామూలుగా ప్రతినెలా ఒక ఉత్తరం రాస్తూవుంటాను. అక్కని తీసుకొచ్చి దాదాపు నెలరోజులు కావస్తోంది. ఇప్పుడు మామయ్య ఉత్తరం చూసి నాకు ఆశ్చర్యం కలిగింది. మామయ్య ఈ రకంగా రాస్తాడని నేను ఎన్నడూ వూహించనైనాలేదు. నేనా ఉత్తరం పదేపదే చదివాను. చదివినకొద్దీ మామయ్యకి నామీదగల గౌరవం పెరగసాగింది. మామయ్య ఆ ఉత్తరం చాలాశాంతంగా, చాలా ప్రేమగా రాశాడు.

చదువుతూంటే ఆఉత్తరం శివరామ్‌పంత్‌గారే రాశారా అన్నట్టుగా వుంది. మామయ్యగురించి నేను వూహించుకున్నదంతా పొరబాటని తేలిపోయింది. మామయ్య అసలు ఉత్తరం రాయనేరాయడు; రాసినా అందులో మమ్మల్ని తిట్టిపోస్తాడూ అనుకున్నాను. ఉత్తరం చదివాక-మామయ్యకి అమ్మ అంటే ఎంత ప్రేమవుందో, అక్క అన్నా కూడఅంత ప్రేమ వుందనిపించింది. అక్క తెలివైంది; స్కూలుకెళ్ళి చదువుకుని, ఆచదువు ఆతర్వాత దాని జీవితాని కుపయోగపడితేమంచిదే; అని రాశాడు మామయ్య.

అక్కపట్ల ఆమెభర్త ఏమాత్రం ఆసక్తి చూపించకపోవటం అప్పుడప్పుడూ నాకు ఆశ్చర్యాన్ని కలిగించేది. ఇదేవిధంగా గనక అక్క చదువు పూర్తయిపోతే, ఆమె ఆశయాలు సఫలమౌతాయి, అనుకునేవాణ్ణి నేను.

చాలరోజులు ప్రశాంతంగా, ఏ గొడవాలేకుండా గడిచిపోయాయి. పరిస్థితులన్నీ యింత అనుకూలంగా వుండటం చూస్తే ఒక్కొకసారి మాకే యిది నిజమా కాదా అనిపించేది. ఒక్కొకసారి-ఈశాంతి అంతా రాబోయే భయంకరమైన తుఫానుకి నాందికాదుగదా అనికూడా అనిపించేది.

చివరికి అలాగే జరిగింది.

# చి వ రి కి

శనివారం కావటం వల్ల ఆరోజు సుందరికీ, అక్కడికీ శెలవు. శుక్రవారం సాయంత్రమే నేను సుందరి గారింటికి వెళ్ళాను. మాటల మధ్యలో వ్యాయామం ప్రసక్తి వచ్చింది. తెల్లవారుఝామున వీచేగాలి వొంటికి చాలా మంచిదన్నమాట వచ్చింది. రోజూ షికారుకి వెళ్ళటం ఎలాగూ కుదరదు; అందువల్ల శెలవు రోజునైనా పొద్దున్నే లేచి షికారుకి వెళ్ళాలీ అని నిర్ణయించుకున్నాం. చివరికి– అంతాకలిసి తెల్లవారుఝామునే షికారుకి వెళ్ళాలని నిశ్చయమైంది. మరునాడు తెల్లవారుఝామునే లేచాం. సూర్యోదయం కావటానికింకా చాలా వ్యవధివుంది. బయట చల్లగా హాయిగా వుంది. మా అందరి మనసులూ కూడ ప్రశాంతంగా వున్నాయి. మేం ముగ్గురమూ తొందరగా నడుస్తున్నాం. ఆ భార్యా భర్తలిద్దరూ వెనకబడ్డారు.

దగ్గర్లో ఒక చిన్న కొండవుంది. అక్కడినుంచి సూర్యోదయం చూస్తే బావుంటుందని మేము ముగ్గురమూ ఆ కొండమీది కెళ్ళి కూర్చున్నాం. తూరుపు దిక్కున ఆకాశంలో ఎరుపురంగు రకరకాలుగా మారుతూ, చూడ్డానికి అద్భుతంగా వుంది. ఆకాశంవంక చూస్తూ, మధ్య మధ్యలో స్నేహితురాళ్ళిద్దరూ కబుర్లు చెప్పుకుంటున్నారు. వాళ్ళ కబుర్లు వినటం నాకు హాయిగా వుంది. ఇంతలో ఒక తెల్లటి కుందేలు గెంతుతూ అక్కడి కొచ్చింది. చూడ్డానికి భలే ముద్దుగా వుంది. సుందరి దాన్ని చూస్తూ వుండిపోయింది. కిందనుంచి శివరామ్ పంత్‌గారు–మమ్మల్ని త్వరగా దిగిరమ్మని కేకవేశారు. ఆయనత్వరగా వెళ్ళాలని గుర్తొచ్చి, మేం కూడ త్వరత్వరగా కొండదిగి వచ్చి, తిరుగుదారి పట్టాం.

బజార్లో మనుష్యుల రాకపోకలు కొద్దిగా ప్రారంభమైనాయి. నా మనసు చాలా హాయిగా వుంది. నేను వొంటరిగా చాలాసార్లు షికారు కెళ్ళాను. కాని ఇవ్వాళటి అనుభవం వేరు!

నా మనసులో కొన్ని మధురమైన ఆలోచనలూ కోరికలూ ఉత్పన్నమైనాయి. ఆ కోరికలన్నీ నెరవేరాలంటే కష్టపడి కృషిచెయ్యాలి. అప్పుడే కన్నకలలన్నీ సఫలమవుతాయి. నా ఆలోచనల్లో నేను మునిగిపోయి

నడుస్తుండగా – ఇంతలో ఎవరో — "ఏమయ్యా భావూరావ్ ! నువ్వా ఈ పనులు మొదలెట్టావా ?"–అన్నారు. ఎవరా అని నేను పక్కకి తిరిగి చూశాను. మా బావగారి యింట్లో వుండే ఆ ముసలాడు అక్కడ నిలబడి వున్నాడు. వాణ్ణి చూడగానే నాకు కోపం వచ్చింది. అరికాలిమంట నెత్తికెక్కింది. "నీకు నువ్వు చేస్తున్న తప్పుడు పనులు బాగానే వుందొచ్చుగాని, ఇవన్నీ నీ వంశపు గౌరవ మర్యాదల్ని మట్టిలో కలుపుతాయి; మాకు అన్నివిషయాలూ తెలుస్తూనే వున్నాయి; ఇక చూస్తూ వూరుకోకూడదని మేం నిర్ణయించుకున్నాం; ఇదంతా ఏమిటి, మీ రెందుకూరుకుంటున్నారూ అని ప్రపంచమంతా మమ్మల్నడుగుతున్నారు !"– అన్నాడా ముసలాడు. ఆ నీచుడి మాటలు మౌనంగా ఎలా వింటున్నానా అని నాకే ఆశ్చర్యం కలిగింది. నేను మరికొంత సేపుగనక అక్కడుంటే ఏం చేసేవాడినో నాకే తెలియదు. వాడిని తందామనిపించింది. అయినా నిగ్రహించుకుని వింటూవూరుకున్నాను. ఆ ముసలాడు మళ్ళీ వాగటం మొదలెట్టాడు–"మా యింట్లోంచి దానంతట అదే పారిపోయిందని మే మందరికీ చెబుతున్నాం !"–అన్నాడు. అక్కడితో నా కోపం పరాకాష్ఠ నందుకుంది. వాడి పళ్ళు రాలగొడదామని కాలిచెప్పు తీసి పైకి ఎత్తాను. అది చూసి ముసలాడు రెండడుగులు వెనక్కి వేశాడు. కాని ఒక్క క్షణం నాలో వివేకం మేలుకుంది. ఇలాంటి పని నేను చెయ్యటమా అనిపించింది. ఎత్తిన చెయ్యి దింపేశాను. మాట్లాడకుండా అక్కడినుంచి వెళ్ళిపోయాను.

ఇంటి కెళ్ళగానే అక్క అడిగింది–"దార్లో ఆయన కలిశాడు గదా; ఏమన్నాడు? నువ్వెందు కలావున్నావ్:"–అని. నేనేమీ చెప్పలేక పోయాను. మౌనంగా అక్కడినుంచి, శివరామ్‌పంత్‌గారి గదిలోకి వెళ్ళిపోయాను. పుస్తకం తీసి ఏమైనా రాద్దామనుకున్నాను. బయటనుంచి సుందరి, అక్కల గుసగుసలు వినిపిస్తున్నాయి. ఇంతలో అక్క సరాసరి నేను కూర్చున్న చోటికి వచ్చింది. "భావూ : నిజం చెప్పు; ఇందాక ఆయన ఏమన్నాడు ? నేను దూరం నుంచి చూశాను; నేను అంతా వూహించుకున్నాను; కాని ఏం జరిగిందో నీ నోటితో చెప్పు...."–అంది. మే మిద్దరమూ మాట్లాడుతున్నప్పుడు–అక్క చాలా దూరాన వుంది. అంత దూరం నుంచి విషయం ఎలా పసిగట్టిందా అని నే నాశ్చర్య

పోయాను. "నువ్వు నా దగ్గర ఏమీ దాచవద్దు భావూ! మీ అమ్మ మూలాన మీ వంశం పాడైపోయిందని అనివుంటాడు; ఇంకేమన్నాడు? నువ్విలాంటి చిన్న చిన్న విషయాల గురించి అదేపనిగా ఆలోచించి మనసు పాడుచేసుకోవద్దు. ఎవరేమన్నా ఒక చెవితో విని, మరో చెవిలోంచి వదిలెయి. ఇలాంటి నిందలకి భయపడ్డం మానేశాను నేను. స్కూలు కెళ్ళేప్పుడు రోజూ ఎందరో ఎన్నో మాటలు అంటూ వుంటారు. ఒకరకంగా యిలాంటి వాళ్ళంతా మనకి మేలే చేస్తున్నారు. ఎందుకంటే ఇలాంటి మాటలు విన్నకొద్దీ మనలో మరింత దృఢత్వం ఏర్పడుతుంది!"— అంది అక్క గంభీరంగా.

అక్క మాటలు విని, నా ఆలోచనల పట్ల నాకు సిగ్గేసింది. మగాడినై వుండి కూడా ఆ మాత్రం మనోధైర్యం లేకపోయిందే అనిపించింది.

## మరో కొత్త సమస్య

ఒకనాటి పొద్దున కాలేజీకి నాపేర ఒక ఉత్తరం వచ్చింది. నా స్నేహితు డొకడు ఆ ఉత్తరం తెచ్చి నాకిచ్చాడు. ఆ ఉత్తరం చూసి నేను ఆశ్చర్య పోయాను. అది రావుగారు రాసిన ఉత్తరం :

"నేను చాలా రోజుల్నుంచి అక్కడికి రావాలనుకుంటున్నాను. ఈ మధ్య నా గ్రహస్థితి పూర్తిగా బాగుపడింది. త్వరలోనే నా పనులు పూర్తిఅవుతాయి; ఆర్థిక సమస్య అనేది యింక వుండదు. నేను నిన్ను ఐ.సీ.యస్. పరీక్షకి కూర్చోబెడతాను. బారిష్టర్ చదువుకి పంపుతాను. నువ్వు రెండూ చెయ్యగలిగితే యింకా మంచిది. ఇప్పుడింక డబ్బుకొరత లేదు. పని పూర్తయిపోగానే, పదివేల రూపాయలు నీ పేర బ్యాంక్‌లో వేస్తాను. నా వేళ్ళమీద తొమ్మిది శంఖాలున్నాయి; అందువల్లనే ఇన్నాళ్లూ ఈ యిబ్బందులన్నీ పడాలిసివచ్చింది. కాని ఒక వేలిమీద చక్రముండటంవల్ల ధనయోగముంది. కొన్నాళ్ళ క్రితం నేను మీ మామయ్యకి ఉత్తరం రాశాను. నువ్వు కాలేజీలో చదువుతున్నావని, బుద్ధి

మంత్రుడివయ్యావనీ రాశాడు. అది చూసి నాకు చాలా సంతోషం కలిగింది.

"అందుకే నిన్ను బారిస్టర్ పరీక్షకీ,ఐ.సీ.యస్. పరీక్షకీ పంపాలని నిర్ణయించు కున్నాను. విదేశాలకి కూడా పంపుదామనుకున్నాను. నేను అయిదారు రోజుల్లో అక్కడికొస్తున్నాను. నేను వచ్చేసరికి బహుశా నువ్వు కాలేజీలో వుంటావేమో; అందుకని నేను సరాసరి అల్లుడుగారింటికి వెళతాను. అక్కకి నేను వస్తున్న సంగతి చెప్పవద్దు........."—అని రాశారు.

విచిత్రమైన ఆ ఉత్తరం చూసి నేను గాభరాపడ్డాను. మళ్ళీ పెద్ద సమస్య రాబోతోందని వూహించుకున్నాను.

నే నీ సంగతి సుందరి నాన్నగారికి చెప్పాను. అక్కకి కూడా చెప్పాను. అక్క నిర్భయంగా—"ఇన్నాళ్ళనుంచి మనం చాలా మందికి భయపడుతూ బ్రతికాం. భయపడి భయపడి యిప్పుడు భయ మనేదే లేకుండా పోయింది. ఇప్పుడీ సమస్య వచ్చింది. రానీ ! అదీ చూద్దాం; అదీ త్వరలోనే గడిచిపోతుంది; మన మనసు నిర్భయంగా వున్నప్పుడు ఎన్ని విఘ్నాలైనా వూరికే గడిచి పోతాయి........."—అంది.

అక్క ధైర్యమూ, ఆత్మ విశ్వాసమూ చూసి నిజంగానే నేను చకితుడినై పోయాను. "స్త్రీలు అబలలంటారు కాని, అది పొరపాటు !"—అనిపించింది. అక్కపట్ల నాకున్న గౌరవం మరింత పెరిగింది.

## అనుకున్నంతా అయ్యింది

మేము నాన్నగారి కోసం ఎదురు చూస్తున్నాము. రాబోయే సమస్య నెదుర్కొ డానికి మానసికంగా మే మన్నివిధాలా సంసిద్ధులమయ్యాం. కాని—నాన్నగారు—బావగారింటికి వెళ్ళకుండా సరాసరి నాదగ్గర కొస్తేనే మంచిదనిపించింది. ఆయన వచ్చేనాడు స్టేషన్కెళ్ళి, అక్కడినుంచే నాతోపాటు తీసుకొస్తే బావుంటుందను కున్నాను. అయిదురోజులు వరసగా స్టేషన్కెళ్ళాను, కాని రావుగారు రాలేదు.

విసుగెత్తి యిక వెళ్ళడం మానేశాను. విచిత్రమేమిటంటే, నేను ఏరోజునైతే స్టేషన్‌కి వెళ్ళటం మానేశానో, ఆరోజునే రావుగారు రానూ వచ్చారు; బావగారింటికి వెళ్ళనూ వెళ్లారు!

అనుకున్నంతా అయ్యింది! నా గురించీ అక్కగురించీ లేని పోని మాటలన్నీ నాన్నగారికి చెప్పారు, అక్క అత్తవారింటివాళ్ళు. మరునాడు రావుగారు కాలేజీకి వచ్చారు. "సంఘ సంస్కర్తవై వంశపు పరువు తీస్తున్నావ్!"—అని ఆయన నన్ను దూషించాడు. నేను మాట్లాడకుండా వూరుకున్నాను. ఆయన నోటికొచ్చినట్లల్లా మాట్లాడుతూనే వున్నాడు. ఆ మాటలన్నీ విని నేను సహించి వూరుకోలేక పోయాను.

"మీరేం మాట్లాడుతున్నారు? ఆయన (శివరామ్‌పంత్‌గారు) మిమ్మల్ని ఏం చేశాడు? భర్త పెట్టే బాధలు భరించలేక అక్క నా దగ్గర కొచ్చింది. నేనే అక్కని తీసుకెళ్ళి వారి యింట్లో పెట్టాను; వారు అక్కకి ఆశ్రయమిచ్చారు. సహాయం చేస్తున్నారు. మీరా దగుల్బాజీల మాటలు విని యిలా మాట్లాడ్డం ఏమీ బాగాలేదు!"—అన్నాను ఆవేశంగా.

"ఏమంటావ్? అయన ఏంచేశాడంటావా?....ఆయన ఏంచెయ్యలేదు?.... అసలు అక్కవల్లే దాని భర్త అలా తయారయ్యాడు....!"

"అక్కవల్లే బావగారంత నీచంగా తయారయ్యాడనా మీ ఉద్దేశ్యం? మొగుడు యింట్లో పెట్టుకున్న వేశ్యల పాదాలు వొత్తడం; వాళ్ళ చీరలు ఉతకడం, ఇలాంటి పనులన్నీ కూడ అక్క చేసింది. చాలా సార్లు దెబ్బలు కూడా తింది!"

ఆవేశం ఎక్కువైనందువల్ల ఆపైన యిక మాట్లాడలేకపోయాను నేను. కోపంతో, ఆవేశంతో నా శరీరమంతా నిలువెల్లా వణికిపోతోంది.

నా మాటల ప్రభావం రావుగారి మనసు మీద కొద్దిగా పడినట్టే కనిపించింది. కాని అదికేవలం నా భ్రమే! "మాటలు బాగా నేర్చావ్! ఇదంతా ఏ వెధవ నేర్పాడు నీకు? .... పిల్లని మాట్లాడకుండా అత్తారింటికి పంపెయ్యి.... అది వెళ్ళకపోయిందా బలవంతాన పంపాల్సి వస్తుంది....!" —అన్నాడాయన కోపంగా.

నేనింకా ఎక్కువ మాట్లాడదల్చుకోలేదు. ఒక్కటే ఒక్కమాట అన్నాను—

"ఇక నానోటితో నేనేమీ చెప్పను .... మీరు అక్కని కలుసుకుని మాట్లాడండి...." — అన్నాను. దాంతో రావుగారు మరీరెచ్చిపోయాడు. "వెధవా! నువ్వేంమాట్లాడుతున్నావో నీకుతెలుసా? తాగివచ్చావా? అసలు నువ్వు కాలేజీకి వెళ్ళాల్సిన అవసరమేముంది? కాలేజీకొచ్చి యివన్నీ నేర్చుకున్నావా? ఈ బుద్ధులన్నీ ఆదగుల్బాజీ గురువేనా నీకునేర్పింది....!" — అన్నాడు.

చివరికి ఆయన కేవలం తిట్లుతిట్టడం ప్రారంభించాడు. శివరామ్ పంత్‌గారి దగ్గరకెళ్ళి అక్కతో మాట్లాడతానన్నాడు. మర్యాదగాగనక ఒప్పుకోకపోతేచావగొట్టి అత్తారింటికి పంపుతాడట! నాన్నగారు ఈ రకంగా మాట్లాడతాడని నేను ముందే వూహించాను. ఈ మాటలన్నీ అక్కకిచెప్పి, ముందుగానే హెచ్చరించాలనుకున్నాను.

నాన్నగారు కాస్సేపు ఇంగ్లీషు చదువుల్ని తిట్టారు. చివరికి — "ఇవ్వాల్టితో నీకూనాకూ ఋణం తీరిపోయింది; నేను నీకొక్క గుడ్డిగవ్వయినా యివ్వను!" — అనికూడా అన్నారు.

నేను అనుకున్నట్టుగానే రావుగారు అక్కదగ్గరకి వెళ్లారు. అక్క తన మనసులోనే ఒక నిర్ణయం చేసుకుని, కావాలనే స్కూలుకి వెళ్ళకుండా యింట్లో కూర్చుంది. రావుగారితో మూడు నాలుగుగంటలసేపు మాట్లాడింది. ఏం మాట్లాడిందో నాతో చెప్పలేదు. కాని అక్క తన నిర్ణయం విడనాడలేదు. అయినాకూడా రావుగారు మర్నాటిరాత్రి ఆదుర్మార్గుల్ని వెంటబెట్టుకొచ్చి సుందరి నాన్నగారిని బాగాతిట్టారు. సుందరినికూడా తిట్టారు. శివరామ్‌పంత్‌గారు శాంతమూర్తి. అయినా ఆయనకూడ ఈ గొడవవల్ల బాధపడ్డారు. చివరికి నాన్నగారితో — "మీ అమ్మాయిని మీరు తీసుకెళ్ళిపొండి; నిస్సందేహంగా తీసుకెళ్ళిపొండి....!" — అనేశారు. అక్క బాధ ద్విగుణీకృతమైంది. నాన్నగారితో — "మీరీవిధంగా ఆయన్ని అవమానించటం నేనుసహించలేను. పదండి, మీతో వస్తానుపదండి; వచ్చి ఆయింటి గడపమీద తల పగలగొట్టుకొని ఛస్తాను! అప్పుడు నావల్ల మీకొచ్చిన కళంకం తొలిగిపోతుంది. అందరి కష్టాలూ దూరమై పోతాయి; మీవల్లనే అమ్మప్రాణాలు విడిచింది; ఇప్పుడు నేనుకూడా ఆపనే చేస్తాను....!" — అంది.

అక్క భయంకరరూపం చూసి, అదుర్మార్గులేమీ చలించకపోయినా, నాన్న గారు కొద్దిగా చలించారు. మౌనంగా అక్కణ్ణించి వెళ్ళిపోయారు. తన వల్ల శివరామ్‌పంత్‌గారికి మాటరావటం అక్కకి నచ్చలేదు. నన్ను రమ్మని కబురు చేసింది. నేను వెంటనే శివరామ్‌పంత్‌గారి యింటికి వెళ్లాను. నేను వెళ్ళే సరికి సుందరి స్కూల్‌కి వెళ్ళింది. వాళ్ళమ్మకూడా ఎక్కడికో బయటి కెళ్ళింది. ఇంట్లో అక్క ఒక్కతే వుంది. నేను వెళ్ళగానే, గతరాత్రి జరిగిన విషయాలన్నీ అక్క నాతో చెప్పింది. చెప్పి, బాధగా-"భావూ! నా జీవితమంతా ఈ విధంగా మరొకరికి కంటకప్రాయంగా గడిచిపోవలసిందేనా? అమ్మవున్నంత కాలం, అమ్మనావల్ల బాధపడింది; అమ్మమ్మ; అత్త; మామయ్యా నావల్ల బాధ పడ్డారు; చివరికి శివరామ్‌పంత్‌గారి వంటి మహానుభావుడుకూడా నావల్ల మాటలు పడాల్సివచ్చింది. ఆయన్ని ఇంతకుముందు ఎవరూ ఈ విధంగా దుర్భాషలాడ లేదు. కాని నావల్ల ఆయనకూడా తిట్లు తినవలసి వచ్చింది. భావూ, శివరామ్ పంత్‌గారు ఎంత మంచివారు! మనకి ఎంత ఉపకారం చేశారు! జన్మంతా ఆయన సేవ చేసినా మన రుణం తీర్చుకోలేం. నావల్ల ఆయనకికూడా అవమానం జరిగిందిగదా అని రాత్రంతా కుళ్ళికుళ్ళి ఏడిచాను. శివరామ్‌పంత్‌గారు ఏమన్నారో తెలుసా భావూ? "నాకూతురు ఈస్థితిలో వుంటే నాకూతురినైనా నాయింట్లో పెట్టుకునేవాడిని. నాకుతురు అత్తవారు నన్నుతిడితే అవన్నీ సహించేవాడిని కాదా? నువ్వు నా పెద్దకూతురిలాంటి దానివి; నీవల్ల నాకే మాత్రం అవమానం జరిగినా ఫర్వాలేదు" – అన్నారు. ఆ విధంగా ఎవరంటారు భావూ? అలాంటి వ్యక్తి మనకింకా ఎవరుదొరుకుతారు? మన వల్ల ఆయనకింకా ఎన్నాళ్ళని ఈబాధలు? ఎక్కడికైనా దూరంగా వెళ్లిపోయి,ఏ కూలోనాలో చేసుకుని బ్రతుకు దామనిపిస్తూ వుంటుంది అప్పుడప్పుడూ. నిన్నేగనక ఆయన స్థానంలో మరొక రెవరైనా వుంటే – "నీవల్ల నేనెందుకు తిట్లుపడాలి? మా యింట్లోంచి వెళ్ళిపో"– అని మెడబెట్టి బయటకు గెంటేసేవారు!" – అంది.

## పూనా నుంచి నిష్క్రమణ

అక్కకి ఏమని సమాధానమివ్వను? అక్క చెప్పిందంతా అక్షరాలా నిజమైంది. నిజంగా శివరామ్‌పంత్‌గారిని ఎన్నాళ్ళని బాధపెడతామన్న ఆలోచన నాకూ వచ్చింది. మాకు తెలిసిన సంఘసంస్కర్తలు కొందరున్నారు. వారిలో కొందరు అక్కని బొంబాయి పంపమని సలహాయిచ్చారు. అక్కడ యిలాంటి అనాథస్త్రీలకి ఆశ్రయమిచ్చేవ్యక్తి ఒకాయన వున్నాడట. మరికొందరు మిషనరీల బోర్డింగ్‌కి పంపమన్నారు. ఇవన్నీ విని నాకు కోపమొచ్చింది. ఎవడికివాడు-అక్కడికెళ్ళు, ఇక్కడికెళ్ళు అని చెప్పేవాడేగాని నేను సహాయం చేస్తానూ అన్నవాడు ఒక్కడూ లేడు. ఒక వ్యక్తి శివరామ్‌పంత్‌గారి దగ్గరకొచ్చి, క్రైస్తవుల్ని బాగా పొగిడి, అక్కని వాళ్ళ దగ్గరకి పంపమని చెప్పాడు.

నాకూ అక్కకీ ఈ మాటలన్నీ విని చాలా బాధ కలిగింది; కోపంకూడా వచ్చింది. ఇకముందు ఏం చెయ్యాలి? మాయిద్దరికీ అదే ఆలోచన పట్టుకుంది. నాన్నగారు; బావగారు; ఆయన యింట్లో వుండే ఆ దుర్మార్గులూ ముందు ముందు ఏంచేస్తారోనన్న ఆలోచనలతో మా తలలు పగిలి పోతున్నాయి. శివరామ్‌పంత్ గారికికూడా మాగురించి ఆలోచన పట్టుకుంది. చదువుమానేసి ఎక్కడికైనా దూరంగా అక్కని తీసుకెళ్ళి, అక్కడ ఏదైనా చిన్న ఉద్యోగంచేసుకు బ్రతుకుదామన్న ఆలోచనవచ్చింది నాకు. ఇంటికి నిప్పంటుకుంటే-ఇంట్లో వున్నవాళ్ళు నలువైపులా పరుగెత్తినట్టుగావున్నాయి-నామనసులో ఆలోచనలు. ఏంచెయ్యాలో తోచటంలేదు. పూనా నుంచి వెళ్ళిపోవటం ఒక్కటే మార్గంగా కనిపిస్తోంది.

ఆ తర్వాత, రావుగారు మళ్ళీ రాలేదుగాని, ఆయన దగ్గర్నించి తిట్లుతిడుతూ కబుర్లుమాత్రం వస్తూనే వున్నాయి. ఆ విధంగా వారంపదిరోజులు ఆయన దగ్గర్నించి కబుర్లు వచ్చాయి. ఆయనసలు యిక్కడ లేడేమో, ఆయన పంపినట్టుగా మరెవరైనా ఈ వర్తమానాలు పంపుతున్నారేమోనన్న ఆలోచన వచ్చింది నాకు. చివరికొకనాడు ఒకవార్త వచ్చింది - రావుగారు రేపు ఉదయం వచ్చి, బలవంతాన అక్కని అత్తవారింటికి తీసుకెళతారని. నిజమే అయి వుంటుంది. ఆ దుర్మార్గులు తల్చుకుంటే అంతపనీ చెయ్యగలరు. ఈ రాత్రే

అక్కని తీసుకుని ఎక్కడికైనా వెళ్ళిపోదామని నిశ్చయించుకున్నాను. కొస్త డబ్బుతీసుకుని ప్రయాణసన్నాహాలు ప్రారంభించాం. శివరామ్‌పంత్‌గారు కూడ కొస్త డబ్బుయిచ్చారు. ఆరాత్రే బొంబాయి వెళ్ళే బండి ఎక్కికూర్చున్నాం.

## గుప్త పరోపకారం

మర్నాడు ఉదయానికి బొంబాయి చేరుకున్నాం. శివరామ్‌పంత్‌గారు తన మిత్రుడి కివ్వమని ఒక ఉత్తరమిచ్చారు. మేము ఆయన యింటికి వెళ్ళాం. మధ్యాహ్నం ఆయన యింట్లోని ఒక వ్యక్తిని తీసుకుని బొంబాయిలోని భూలేశ్వర్; మాధవబాగ్ మొదలైన ప్రాంతాలకి వెళ్ళాను. అంత జనాన్ని నేనెన్నడూ చూడలేదు. చిన్నతనంలో ఎప్పుడైనా చూశానేమో గుర్తులేదు. జనాన్ని అలాగే చూస్తూవుండగా నాకొక విచిత్రమైన అనుభూతి కలిగింది. అలాగే జనాన్ని చూస్తూ వుండిపోయాను. ఇంటికొచ్చి అక్కకి నేను చూపిందంతా చెప్పాను. శివరామ్‌పంత్‌గారికి కూడా ఉత్తరం రాశాను— "భూలేశ్వర్‌లో మార్వాడీ బజార్లో నాన్నగారు కనిపించారు!" ఏ వ్యక్తివల్ల మేం పూనా విడిచిపెట్టి వచ్చామో, ఆ వ్యక్తే బొంబాయిలో వున్నాడు! ఏం చెయ్యడమా అని అక్కా నేనూ ఆలోచించసాగాం. బొంబాయిలోకూడ నాన్నగారు అలాగే చేస్తే మేం బొంబాయికూడా విడిచి వెళ్ళిపోవలసివస్తుంది. ఒక్కోసారి అలాగే జరుగుతుంది. ఎటువైపునుంచి మనకేమీ యిబ్బంది వుండదనుకుంటామో, ఆ వైపునుంచే సమస్యలు ఎదురౌతాయి!

అటు పూనా తిరిగి వెళ్ళలేకుండానూ, యిటు బొంబాయిలోనూ వుండ లేకుండానూ వున్నాం మేము. చివరికి నాన్నగారు ఎక్కడైనా కనబడతారేమో, కనబడితే అన్ని విషయాలూ అడిగేద్దామన్న నిర్ణయానికొచ్చాను నేను. నాన్న గారు నాకు కనబడిన ప్రాంతానికి వెళ్ళి తెగ వెదికాను. కాని నాన్నగారు ఎక్కడా కనబళ్ళేదు. మూడోరోజున శివరామ్‌పంత్‌గార్ని దగ్గర్నుంచి ఉత్తరం

వచ్చింది. నాన్నగారూ బావగారూ బాగా పోట్లాడుకున్నారని అందులో రాశా రాయన. ఆ సంగతి మాకు ఆనందాన్ని కలిగించింది. ఇక నాన్నగారి వైపు నుంచి మాకేమీ ఇబ్బంది వుండబోదని సంతోషించాం. అందువల్ల మేం తిరిగి పూనా వెళ్ళిపోయాం. బావగారి తరపు దుర్మార్గులు మమ్మల్ని ఇబ్బంది పెట్టా లని ఒకటి రెండుసార్లు ప్రయత్నించారు గాని, మేం వాళ్ళని లెక్కచెయ్యలేదు. ఈ రకంగా ఆ సమస్య కొద్దిగా పరిష్కారమైనట్టే వుంది.

రెండు మాసాలు గడిచాయి. నేను కాలేజీలో వుండగా పోస్ట్‌మాన్ ఒక రిజిస్టర్డ్ కవరు తెచ్చియిచ్చాడు. ఎక్కడినుంచా అని నేను ఆశ్చర్యపోయాను. సంతకం చేసి కవరు తీసుకున్నాను. విప్పిచూశాను.

కవరు లోపల రెండు పదిరూపాయలనోట్లూ, ఒక అయిదు రూపాయలనోటూ వున్నాయి. ఒక ఉత్తరం కూడావుంది. "మీవల్ల లాభం పొందిన ఒక మిత్రుడు మీకీ డబ్బు పంపుతున్నాడు; మీరు ఆశ్చర్యపోవచ్చు; కాని ఇప్పుడూ యిక ముందూ కూడా మీరీ డబ్బుని రుణంగానే భావించండి. మీ పరిస్థితులు బాగుపడగానే నేనే స్వయంగా వచ్చి ఈ డబ్బంతా తీసుకుంటాను. ఈ మిత్రుడి సహాయాన్ని కాదనరని ఆశిస్తున్నాను...."-అని రాసివుంది వుత్తరంలో. రాసిన వ్యక్తి సంతకంలేదు. ఆదస్తూరి ఎవరిదో గుర్తుపడదామని ఎంత ప్రయ త్నించినా లాభం లేకపోయింది. నా కిదంతా ఏదో నవలలోని సంఘటనలా అనిపించింది. శివరామ్‌పంత్‌గారి దగ్గర కెళ్ళి యిదంతా చెప్పాను. ఆయన నాకు మరో విచిత్రమైన సంగతి చెప్పారు. ఆయనకీ యిలాంటిదే మరో ఉత్తరం వచ్చింది.

"మీ ఉదారస్వభావం; త్యాగబుద్ధీ నాకుతెలుసు. మీలో వున్న ఉత్తమ గుణాల్ని గుర్తించేవారు ఎవరూలేరని మీరు భావించకండి. ఇలా డబ్బు పంపు తున్నందుకు అన్యథా భావించకండి. ఈ డబ్బు నా దగ్గరవున్నదానికంటే మీ దగ్గరవుంటే సద్వినియోగం జరుగుతుందనే వుద్దేశ్యంతోనే యిలాపంపుతున్నాను. ఈ డబ్బు ఎవరిదగ్గర్నించి వస్తోందో తెలుసుకోవడానికి ప్రయత్నించ కండి;" – అని వుందా వుత్తరంలో.

నాకు వచ్చిన ఉత్తరంలోనూ, శివరామ్‌పంత్‌గారికి వచ్చిన ఉత్తరంలోనూ

దస్తూరి వేర్వేరుగా వుంది. అక్క రెండు ఉత్తరాలూ పక్కనబెట్టి పరీక్షగా చూసింది. నాకురాసిన ఉత్తరం ఎవరో స్త్రీ దగ్గర్నుంచి వచ్చిందని అక్క నిర్ణయించింది. ఏ ఆధారాలవల్ల అక్క అలా చెప్పగలిగిందో నాకు తెలి యదు. ఉత్తరం రాసేవ్యక్తి ఒకచోట తన గురించి స్త్రీ వచనంవాడి, అది కొట్టేసి పురుష వచనంగా మార్చినట్టు అక్క పసిగట్టింది. ఉత్తరం రాసిన వ్యక్తి పురుషుడో స్త్రీయో తెలిసినంతమాత్రాన ఏంలాభం? అక్క మరో విచిత్రమైన విషయం కూడా వూహించింది – 'ఈ రెండు వుత్తరాలు రాసిన వాళ్ళు భార్యాభర్తలైనా అయివుండాలి; లేదా అన్నా చెల్లెళ్ళయినా అయివుండాలి'– అని. ఆ ఉత్తరాల గురించి ఆలోచించి, ఆలోచించి బుర్ర వేడెక్కి పోయింది. చివరికి – "ముందు ఏం జరుగుతుందో చూద్దాం" – అనుకున్నాం. మరుసటి నెల అదే తారీకున మళ్ళీ నాకు అంతే డబ్బు అలాగే వచ్చింది. కాని ఉత్తరం లేదు. శివరామ్‌పంత్‌గారికి కూడా అలాగే వంద రూపాయలు వచ్చాయి. వాటితో పాటు ఆయనకీ ఉత్తరమేమీ రాలేదు.

## ప్రశాంతత

అలా ఆ డబ్బురావటం ప్రారంభమైనప్పట్నుంచీ మాకు భాగ్యోదయం కలిగి నట్లయింది. ఆరోజునుంచీ ఎవరినుండీ ఏ విధమైన ఇబ్బందీ కలగలేదు. నేను కాలేజీకి వెళుతున్నాను. నా చదువు నిర్విఘ్నంగా సాగుతోంది. అన్ని పరీక్షల్లోనూ మంచి మార్కులు తెచ్చుకుంటున్నాను. చదువు పూర్తికావచ్చింది. ఆఖరి పరీక్షలు దగ్గరకొచ్చాయి. అక్క, సుందరీకూడా బాగానే చదువుతున్నారు.

శివరామ్‌పంత్‌గారు ఇదివరకు మాకేమైనా చెబితే, అది ఉపదేశరూపంలో వుండేది. కాని యిప్పుడు మాతో ఒక స్నేహితుడిలా మాట్లాడుతున్నారాయన. ఆవేళ శనివారం. శివరామ్‌పంత్‌గారు ఆఫీసునుంచి సరాసరి కాలేజీకి వచ్చారు. ఇద్దరం కలిసి బయటికివచ్చాం. సాయంత్రపు సమయం. వాతావరణం చల్లగా

హాయిగావుంది. శివరామ్‌పంత్‌గారితో తీరిగ్గా మాట్లాడి చాలారోజులైంది. ఇప్పుడా అవకాశం దొరికినందుకు నాకు చాలా సంతోషంగావుంది. ఇద్దరం మాట్లాడుకుంటూ నడుస్తున్నాం. ఇంతలో నాకొక విషయం గుర్తొచ్చింది. నాకొక మిత్రుడున్నాడు.తనని శివరామ్‌పంత్‌గారికిపరిచయం చెయ్యమని అతను చాలరోజులుగా నన్ను అడుగుతున్నాడు.కాని నాకవకాశంలేకా,మర్చిపోవటం వల్లా నేనిప్పటి దాకా ఆపనిచెయ్యలేకపోయాను. శివరామ్‌పంత్‌గారికి అతని గురించి చెప్పాను. అతనుకూడా నాలాగే కష్టాల్లో వున్నాడు.అతనికొక విధవ చెల్లెలుంది. అత్తవారు ఆవిణ్ణి నానాబాధలూ పెడుతున్నారు.ఆవిడ దుర్దశ చూస్తే, అక్క పరిస్థితి చాలా మెరుగేమో అనిపిస్తూ వుంటుంది నాకు. నా మిత్రుడి కథంతావిని – "ఎవరతను?"– అని అడిగారు శివరామ్‌పంత్‌గారు. "కొల్హాపూర్ వైపువాడు; ఒకరోజు మీదగ్గరకి తీసుకొస్తాను. మీకేమీ అభ్యంతరం లేదుగదా?"–అని అడిగాను. "ఇందులో అభ్యంతరమేముంది? కాని అతను నాదగ్గరకొచ్చి ఏంచేస్తాడు?"– అన్నారాయన నవ్వుతూ. నేనుకూడా నవ్వుతూ నే– "బహుశా తన చెల్లెలికికూడా మీ ఆశ్రయం సంపాదించాలని వున్నట్టుంది అతనికి...."– అన్నాను.

కొంతసేపాగి–శివరామ్‌పంత్‌గారు గంభీరంగా – "బావూ! నువ్విప్పుడు పెద్దవాడివయ్యావ్; పరీక్షలు పూర్తయ్యాక, ఏంచేద్దామనుకుంటున్నావ్?" – అని అడిగారు.

అకస్మాత్తుగా ఆయనలా అడగటం విని నేను కాస్త సందిగ్ధావస్థలో పడ్డాను. నామనసులో ఒక ఆలోచనవుంది. అదే చెప్పాను. "నాకు దేశసేవచేద్దామని వుంది; నామిత్రుడికి కూడా అదే వుద్దేశ్యముంది...."–అన్నాను.

"నీ ఉద్దేశ్యం బాగానే వుంది. కాని నీ ఆశయాన్ని ఏ విధంగా ఆచరణలో పెట్టాలో ఏమైనా ఆలోచించావా? బావూ! మనదేశం పరాధీనమైవుంది. దేశసేవ చెయ్యాల్సిన అవసరం ఎంతయినా వుంది. ఇల్లుకట్టేముందు ప్లాను; డబ్బు ఎలా సమకూర్చుకుంటామో యిలాంటి పనులకి కూడా ఒక పథకం వుండాలి. దేశ సేవ; సంఘసంస్కరణ; స్వాతంత్ర్యం–ఇలాంటి మాటలన్నీ చాలా తియ్యగావుంటాయి. చాలా తేలిగ్గా కనబడతాయి. కాని–ఇవన్నీ ఎంత ముఖ్యమైన విషయాలో, ఎంత గంభీరమైన విషయాలో ఎవరూ ఆలోచించరు!"–అన్నారు శివరామ్‌పంత్‌గారు.

"దేశసేవ నువ్వు ఏరకంగా చేద్దామనుకుంటున్నావో చెప్పు"- అని నన్నడిగారు.

నేను మౌనంగా వుండటం చూసి మళ్ళీ ఆయనే చెప్పడం ప్రారంభించారు. "భావూ! నువ్వు విద్యార్థివి; విద్యార్ధి దశలో చాలామంది- ముందు ముందు సుఖంగా జీవితం గడపాలనీ, డాక్టర్లుగానో, లాయర్లుగానో, మరో వున్నత వుద్యోగంలోనో వుండాలనీ ఆశిస్తారు; కాని తమతోపాటు దేశంగురించి ఆలోచించేవాళ్ళు, దేశసేవలాంటి సత్కార్యాలు చెయ్యాలనుకునేవాళ్ళు చాలా తక్కువమంది వుంటారు."

"ఆలోచించి నడిచే మార్గానికీ ఆలోచించకుండా నడిచే మార్గానికీ చాలా తేడా వుంది. అందువల్ల జీవితంలో ఏపని చేసినా, ముందు బాగా ఆలోచించుకుని చెయ్యాలి. ఒక ధ్యేయమూ, లక్ష్యమూ వుండాలి...."

"నేను సుందరికి పెళ్ళిచెయ్యకుండా వుంచడానికి ఒక పెద్ద కారణముంది. మీ అక్కని చదివించడానికికూడా అలాంటి కారణమే వుంది. ఇద్దరూ కూడా యిన్నాళ్ళూ నా ఆశయాలకి అనుగుణంగానే నడిచారు. ఎన్నోప్రతికూల పరిస్థితులున్నప్పటికీ కష్టపడి చదువుకున్నారు. ఇద్దరూ కూడ ముత్యాల్లా నిర్మల మైనవాళ్ళు. సుందరికి నీ అక్కలాంటి స్నేహితురాలు లభించటం కూడా సంతోషించదగ్గ విషయమే!"

## ప థ క ం

శివరామ్‌పంత్‌గారు మాట్లాడుతూ మాట్లాడుతూ మధ్యలో చాలసేపు ఆగి పోయారు. ఆయాన మొహం గంభీరంగా మారిపోయింది. ఆయన ఎప్పుడూ శాంతస్వభావుడే. కాని యిప్పుడాయన మొహం - అస్తమిస్తున్న సూర్య బింబంలా అతిగంభీరంగా వుంది. గౌరవం; భక్తి; ప్రేమ - ఈభావాలన్నీ ముప్పిరిగొనగా ఆశ్చర్యంగా నేనాయనవంక చూస్తూ వుండిపోయాను. ఆయన మళ్ళీ చెప్పడం ప్రారంభించారు - "మనం చెయ్యాలనుకునే సంస్కరణ కేవలం

బాహ్యపరిస్థితులకే పరిమితమై వుండకూడదు. వ్యాధికిగల బీజాన్నే నిర్మూలించాలి!''

''నాకొక సంగతి గుర్తుకొస్తోంది. ఇదివరకు నాకొక స్నేహితుడుండేవాడు. మేమొకనాడు యిలాగే బొంబాయిలో, గేట్‌వే ఆఫ్ యిండియా ప్రాంతంలో కూర్చుని మాట్లాడుకుంటున్నాం. ఆవేళకూడా యిలాగే సాయంత్రం. చాలాసేపు సూర్యాస్తమయాన్ని చూస్తూకూర్చున్నాం. ఇది జరిగి ఇరవైసంవత్సరాలకిపైగా అయింది. అప్పుడు మేమిద్దరం యువకులం. ప్రపంచాన్ని వూపివేసే పనులేవైనా చెయ్యాలని ఉనుకుంటూ వుండేవాళ్ళం.

మేమిద్దరంకూడా ఆర్థికంగా అంతశక్తి లేనివాళ్ళం. కాని ఆలోచనలకి మాత్రం ఎమీతక్కువుండేది కాదు. ఆచరణసాధ్యమైన విషయాలు వదిలేసి ఎవేవో కలలు కంటూవుండేవాళ్ళం. మాయిద్దరికీ వివాహాలైనాయి. మా భార్యలు యింకా పుట్టింట్లోనే వున్నారు. ఆతరువాత చాలారోజులకి మేం మళ్ళీకలుసుకున్నాం. మా వెనుకటి ఆలోచనలన్నీ తల్చుకుని నవ్వుకున్నాం. నా మిత్రుడు — మన యిద్దరి పరిస్థితీ ఒకే రకంగా వుంది. ముందు మనం మన భార్యల సంగతి ఆలోంచిచాలి వాళ్ళు రోజంతా యింటి పనులు చేస్తూవుంటారు. వాళ్ళకి విశ్రాంతిదొరికే కాస్తసమయంలోనూ మనం చదువుచదువని వాళ్ళని వేధిస్తూవుంటాం. అలాకాకుండా ముందు వాళ్ళకి చదువంటే ఆసక్తి కలిగేలా చెయ్యాలి....నాకు గనక ఆడపిల్లపుడితే, పెళ్ళిచెయ్యకుండా బాగా చదివిస్తాను. ఆ తర్వాత — 'ఇంటింటికీ వెళ్ళి ఆడవాళ్ళకి చదువుచెప్పు. అదే దేశసేవ' - అని నాకూతుర్ని పంపుతాను.''— అన్నాడు. అతని అభిప్రాయాలు విని నాకు నవ్వొచ్చింది. వెర్రివాడిలా మాట్లాడుతున్నాడనుకున్నాను.

అతను నవలలు ఎక్కువగా చదువుతూండేవాడు. అందువల్ల నేనతన్ని అటపట్టించేవాణ్ణి. నీ ఆలోచనలన్నీ కేవలం కలలేగాని, ఆచరణయోగ్యంకావు. అనేవాణ్ణి. అతనికి 'తుమ్మెద' అనిపేరు కూడా పెట్టాను. ఆ రాత్రే నా మిత్రుడికి విషజర్వం సోకింది. తొమ్మిది రోజులు ఆ జ్వరంతో బాధపడి, పదో రోజున కన్నుమూశాడు. ఆతొమ్మిది రోజులూ అతని పక్కనే వున్నానునేను. జ్వరంలో ఏదో వాగుతూ వుండేవాడు. మరణించే ముందు — ''ఇక నా పని

అయిపోయింది....అంతా నువ్వే చెయ్యాలి....'' - అని అస్పష్టంగా గొణిగాడు. ఈ విశాల ప్రపంచంలో నన్నొక్కణ్ణీ వదిలేసి నా మిత్రుడు వెళ్లిపోయాడు. నా మీద ఎంతో భారం మోపివెళ్లాడు. అతను తల్లిదండ్రులకి ఒక్కడే కొడుకు. అతని భార్య చిన్నది. వాళ్ళకతని మరణవార్త కూడా నేనే అంద జెయ్యవలసివచ్చింది. వాళ్ళకి కూడ నా చేతనైన సహాయం చెయ్యాలను కున్నాను. కాని నాకా అవకాశం కూడా లభించలేదు. అతను మరణించిన నెలరోజుల్లోగానే - అతని భార్య, తల్లి, తండ్రీ కూడా ఈ లోకాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయారు. ఈ సంఘటనలన్నీ నా మనసు మీద చెరపరాని ముద్ర వేశాయి.

నా మిత్రుడు మాటిమాటికీ గుర్తువస్తూండేవాడు. అతని దూరదృష్టి;అతని విశాలభావాలూ అన్నీ మాటిమాటికీ తలుచుకునేవాడిని. అతను చెయ్యాలని కలలుకన్నవన్నీ నేనైనా చేస్తే నా మిత్రుడికి ఆత్మశాంతి కలుగుతుందను కున్నాను.''

''నా అదృష్టం కొద్దీ నాకు అనుకూలవతియైన భార్య లభించింది. ఇంటి పనుల విషయాల్లోగాని, యితర విషయాల్లోగాని నా భార్య ఎప్పుడూ విసుక్కో లేదు. నేనూ ఎన్నడూ ఆమెతో కోపంగా మాట్లాడలేదు. నేను కోరుకున్న విధంగానే నాకు ఆడపిల్ల పుట్టింది. నా కూతురికి కూడా తల్లి గుణాలే వచ్చాయి. సుందరి చదువుకున్నా ఏ పని చేసినా నువ్వుతూ ఉత్సాహంగా చేస్తుంది. నేను ఆమె మనసుని బలవత్తరం చేశాను. ఇప్పటిదాకా జరిగిన కృషి అంతా మనం ముందు చేపట్టబోయే మహత్కార్యానికి నాందిమాత్రమే. నువ్వు; మీ అక్క; సుందరి మనం అంతా కలిసి ఏదైనా కృషి ప్రారంభించాలి. సమయం ఎంతమాత్రం వృథా చెయ్యకూడదు. మనం త్రికరణశుద్ధిగా పని చెయ్యాలి. సుందరి; మీ అక్కా ఇద్దరూ కూడ తెలివైన వాళ్ళు. వారిద్దర్నీ ఒక నిర్దిష్ట మార్గాన ప్రవేశపెట్టాలి; నేనొక మార్గం ఆలోచించాను. నీ కిష్ట మైతే ఆమార్గం చెబుతాను....'' - అన్నారు శివరామ్‌పంత్‌గారు.

నే నాయన మాటలన్నీ మౌనంగా వింటున్నాను. నా కవన్నీ విలక్షణంగా కనిపించాయి. ఆయన ఏం చెయ్యాలనుకుంటున్నారో నాకేమీ అర్థం కాలేదు.

మీరేమి పథకాలు వూహించారో ముందు చెప్పండి....ఆ తర్వాత నా ఉద్దేశ్యాలు చెబుతాను...."-అన్నాను.

"నువ్వే ముందు నీ పథకం గురించి చెప్పు; ఆ తర్వాతే నేను చెబుతాను...." అన్నారాయన.

ఇక నాకుచెప్పక తప్పింది కాదు. ఆమాట కొస్తే నా మనసులో ఒకనిర్ణీత పథకమంటూ ఏమీలేదు. అయినా నాకుతోచినట్టుగా చెప్పాను - "మనమంతా కలిసి ఒక సమాజం వంటిది స్థాపించాలి. అందులో అనాథ స్త్రీలందరికీ ఆశ్రయం కల్పించాలి. ముందుముందు వారి కాళ్ళమీద వారు నిలబడగలిగే విధంగా, చదువు నేర్పాలి. కుట్లు; మొదలైన పనులుకూడా నేర్పాలి. సంస్కరణ కృషికి చదువు చాలా అవసరం; అందువల్ల స్త్రీలందరికీ వ్రాయడం, చదవడం నేర్పాలి".

నేనీ మాటలు చెబుతూచెబుతూ మధ్యమధ్యలో శివరామ్‌పంత్ గారి మొహం వంక చూడసాగాను. ఆయన ఏమంటారో తెలుసుకోవాలని నాకు కుతూహలంగా వుంది. "నీ ఉత్సాహం చూసి నాకు చాలా ఆనందంగా వుంది; కాని ఈఉత్సాహం ఎప్పటికీ అచంచలంగా, దృఢంగా వుండాలి"-అన్నారాయన, నా మాటలు వినగానే.

ఆయన మళ్ళీ తన అభిప్రాయాలు చెప్పడం ప్రారంభించారు - "భావూ! మిగతా సంస్కరణ లన్నిటికంటే ముందు మన యింటిని మనం సంస్కరించుకోవాలి. బాగా అభివృద్ధి చెందిన ఏ దేశంలోనైనాసరే స్త్రీలు విద్యావంతులై వుంటారు. గృహిణికి విద్య చాలా అవసరం. తల్లియొక్క విద్యాజ్ఞానాలు; భావాల ప్రభావం పిల్లలమీద చాలా వుంటుంది." - అంటూ మన దేశంలోని స్త్రీల గురించి కూడా ఆయన కొంతసేపు మాట్లాడారు.

మా పథకాన్ని త్వరలోనే అమల్లో పెట్టాలని ఆ రాత్రి నిర్ణయమైంది. అందరూ ఉత్సాహాన్ని చూపించారు. అక్కకి మరీ ఉత్సాహంగా వుంది."దీని వల్ల నావంటి అభాగ్యురాళ్ళెందరికో మనోవికాసం కలుగుతుంది. దేశానికి సేవచేసినట్టూ అవుతుంది. అందువల్ల ఇందుకోసం ఎన్ని కష్టాలు ఎదుర్కోవలసివచ్చినాసరే, నేను నా కర్తవ్యాన్ని సద్భావనతో పవిత్రతతో నిర్వర్తిస్తాను!"-

అంది, అక్క.

# ప్రారంభ వినోదం

నాచివరి పరీక్షకూడా ముగిసింది. ఆతర్వాత రెండు మాసాల్లో నేను బొంబాయి వెళ్ళవలసి వచ్చింది. నాకు ఫెలోషిపే దొరికింది. ధనవంతుడైన శ్రేయోభిలాషి ఒకాయన నాకు ఎల్.ఎల్.బి. చదవటానికి కావలసిన డబ్బంతా యిచ్చాడు. శివరామ్‌పంత్‌గారు; ఆయన భార్య; సుందరి; అక్కా అంతా నేను బొంబాయిలోనే చదవాలని పట్టుపట్టారు. శివరామ్ పంత్‌గారి అభిప్రాయానికి వ్యతిరేకంగా నడవం నాకిష్టం లేదు. అందువల్ల బొంబాయి వెళ్ళవలసి వచ్చింది.

బొంబాయి వెళ్ళటానికి మూడురోజుల వ్యవధి వుంది. ఆవేళ నేను అక్కతో మాట్లాడుతూ, మాట్లాడుతూ – "ఇంత చిన్నచిన్న విషయాలకే మీరెంత ఆలోచిస్తారు! ఇంకా ముందు ముందు ఎన్నో కష్టలుఎదురౌతాయి;అవన్నీ ఎలా ఎదుర్కొంటారు? మీ బదులు నేనేగనక ఈ పనికి పూనుకుంటే, తియ్యటిమాటలు చెప్పి, యింట్లోవున్న స్త్రీలందర్నీ ఆకర్షించి, చదువునేర్పేవాణ్ణి. నువ్వెంతో సాహసం కలదానివంటారు; ఇదేనా నీ సాహసం!" –అన్నాను, అక్కని ఉడికించాలనే వుద్దేశ్యంతో.

కాని ఆ మాటలు అక్క మనసుమీద బాగా పనిచేసాయి.

మర్నాడు ఉదయమే ఎక్కడికో వెళ్ళిపోయి సాయంత్రానికి తిరిగి వచ్చింది. తన అనుభవం మా అందరికీ చెప్పింది. మేమంతా పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వాం.అక్క నీళ్ళుతీసుకురావడానికి వెళ్లేచోట ఆమెకొకావిడతో పరిచయమైంది. ఒకరోజావిడ –'నేను స్వెట్టర్ అల్లడం నేర్చుకోవాలి'–అందిట,అక్కతో.అందుకే అక్క ఆవేళ వాళ్ళింటికెళ్ళింది. తనొక్కతే పనికి బయల్దేరింది గనక, యింట్లో అందరితోనూ గర్వంగా తన అనుభవం చెప్పుకోవాలని ఆశించింది అక్క. తీరా

అక్క వాళ్ళింటికేళ్ళేసరికి-ఆవిడ-"ఎందుకొచ్చారు"-అనిఅడిగింది. "సూదులూ, పున్నీతీసుకొచ్చాను.... మీకు అల్లిక నేర్పుతాను...." - అంది అక్క గంభీరంగా.

ఆ మాటవినగానే ఆ యువతి చాలా సంతోషిస్తుందని వూహించుకుంది అక్క. కాని అక్కమాట వినగానే ఆవిడ గాభరాపడిపోయి -"మీరు త్వరగా వెళ్ళిపొండి; మా అత్తలోపల అన్నం తింటోంది; చూసిందంటే వూరుకోదు; ఒకరోజు మీతో మాట్లాడం చూసి నన్ను బాగా చివాట్లేసింది; ఇప్పుడు మిమ్మల్ని చూసిందంటే అసలు వూరుకోదు; నాకు అల్లికలూ నేర్పొద్దు, ఏమీ వద్దుగాని దయచేసి త్వరగా యిక్కడినుంచి వెళ్ళిపొండి!"- అని బ్రతిమాలి, తను గబగబా లోపలికెళ్ళిపోయింది.

అక్క యిదంతా నవ్వుతూ చెప్పింది మాకు.

నేను బొంబాయి వచ్చాక ఉత్తరాలద్వారా కూడా కొన్నియిలాంటి సంగతులు తెలియజేసింది అక్క. "శివరామ్‌పంత్‌గారి దగ్గరకి ఒకకుర్రాడు రోజూవస్తూవుండేవాడు. మా ఆవిడకిచదువు చెప్పించాలనివుంది, అనేవాడు. సరే, నేనొకరోజు వాళ్ళింటికి వెళ్లాను. నేను వెళ్లేసరికి తల్లీకొడుకులమధ్య వాదం జరుగుతోంది.

"రానీదాన్ని! బాగాచివాట్లేసి అవమానంచేసి పంపుతాను! నీపెళ్లాన్నిగనక నువ్వు చదివించదల్చుకుంటే నాయింట్లోంచి వెళ్ళిపో!"

"అందులో తప్పేముందమ్మా! చదువుకోవడం నేరంకాదుగా?"

"ఏమైనాసరే! ఇలాంటివన్నీ నాయింట్లో జరగటానికి వీల్లేదు; లేదా నేనే యింట్లోంచి వెళ్ళిపోతాను!"

"సర్లే, నువ్వుచెప్పినట్టే వింటాలే.... కాని ఆవిడనివ్వాళ రమ్మని పిలిచాను.... వస్తే నువ్వుమాత్రం దయచేసి ఆవిడనేమీ అనకు...."

"నువ్విప్పుడే వెళ్ళి దానితో ఈ యింట్లో అడుగుపెట్టవద్దని చెప్పు .... మహాబయలుదేరింది, ఆడవాళ్ళకి చదువులు నేర్పేది: రానీ, చెబుతాను.... మొహానపేడనీళ్ళు కొట్టి పంపిస్తాను....!"

ఈ మాటలన్నీ గుమ్మం దగ్గర నిలబడి నేను వింటూనే వున్నాను. ఈవిడ నిజంగానే పేడనీళ్ళు కొట్టేట్టుగా వుందని, మాట్లాడకుండా వెనక్కి తిరిగి

యింటికొచ్చేశాను. ఇంటికొచ్చి అందరితోనూ జరిగిందంతా చెప్పాను. ఇలాంటి సంఘటనలవల్ల మాకు మంచి అనుభవం వస్తోంది. మర్నాడు మరో విచిత్రమైన విషయం జరిగింది. ఆ కుర్రాడు వచ్చి– "నిన్న మీరు వస్తారని ఎదురుచూశాం; రాలేదేం? మీరు రాకపోయేసరికి –ఆవిడకి సమయం లేదేమో, అయితే వద్దులే అంది మా ఆవిడ!"– అన్నాడు, తప్పంతా నాదే అయినట్టుగా. తన తప్పు కప్పి పుచ్చుకోవడానికి అబద్ధం ఆడుతున్నాడు. మీ యింట్లో జరిగిందంతా నాకు తెలుసునని చెప్పేస్తే, ఎంత సిగ్గుపడేవాడో పాపం!"

ఈ రకంగా సుందరికీ, అక్కకీ అనేక అనుభవాలు కలిగేవి. కొందరు నిందించేవారు; కొందరు అవమానించేవారు. అయినాకూడ వాళ్ళిద్దరూ అన్నిటినీ సహిస్తూ తమ మార్గంలో ముందుకి నడుస్తున్నారు. వీళ్ళిద్దరూ స్త్రీవిద్యకోసం పనిచేస్తున్నారని ఇప్పుడు చాలా మందికి తెలిసిపోయింది. ఒకరోజు శివరామ్ పంత్‌గారికి – ఒక కాలేజీ విద్యార్థి నుంచి ఒక ఉత్తరం వచ్చింది.

"నలుగురైదుగురు యువవిద్యార్థులం మా భార్యలకి చదువు చెప్పించాలను కుంటున్నాం; ఎంతలోకనిందవచ్చినా సరే మేం వెనుకాడం. మీ అమ్మాయి; భావూరావ్ సోదరిలాంటి బాగా చదువుకున్నవారిచేత చదువు చెప్పించాలని అను కుంటున్నాం; ఒక సమయం నిర్ణయించి మాకు ఉత్తరం రాయండి...." – అని వుందా వుత్తరంలో.

శివరామ్‌పంత్‌గారు నా అభిప్రాయంకోసం రాశారు. యావద్భారతదేశం లోనూ సుందరి; అక్కల కీర్తివ్యాపించే రోజులొచ్చాయనుకున్నాను నేను. వారిద్దరి జీవితాశయాలూ సఫలమయ్యే సమయం ఆసన్నమైంది. ఇలాంటప్పుడు సమయాన్ని, అవకాశాన్నీ పోగొట్టుకోవటం మంచిదికాదు. అందుకే, వెంటనే ఆవిషయంలో నా అనుమతి తెలియజేశాను. మేం అలా చేస్తాం; యిలా చేస్తామని అక్కకూడా ఉత్తరం రాసింది. ఆ తర్వాత కొన్నాళ్ళకి మరో ఉత్తరంరాసింది.

"చివరికి చదవాల్సి వచ్చేసరికి ఆ నలుగురిలో ఒక్కరూ రాలేదు. వచ్చిన పదిహేను నిమిషాలకే వాళ్ళు వెళ్ళిపోతామన్నారు. మాకు చదవాలనే వుంది గానీ, మా అత్తలు పెట్టే బాధలు సహించలేం; అందువల్ల రాలేం, అన్నారు. ఇది సుందరికీ, నాకూ మరోకొత్త అనుభవం"– అని రాసింది అక్క.

ఆ కాలేజీ విద్యార్థులంటే నాకు అసహ్యాభావం ఏర్పడింది. 'ఇదేనా మీ ఉత్సాహం?'– అని, శివరామ్‌పంత్‌గారికి ఉత్తరం రాసిన విద్యార్థికి ఉత్తరం రాశాను. రెండుమూడు ఉత్తరాలు రాశాక అతను సమాధానం రాశాడు. 'నాకు పూర్తిగా ఉత్సాహముంది; కాని మా ఆవిడకే లేదు....'– అని రాశాడు. నేనా సంగతి మళ్ళీ శివరామ్‌పంత్‌గారికి రాశాను. "ఈ విషయంలో మనం ఎవరినీ తప్పుపట్టకూడదు; ఇలాంటి ఉత్సాహవంతులైన యువకులు చాలామంది వున్నారు; కాని స్త్రీలకారణంగానే వారేం చెయ్యలేక వూరుకుంటున్నారు; వారికా ఉత్సాహముండటమే అభినందించదగిన విషయం ...."– అని ఉత్తరం రాశారాయన.

## ముందడుగు

"ఈ విధమైన వినోద సంఘటనలు కొన్నాళ్ళు జరిగాయి. కాని, మెల్లి మెల్లిగా ప్రజల మూర్ఖత్వం తొలగిపోసాగింది. ప్రజల మనసుల్లో కొత్త అభిప్రాయాలూ ఆలోచనలూ మేలుకొనసాగాయి. మాకు ఎవరో తెలియని వ్యక్తుల గుప్తదానం యిప్పటికీ అందుతూనేవుంది. ఆడబ్బుతో పుస్తకాలు; కుట్టుపని సామాగ్రి మొదలైనవి కొంటున్నాం. కాని వాటిని మేం ఉపయోగించాలన్నంతగా ఉపయోగించలేక పోతున్నాం.

కొన్నాళ్ళ తర్వాత యిద్దరు స్త్రీలు చదువుకోవడానికి వచ్చారు. వారు చాలా ఉత్సాహంగా శ్రద్ధగా నేర్చుకుంటున్నారు. శుభ్రత; అలంకరణ మొదలైన విషయాలకి కూడా శిక్షణలో ప్రాధాన్యత యివ్వటం జరుగుతోంది. క్రమ క్రమంగా స్త్రీల సంఖ్య పెరుగుతోంది; మా యిద్దరి ఉత్సాహమూ పెరుగుతోంది. మొదట్లో స్త్రీలు ఒకగంటే కూర్చునేవారు; ఇప్పుడు రెండేసి గంటలు కూర్చుంటున్నారు. వారికి క్లాసుల్లో చారిత్రకగాథలూ; పౌరాణికగాథలూ; దైవభక్తిని ప్రబోధించే గాథలూకూడా బోధించడం జరుగుతోంది. బట్టలు

కుట్టే పనికిఎక్కువ ప్రాధాన్యతనిస్తున్నాం. స్వంతంగా బట్టలు కుట్టుకోవడం వల్ల చాలా పొదుపు జరుగుతుంది" – ఇలాంటి విషయాలన్నీ అక్క నాకు ఉత్తరాల ద్వారా తెలియపరుస్తూవుండేది.

నా పరీక్షలు దగ్గర కొచ్చాయి. ఏకాగ్రతతో చదవసాగాను. పరీక్షలు పూర్తయినాయి. నా పథకాన్ని అమల్లో పెట్టేందుకు గాను, పూనా వెళ్ళ బోతున్నాను. ఇంతలో అక్క దగ్గర్నించి ఒక ఉత్తరం వచ్చింది. అందులో విచిత్రమూ, అనూహ్యామూ అయిన ఒక విషయం రాసివుంది. అది చదివి నా గుండె దడదడలాడింది.

## ఆ వే శ ం

ఉత్తరం ప్రారంభంలో యిలావుంది– "నే నీ ఉత్తరం మా యింటినుంచి – అంటే మా అత్తవారింటినుంచి రాస్తున్నాను...." ఆ వాక్యం చదవగానే నాకు కోపం వచ్చింది. అక్క మళ్ళీ అత్తవారింటికి ఎందుకు వెళ్ళిందో నాకు అర్థం కావటం లేదు. శ్మశానం అని తనే అన్న యింట్లోకి మళ్లీ ఎందుకువెళ్ళింది? ఆపైన ఉత్తరం చదవలేక, దాన్నొక మూలకి విసిరిపారేశాను. గదిలో పిచ్చెత్తినట్టు తిరగసాగాను. వెంటనే కాగితం, కలమూ తీసుకుని అక్కకి చాలా ఘాటుగా వుత్తరంరాశాను – "నువ్వు చాలా చెడ్డపని చేశావు; కనీసం నువ్వు నన్ను అడిగి వుండాల్సింది. నువ్విలా చేస్తావని నేనుకల్లోకూడ అనుకో లేదు. ఇలా చెయ్యదల్చుకున్న దానివి సంఘ సంస్కరణ ఎందుకు చేపట్టావ్? అమ్మమ్మ; మామయ్య; అత్త; నాన్నగారూ అందర్నీ ఎదిరించి, లోకనిందలన్నీ భరించి ఇన్నాళ్ళూ ఎందుకు వూరుకున్నావ్? తమ ఆత్మల్ని చంపుకుని, దుర్మార్గులైన తమ భర్తల అడుగులకి మడుగులొత్తుతూ, దాసీల్లా పడివుండే మామూలు ఆడవాళ్ళ లాగా నువ్వూ పడివుండక పోయావా?"–ఈ రకంగా రాశాను.

ఆ ఉత్తరం పోస్టుచేశాక నా కోపం మెల్ల మెల్లగా తగ్గిపోసాగింది. మనసు కాస్త శాంతించింది. నేను పారేసిన అక్క ఉత్తరంలో ఏముందో చదవాలని పించింది. చూద్దాం, అక్క ఏంరాసిందో అనుకున్నాను. ఆ ఉత్తరంలో—

"ఈఉత్తరంచదివి నువ్వాశ్చర్యపోతావ్;కాని ఆశ్చర్యపడాల్సిందేమీలేదు.అలా జరిగింది. ఒకరోజు యింట్లో నే నొక్కదాన్నే వున్నాను. మా యింటి దగ్గర్నించి ఒక నౌకరు పరుగెత్తూకుంటూ వచ్చి—"త్వరగారండి : అయ్యగారికి బాగా జబ్బు చేసింది; త్వరగా రండి...."—అన్నాడు. నేను భయపడిపోయి ఏడవటం ప్రారంభించాను. ఇంతలో శివరామ్‌పంత్‌గారు వచ్చారు. ఆయనకి అంతా చెప్పాను. ఆయన వెంటనే నౌకరువెంట వెళ్ళారు. మొదట్లో ఇదంతా అబద్ధమేమో ననుకున్నారాయన. కాని వెళ్ళిచూస్తే నిజమే. మీ బావగారు జబ్బుతో మంచాన పడివున్నారు. శివరామ్‌పంత్‌గారు ఇంటికొచ్చి ఆ సంగతి చెప్పిన వెంటనే, నే నాయింటికెళ్ళిపోయాను. ఆయన రూపం; ఆయన పడుతున్న బాధా చూసి నేను గతించిన విషయాలన్నీ మర్చిపోయాను. ఆయన నిస్తేజమైన కళ్ళు నేను చూడలేకపోయాను. నన్ను చూసిన తర్వాత ఆయన మొహంలోకి కాస్త వెలుగొచ్చింది. పంత్‌గారు మందులు తెచ్చియిచ్చారు. నేను అహోరాత్రాలు ఆయనకి సేవచేశాను. ఇంకెవరూ యింట్లోలేరు. అంతా ఎవరిదారి వాళ్ళు చూసుకున్నారు.ఇంట్లో ఒక్కవస్తువులేదు.ఎవరికిదొరికిందివాళ్ళు దోచుకుపోయారు. దోచుకుపోయినవాళ్ళే యిప్పుడు అపవాదులు వేస్తున్నారు. నే నాయనకి విషమిచ్చి చంపుతానట. ఇన్నాళ్ళూ రానిది యిప్పుడెందు కొచ్చిందీ అంటున్నారు. నేను యిల్లు ఎందుకు విడిచివెళ్ళానో వీళ్ళందరికీ ఏం తెలుస్తుంది? నా సేవల వల్ల ఆయన ప్రాణాలు దక్కుతాయనుకుంటే, నేను తప్పకుండా ఆయనకి సేవచేస్తాను. జనం ఏమనుకున్నాసరే! ఏ పరిస్థితిలో ఎలా నడుచుకోవాలన్నది నాకు బాగా తెలుసు. నీకు వెంటనే కబురు చేద్దామనుకున్నాను. కాని నీ పరీక్షలు దగ్గర కొచ్చాయని వూరుకున్నాను. పరీక్షలు పూర్తికాగానే యిక్కడికొస్తావని ఆశిస్తున్నాను. ఆయనకి మందివ్వాలి; అందువల్ల ఈ ఉత్తరం యిక్కడితో ముగిస్తున్నాను."—అని రాసింది అక్క.

ఉత్తరం చివర్లో కాబూలీ ద్రాక్షపళ్లు పంపమని కూడా రాసింది.

ఉత్తరం పూర్తిగా చదివాక నేను చాలా బాధపడ్డాను. నేను తెలివితక్కువగా, ఆవేశంతో రాసిన ఉత్తరం చదివి అక్క ఏమనుకుందో, ఎంత బాధపడిందో! అక్కకి ఈ సమయంలో వోదార్పూ, ధైర్యమూ కావాలి. నా ఉత్తరం చదివి, అసలే బాధతో వున్న అక్క యింకెంత బాధపడిందో నేనూహించుకోలేక పోయాను.

## అక్క ఉత్తరం

"భావూ! నువ్వు నాకీ విధంగా ఉత్తరం రాస్తావని నే నెన్నడూ అనుకోలేదు. నీ ఉత్తరం నాకు అమితమైన ఆశ్చర్యాన్నీ, విచారాన్నీ కలిగించింది. నాగత లేఖలో జరిగిన కథంతా నీకు రాశాను. అయినా నువ్వు నన్ను నిందిస్తూ ఉత్తరం రాశావు. నేను నా భర్తనీ, నా యింటినీ విడిచిపెట్టి వచ్చానంటే, దాని అర్థం—దయాదాక్షిణ్యాలు; నీతి-నిజాయతీలూ; జ్ఞాన వివేకాలు; కర్తవ్యాలూ అన్నీ విడిచిపెట్టానని కాదుగా? నువ్వలా అనుకుంటే పూర్తిగా పొరబడ్డావు.కాని భావూ, ఇది నాకు పరీక్షాసమయం. ఇది నా మమనసుకి పరీక్ష. ఇది నాకర్తవ్యమని నిర్ణయించుకున్నాను.కర్తవ్యంపట్ల నా కున్న సహజస్వభావమే నన్నిక్కడికి లాక్కొని వచ్చింది.ఆయనకి చివరివరకూ నేను సేవచేసితీరవలసిందే"-ఇలాంటి ఉత్తరాలుఅక్క పదే పదే రాసింది. నా ఉత్తరం అక్కకి బాధకలిగించింది. నా నుంచి సానుభూతి, ఓదార్పూ లభిస్తాయనుకుంది అక్క. కాని దానికి వ్యతిరేకంగా జరిగింది. అక్క ఉత్తరం చదివి నే నాశ్చర్యపోయాను. నిజంగా పురుషులు ఎంత నిర్దయులు! స్త్రీ లెంత స్నేహస్వభావం కలవారు! ఎంత ప్రేమమూర్తులు! బావ అక్కని పెట్టిన బాధలు నన్నెవరైనా పెట్టివుంటే, వాళ్ళ మీద పగబట్టి బదులు తీర్చుకునేవాణ్ణి. కాని అక్క ఇవన్నీ మర్చిపోయి పతిసేవ చేస్తోంది. మూడు నాలుగు రోజుల తర్వాత శివరామ్ పంత్ గారి నుంచి ఉత్తరం వచ్చింది.

"బావూ ! మీ అక్క నిజంగా చాలా ధైర్యస్థురాలు, కర్తవ్యపరాయణురాలు. అలాంటిస్త్రీని నే నెక్కడా చూడలేదు. నిజంగా ఆమె అసామాన్యస్త్రీ. పతి యొక్క అసహాయస్థితి చూసి ఆమె వెంటనే పత్నిగా తన కర్తవ్యాన్ని స్వీకరించింది. భర్త ప్రాణాలు కాపాడ్డానికి ఆమె తన ప్రాణాలొడ్డి, ప్రయత్నిస్తోంది"— అని రాశారాయన.

ఈ ప్రకారంగా ఆయన దగ్గర్నుంచి ఉత్తరాలొస్తూనే వున్నాయి. రోజు రోజుకీ బావగారి ఆరోగ్యం క్షీణిస్తోంది. నాలో ఆందోళన పెరుగుతోంది.

## మబ్బులు విడిపోయాయి

పరీక్షల్లో ఆఖరిపేపరురాసి, నే నా రాత్రికే బయల్దేరి అక్కగారింటికెళ్ళాను. అక్క ఆరోగ్యం కూడా చెడిపోయింది. బావగారి ఆరోగ్యం ఏమాత్రం బాగు పడలేదు. డాక్టర్ రోజూ వస్తూనేవున్నాడు. బావగారికి స్పృహలేదు. మందు పొయ్యటం కూడ కష్టంగానే వుంది. డాక్టర్ అక్కవేపు చూపిస్తూ —"ఆవిడ ఈరకంగా సేవచెయ్యకపోతే ఈయన ఎప్పుడో చచ్చిపోయేవాడు. ఇన్నాళ్ళు బ్రతికాడంటే అది నా మందులవల్లకాదు — ఆవిడ సేవలవల్లనే" — అన్నాడు, నాతో.

ఈ రకంగా పదిహేను, యిరవై రోజులు గడిచాయి. మే మనుకున్నట్టుగానే అక్కకూడా మంచం పట్టింది. అయినా భర్తకి సేవ చేస్తూనేవుంది. మనిషి పూర్తిగా కృశించిపోయింది. ఒంట్లో ఏ మాత్రం శక్తిలేదు. మంచమ్మీద పడుకునే భర్త ఆరోగ్యం గురించి అన్నీ అడుగుతోంది. ముసలాయన బ్రతుకుతాడనే ఆశ యింకలేదు. డాక్టరు కూడా అదే అన్నాడు. అందువల్ల ఆయన త్వరగా పోతే, అక్క ఆరోగ్యం గురించైనా శ్రద్ధ తీసుకోవచ్చు. ఆయన ఎంత త్వరగా పోతే అంత మంచిదనిపించిది నాకు.

చాలా రోజులు యిలాగే గడిచింది. అక్క సరిగ్గా మందులు తీసుకోవడం

లేదు. భర్త ఆరోగ్యం కూడా ఏమీ బాగుపడలేదు. ఈ రకంగా నెలా పది హేను రోజులు గడిచింది. ఈ లోగా నా పరీక్ష ఫలితాలు తెలిశాయి. మంచి మార్కులతో ప్యాసయ్యాను. అక్క ఆరోగ్యం రోజురోజుకీ క్షీణిస్తోంది. క్షయవ్యాధి సూచనలు కనిపిస్తున్నాయి.

మరికొన్ని రోజుల తర్వాత—ఒకనాటి సూర్యాస్తమయాన బావగారు మరణించారు. అక్క దుఃఖానికంతులేక పోయింది.

ఇలాంటి పరిస్థితుల్లో అక్క ఆరోగ్యం మరింత పాడవుతుందేమోనని మేం భయపడ్డాం. కాని అదృష్టవశాత్తూ అలా జరగలేదు. మెల్లి మెల్లిగా అక్క నిబ్బరం తెచ్చుకుంది. రోజురోజుకీ అక్క ఆరోగ్యం బాగుపడటం చూసి, నాకూ, శివరామ్‌పంత్‌గారికీ, ఆయన భార్యకీ, సుందరికీ అందరికీ ఆనందం కలిగింది. సుందరికీ, అక్కకీ యిద్దరు శిష్యురాళ్ళున్నారు. వాళ్ళిద్దరి మాటల వల్లా, పరిచర్యలవల్లా అక్క బాగా కోలుకుంది. అక్క యిప్పుడు చాలా తక్కువగా మాట్లాడుతోంది. అప్పుడప్పుడూ ఆలోచనల్లో మునిగిపోతూ వుంటుంది.

ఈ రకంగా – మధ్యలో ఉన్నట్టుండి ఆవరించిన కాలమేఘాలు తొలిగిపోయాయి. ఇంక మేమనుకున్న ప్రకారం మా సంఘసేవా పథకాలమలుపర్చడానికి అడ్డంకులేవీ లేవు. అయితే అక్కకోసమే ఆగాల్సివచ్చింది. అక్క ఆరోగ్యం బాగు పడుతూ వుండగానే – అప్పులవాళ్ళు యింటిమీది కొచ్చిపడ్డారు. బావ చేసిన అప్పులన్నీ చూస్తే చాలా లెక్కతేలింది. బాకీలు కట్టడానికి ఇల్లు అమ్మవలసి వస్తుందనుకున్నాం. కాని అమ్మకుండానే సర్దుబాటైపోయింది. ఆ యిల్లు అక్కకి లభించింది. అదీ, బావపేరవున్న కొద్దిఆస్తి తప్ప, మిగతాదంతా తాకట్టుపెట్టి అప్పులు తీర్చవలసి వచ్చింది.

## లోకనింద

ఒక చిన్న అందమైనయిల్లు: బయట బోర్డుమీద ఒక వ్యక్తిపేరు; ఆ పేరు కింద_ బి. యే., ఎల్. ఎల్, బి., న్యాయవాది; హైకోర్టు; బొంబాయి; అని రాసి వున్నాయి. ఆయింట్లో అయిదుగురు వ్యక్తులున్నారు: అయితే ప్రస్తుతం వారిలో ముగ్గురిగురించే నేను చెప్పదల్చుకున్నాను. ఆ ముగ్గురూ-ఒక యువకుడు; అతనికంటె కాస్తపెద్దదైన యువతి; ఒక వృద్ధస్త్రీ: వారి మధ్య విచిత్రమైన సంభాషణ నడుస్తోంది. ముగ్గురి మొహాలమీదా కోపచిహ్నాలు కనిపిస్తున్నాయి. వృద్ధస్త్రీ ఆ పురుషుడితో___

"భావూ! నువ్వు చేసినపని ఏమీ బాగాలేదు. నువ్వింత పెద్దవాడివయ్యావ్; మంచిరోజులొచ్చాయ్; కాని నువ్వు చేస్తున్నదేమిటి? నీ ప్రవర్తన ఎంతమాత్రం బాగాలేదు. మీ అమ్మవుంటే నువ్వు పైకొచ్చినందుకు సంతోషించేదేగాని, నీ యీ ప్రవర్తన చూసిమాత్రం బాధపడేది. అది పోవటమే మంచిదైంది. నాకు భగవంతుడు ఇంకా విముక్తి కలిగించలేదు. నువ్వుచేసే తప్పుడు పనులన్నీ చూడ్డానికి యింకా బ్రతికేవున్నాను! నువ్వెందుకిలా తయారయ్యావ్?" - అంటోంది.

"అమ్మమ్మా! నేనంత తప్పుడు పనులు ఏంచేశాను? దొంగతనాలుచేశానా? దోపిడీలు చేశానా? హత్యలు చేశానా? నే నేమంత మహాపాపం చేశాను? నావల్ల నీ గౌరవానికి ఏం భంగం కలిగింది?"

"ఇవన్నీ చేసినా బాగుండేది! కాని యిప్పుడు నువ్వు చేస్తున్నదానికి నువ్వు సిగ్గు పడాల్సిందే. ఇన్నాళ్ళూ నేను చూస్తూ వూరుకున్నాను; కాని యిక వూరుకోలేను; అందుకే నీకు బుద్ధి చెబుదామనే యిక్కడికొచ్చాను...."

"మంచిపని చేశావ్! నా ప్రవర్తన ఎలాంటిదో నువ్వే కళ్లారా చూస్తావుగా? నేను ఎంత మాత్రం మంచీ మర్యాదా విడిచిపెట్టలేదు."

"నువ్వెంత మంచిగా ప్రవర్తిస్తున్నావో నాకు తెలుసు! లోకం కోడై కూస్తోంది. అంతా నిన్ను చూసి ముక్కుమీద వేలేసుకుంటున్నారు."

అమ్మమ్మకి నచ్చజెప్పడానికి ప్రయత్నించాం. కాని అబద్ధాలే ఆవిడెక్కువగా

నమ్మితుంది. అక్క కష్టాల్లో వున్నప్పుడు అమ్మమ్మ వస్తుందేమో అనుకున్నాం కాని అప్పుడు రాలేదు. బావగారు పోయిన తర్వాత అక్కగురించి చాలా నీచమైన అపవాదులు పుట్టాయి. అమ్మమ్మ అప్పుడే రావాలనుకుంది. కాని మామయ్య, అత్తా రానివ్వలేదు. చివరికి తను పట్టు విడవకుండా వచ్చింది.వచ్చిన దగ్గర్నించీ మమ్మల్నిద్దర్నీ పట్టుకుని ఈవిధంగా మాటలంటోంది. వచ్చిన దగ్గర్నించీ అన్నంకూడా తినకుండా ఒకటే ఏడుపు; చివాట్లు; ఇదే గొడవ. మేమంతతప్పు ఏంచేశామో మాకర్థం కాలేదు. రైల్లో ప్రయాణం చేసి వచ్చినందువల్ల అమ్మమ్మ బాగా అలిసిపోయింది.

'నువ్వు ముందు స్నానం చెయ్యి; భోజనం చెయ్యి; కాస్సేపు విశ్రాంతి తీసుకో; ఆ తర్వాత మాట్లాడుదాము'-అన్నాం. కాని అమ్మమ్మ వినిపించుకోలేదు. మాటి మాటికీ-"నువ్వు గనక ఇలా ప్రవర్తించావంటే, నే నిప్పుడే తల పగలగొట్టుకుని ఛస్తాను!"-అనటం ప్రారంభించింది.

నాకు చివరికి విసుగెత్తి-"నువ్వు చెప్పదల్చుకున్నదేమిటో సూటిగా చెప్పు; ఈ రకంగా బాధపడితే ఏం ప్రయోజనముండదు"-అన్నాను.

ముసలివాళ్ళ మూర్ఖత్వమెలావుంటుందో మొదటిసారిగా నా కర్థమైంది. నా మిత్రుడొకడు కేవలం అతని అమ్మమ్మ; అమ్మల పోరుపడలేక సంస్కరణ కృషికి స్వస్తిచెప్పాడు. అప్పుడతని మాటలు నమ్మలేదు నేను. ఇప్పుడు నాకూ అర్థమౌతోంది.

"నీ అక్క చాలా చెడ్డది; దానివల్లనే కళంకమంతా వచ్చింది" - అంది అమ్మమ్మ.

అమ్మమ్మ అక్కని తిట్టడం ప్రారంభించే సరికి నాకు కోపమొచ్చింది.అక్క అంతా వింటూ, చలించకుండా శాంతంగా కూర్చుంది. కాని నే నూరుకోలేక పోయాను.-"అమ్మమ్మా! నువ్వు నోరు మూసుకుని వూరుకో; అక్కని తిట్టవలసిన అవసరం ఎంతమాత్రం లేదు. తప్పేమైనావుంటే అదంతా నాదే. నువ్వు లోకుల మాటలే వినదల్చుకుంటే విను....నువ్వేం చేసుకుంటావో చేసుకో...."- అన్నాను.

"నేను చేసేదేదో చేసి తీరుతాను....ఈ సిగులేనిదాన్ని నాతోపాటు తీసుకు

పోతాను....!".

అక్క కూడా ఇక వూరుకోలేక పోయింది. "అమ్మమ్మా! నువ్వు నన్ను తిట్ట దలచుకున్నంతా తిట్టు. కాని ఒకేసారి, ఆఖరు సారిగా చెపుతున్నాను విను. లోకులు ప్రచారంచేస్తున్న అపవాదులన్నీ పూర్తిగా అబద్ధాలు. అవన్నీ నమ్మి నువ్వు నేను మళ్ళీ పెళ్ళి చేసుకుంటానని అనుకోవచ్చు. కాని అది పొరబాటు. నే నెప్పుడూ అలా చెయ్యను. నా జీవితమంతా పరోపకారానికీ, దేశసేవకీ విని యోగిస్తాను. నువ్వు నన్నిలా చెయ్యి; యిలాచెయ్యి; అలావుండు; ఇలావుండు అంటే నేను వినను. నేను నీతోరాను, పూనాలోనే వుంటాను. పూనాలో మను షులు దుర్మార్గులు; అపవాదులంటే యిష్టపడతారు; సన్మార్గాలకి అడ్డు పడతారు. అందువల్ల నే నే మైనా సేవ, సంస్కరణా చెయ్యదల్చుకుంటే ఇక్కడే చెయ్యాలి; 'అందుకని ఇక్కడే వుంటాను.''-అంది.

అమ్మమ్మ కోపమంతా అక్కమీదే వుంది.

అక్క మాటలతో అమ్మమ్మ కోపం యింకా పెరిగి పోయింది. అక్కజుత్తు చూసి-''సిగ్గులేకుండా జుట్టుచూడు ఎలాపెట్టుకుందో! ఇప్పుడు వి....''

అమ్మమ్మ మాటలు విని నాకు కూడా కోపంవచ్చింది. మేం ఎంతచెప్పినా అమ్మమ్మ ఫలహారంతప్ప మరేమీ ముట్టుకోలేదు. సుందరి; అక్కలచేతి మంచి నీళ్ళయినా ముట్టుకోలేదు. ఇప్పుడే వెళతాను; ఇప్పుడే వెళతానని రెండు రోజు లుంది. శివరామ్‌పంత్‌గారిని కూడా చివాట్లు వేసింది. రెండురోజులూ ఉపవాసం చేసింది. ఇక అక్కని తీసుకెళ్ళటం తన వల్లయ్యే పనికాదని నిశ్చయించుకుని, మమ్మల్నందర్నీ బాగాతిట్టి, మూడోరోజున వెళ్ళిపోయింది.

# నూతన కార్యారంభం

తెలిసీ తెలియని వారివల్లా, చదువు వచ్చీరానివారివల్లా ఏ మాత్రం పనిజరగదనీ పైగా పనికి అడ్డుపడే ప్రమాదంకూడా వుందనీ అనుభవం వల్ల నాకు తెలిసింది. అందువల్ల ఏమీ తెలియని వారిని విజ్ఞానవంతులుగా చెయ్యడం ద్వారానే పని ప్రారంభించటం మంచిదనుకున్నాను. కేవలం రచనలవల్ల కూడా లాభం వుండదు. రచనలు ఎంతగొప్పగా వున్నా అవి చదివేదెవరు? అందువల్ల ఉపన్యాసాలద్వారా కొంత ప్రయోజనం వుంటుందనుకున్నాను. వారానికి ఒకటి రెండు రోజులు నిర్ణయించుకుని-ఆ రోజుల్లో ఉపన్యాసాలివ్వటం మంచిదనుకున్నాను. ఆ రకంగా వినేవాళ్ళని కొంతవరకూ సంస్కరించవచ్చు. సంస్కరణకి ఇలాంటి ఉపాయమే ఏదో ఆలోచించాలి. ముందుగా విద్యార్థివర్గం వేపు నా దృష్టి మళ్ళింది. విద్యార్థుల మనసుల్ని త్వరగా మనక్కావలసిన మార్గంలోకి మళ్ళించవచ్చు. రెండువందలు; మూడువందలు; నాలుగు వందలమంది విద్యార్థులకి ఉపదేశాలిస్తే వారిలో ఒకరిద్దరైనా మనక్కావలసిన మార్గానికి రాకపోరు. ఆ సంగతి నాకు తెలుసు. అందువల్ల పెద్దగది ఒకటి తీసుకుని పని ప్రారంభించాలనుకున్నాను. వార్తా పత్రికల్లో ప్రకటనలు చెయ్యడం నా కిష్టం లేదు. అలాచేస్తే మొదట్లో ఎక్కువమంది జనం రావచ్చు. కాని చివర్లో ఎవరూ మిగలరు. అలా కాకుండా మొదట్లో కొద్ది మందితో ప్రారంభించి,ఆ తర్వాత వ్యాపింపజేస్తే బావుంటుంది.

అందువల్ల కొందరు పాఠశాలోపాధ్యాయుల్నీ, కళాశాల విద్యార్థుల్నీ సమావేశ పరిచాను. సమావేశాల్లో ఒకసారి భారతదేశ చరిత్రలోని ఒక ఘట్టాన్ని తీసుకుని చెప్పేవాడిని. మరోసారి బ్రిటిష్ చరిత్ర బోధించేవాణ్ణి. రెండుచరిత్రల్లోనూ గల పోలికలూ భేదాలూ వివరించటం నా ఉద్దేశ్యం. మన అధికారాల గురించీ, హక్కులగురించీ మన దేశంలోనే ఎందరికి తెలియదో చెప్పాను. మూడోసారి ఫ్రాన్సుచరిత్ర తీసుకున్నాను. మెల్లి మెల్లిగా నా శ్రోతల సంఖ్య పెరగసాగింది. అప్పుడప్పుడూ శివరామ్‌పంత్‌గారిని కూడా సమావేశాలకి తీసుకొచ్చి, ఆయనచేత కూడా ఉపన్యాసాలిప్పించేవాడిని. మెల్లి మెల్లిగా నా ఉపన్యా

సాలో దేశభ_క్తి ప్రపూరితమైన కథలూ గాథలూ చేర్చటం ప్రారంభించాను. ఉదాహరణకి శివాజీ సింహగడ దుర్గాన్ని స్వాధీనం చేసుకునే సందర్భాన తానాజీకి గల దేశభ_క్తి. ఒక్కొ_ప్పుడు అర్థశాస్త్ర సంబంధమైన విషయాలు కూడా మాట్లాడేవాడిని. కుటీర పరిశ్రమల ప్రాముఖ్యం; సహకార సంస్థల అవసరం. వాటి లాభాలూ యివన్నీ చెప్పడం ప్రారంభించాను.

మనదేశంవల్ల విదేశాలు ఎంతబాగుపడుతున్నాయో కూడా చెప్పాను. ఒక్కొసారి రామాయణం; భారతంవంటి పురాణగాథలు వినిపించేవాడిని. ఆ గాథల్లో వున్న మహనీయ విషయాల్ని నిత్యజీవితానికి ఎలా అన్వయించుకోవాలో చెప్పేవాడిని. శ్రోతలు నా ఉపన్యాసాలు కడుశ్రద్ధతో వినేవారు. అప్పుడప్పుడూ కొందరు నన్ను ప్రశ్నలడిగేవారు. ఎలాగైనా సరే వారిలో దేశభ_క్తి భావాలు కలిగించాలని నా ప్రయత్నం. కేవలం యిలాంటి ఉపన్యాసాలవల్ల శ్రోతలకి విసుగు కలగకుండా వుండేందుకుగాను — అప్పుడప్పుడూ ఏదైనా ఇంగ్లీషు నవలలోని కథ వినిపించేవాడిని. నా యీ కృషి నిర్విఘ్నంగా సాగుతోంది. ఈ రకంగా మనం ముందుకు సాగిపోగలమన్న ఆత్మవిశ్వాసంకూడా నాలో పెరిగింది.

## కొ_త్త భావాలు

నాఉపన్యాసాలు సాగుతూనే వున్నాయి. ఉపన్యాసాలివ్వడానికి ముందు నేనందుకు సంబంధించి కొంత కృషిచేసేవాడిని. శ్రోతలు రోజురోజుకీ పెరగసాగారు. ముందుముందు వారిలో ఎవరైనా దేశభక్తులౌతారా లేదా అని నేను నిరీక్షిస్తున్నాను. ఒకరిద్దరు యువ విద్యార్థులు నా ఉపన్యాసాలు అతిశ్రద్ధతో వినసాగారు. చర్చలవీ వచ్చినపుడు వారు నా పక్షంవహించి మాట్లాడేవారు. కేవలం ఉపన్యాసాల వల్ల లాభంలేదనిపించింది నాకు. ఉపన్యాసాలతో పాటు రచనలద్వారా కూడా కృషి సాగించాలనుకున్నాను. అందుకోసం ఒక

ప్రెస్సు నెలకొల్పితే బాగుండుననిపించింది. కాని అది నాబోటి అల్పజ్ఞుడు; అల్పశక్తి వంతుడు; అల్పానుభవంకలవాడివల్ల అయ్యేపనికాదు. అయితే– నా మనసులో పుట్టిన కోరికని సాధించకుండా వదిలిపెట్టడం చిన్నతనం నుంచీ కూడా నా స్వభావానికి విరుద్ధం. శివరామ్‌పంత్‌గారికి నా ఆలోచనలు తెలియ జేశాను. ఆయన మనసులోకూడా యిలాంటి ఆలోచనలేవున్నాయి.

నా దగ్గర కొచ్చే మిత్రులందరికీ నా సంకల్పాన్ని గురించిచెప్పడం ప్రారంభించాను. నా ఆలోచనలు ఆచరణలోపెట్టే అవకాశం త్వరలోనే వచ్చింది.

రాత్రి పడుకోబోయేముందు గంటా గంటన్నరసేపు తప్పనిసరిగా ఏదోఒకటి చదవడమన్నది మాదినచర్యలో ఒకభాగం. ఒకరు చదువుతూంటే మిగతా అంతా వినేవారు. సుందరితల్లికి ఈమధ్య ఆరోగ్యం బాగుండక ఈ పఠన సమావేశాలకి రావటంలేదు. రోజంతా ఎవరికెలాంటి అనుభవాలు కలిగాయి; ఎవరెటువంటి పనులుచేశారూ అన్నవిషయాలు గురించికూడా చర్చించేవాళ్ళం. పత్రికనడపే ప్రసక్తి రోజూ వస్తూనేవుండేది. పత్రికపెడితే ఏఏవిషయాల మీద వ్యాసాలు యితరరచనలూ వుండాలన్న విషయం గురించికూడ చర్చిస్తూ వుండేవాళ్ళం. ఆరోజు అలాగే మాట్లాడుతూవుండగా – అక్క అకస్మాత్తుగా – "నేను మర్చిపోయాను; నీకో ఉత్తరం వచ్చింది; తొందరలో పెట్టెలో పడేశాను...." – అంటూ ఉత్తరం తెచ్చియిచ్చింది. అందులో ఒకటేమాట రాసివుంది. నేను ఏకాంతంగా మిమ్మల్ని కలవాలనుకుంటున్నాను అని రాశాడొక వ్యక్తి. ఆవ్యక్తితో నాకంతగా పరిచయం లేదు.

ఆవ్యక్తికి ఫలానా సమయంలో రమ్మని ఉత్తరం రాశాను. ఆవ్యక్తి మర్నాడే వచ్చాడు. కాస్సేపు పిచ్చాపాటీ మాట్లాడాక – "నావెంటవున్న వ్యక్తికి ప్రెస్ పెట్టాలనివుంది; పత్రిక ప్రారంభించాలని వుంది. ఈ పనిలో మీరు సహాయం చెయ్యాలి...." – అన్నాడు.

ఆ ప్రశ్న విని నేనాశ్చర్యపోయాను. వెదుకుతున్న తీగె కాలికి తగిలి నట్లయింది.

"నా వల్ల వారికేం సహాయం కావాలి?"– అన్నాను.

"వీరికి కావలసిన సహాయం డబ్బుకాదు. డబ్బు ఆయనకేవుంది. కొత్త

ప్రెస్సే కొనగలరు. పత్రిక ప్రారంభిస్తారు. ఆ పత్రిక మీచేతిలోపెట్టి నడిపించాలని ఆయన ఉద్దేశ్యం; నేను మిమ్మల్నింతకుముందే ఎరుగుదును; అందువల్ల ఈయన్ని మీదగ్గరకి తీసుకొచ్చాను....''— అన్నాడు నాకు ఉత్తరం రాసిన వ్యక్తి.

ఆ మాటలువిని నాకు సంతోషం కలిగింది. ఆ రెండోవ్యక్తి - ''ఈయన మీ ఉపన్యాసాలన్నీ విన్నారు; అందువల్లనే మీరాపని చెయ్యాలని కోరుకుంటు న్నాం....'' - అన్నాడు.

నిజానికి నన్ను వాళ్ళంతగా అడగవలసిన పనిలేదు. పత్రిక నేను సరిగా నడపగలనా లేదా అనే నేను ఆలోచించాను.''పత్రికనడపాలని నాకూ చాలారోజు లుగా వుంది. నేను మిమ్మల్ని ఒక్కప్రశ్న అడుగుతాను - మీరు ప్రెస్సూ, పేపరూ పెట్టాలనుకుంటున్నది డబ్బుకోసమా? డబ్బు వస్తేమంచిదే. రాక పోయినా మంచిదే. డబ్బు సంపాదించటం నా ఉద్దేశ్యంకాదు. దేశం కోసం ప్రజల్లో ఎలాంటి భావాలు ప్రచారం చెయ్యాలో వాటిప్రచారం కోసమే పత్రిక నడపాలని నా ఉద్దేశ్యం''- అన్నాను నేను.

''మీరుచెప్పిన వాటికి నేనూ ఒప్పుకుంటాను. పత్రికకిచెందిన సర్వాధికారాలూ మీవే. రచనల ఎన్నికకూడా మీకే అప్పగిస్తాను. నేనుకోరుకునేదల్లా ఒక్కటే. పత్రికవల్ల లాభం రాకపోతే రాకపోయింది; కనీసం నష్టం రాకుండావుంటే చాలు.''

''ఏమో, నమ్మకమేముంది? మన నూతనభావాలు చాలామందికి నచ్చక పోవచ్చు. రాజకీయ, సామాజిక ప్రగతి కోసమే మనం పనిచేస్తాం. కేవలం తెల్లదొరల స్తోత్రపాఠాలు చదివి, వారి దోషాలన్నీ దాయటం మనకి యిష్ట ముండదు ప్రభుత్వాన్ని పొగిడి ప్రభుత్వాన్ని సంతోషపెట్టడం మన ధ్యేయం కాదు. మన భావాలు మనం స్పష్టంగా ప్రజలకి తెలియపర్చాలి. ఇంగ్లీషు చదువులవల్ల మనంనేర్చుకున్న విజ్ఞానం మనదేశానికి ఉపయోగపడాలి గాని, బ్రిటిష్ దేశానికి కాదు. ఈ అభిప్రాయాలన్నీ మీకిష్టమైతే, నేను మీరడిగిన సహాయం చేస్తాను. మాయింట్లో రాసేవాళ్ళం నలుగురం వున్నాం. మేంరాసే దానికి ప్రతిఫలం తీసుకోం. మా చేతనైనంత సహాయం చేస్తాం; ఆలోచించు

కోండి....".

నా మాటలన్నీ ఆవ్యక్తి శ్రద్ధగా విన్నాడు. అతను మౌనంగా వుండటం చూసి – నాకు ఉత్తరం రాసినవ్యక్తి –"సర్లెండి! మేం ఆలోచించి తర్వాత మీకు మా నిర్ణయం తెలియజేస్తాం...." – అంటూ లేచి నిలబడ్డాడు. ఇంతలో రెండో వ్యక్తి – "లేదు! లేదు.... ఇంకా ఆలోచించే పని ఏముంది? అంతా నిర్ణయమై పోయింది! నేను మీకు మాటయిస్తున్నాను! మీ యిష్టప్రకారమే కానివ్వండి.... ప్రకటన పత్రంరాసి రేపు నాకివ్వండి....ఇందులో యింకమార్పేమీ వుండదు.... పత్రికకి ఏంపేరు పెడదాం?"– అన్నాడు.

'పేరు' అన్నమాట వినగానే నేను చకితుడినయ్యాను. అప్పటిదాకా నేనా సంగతి ఆలోచించనే లేదు. అయినా వెంటనే–"పేరా ? 'కొత్తభావాలు' అనే పెడదాం !"–అన్నాను.

చివరికి ఆ పేరే నిర్ణయమైంది.

## స్వాగతం

నాకు మరో అనుభవం లభించింది. పత్రిక ప్రారంభించడం వల్ల నాపేరుతో అనేక రచనలు చెయ్యసాగాను. అంతకు ముందే వకీలుగా నేను పేరుపొందాను. ఇప్పుడీ ఉపన్యాసాల వల్ల, రచనల వల్లా చాలామందికి నా పేరు తెలిసింది. సనాతన భావాలు గల వారంతా నన్ను నిందించడం ప్రారంభించారు. నా గురించీ, సుందరి గురించీ అక్కగురించీ, అమ్మ గురించీ ఎన్నో అపవాదులు పత్రికల ద్వారా కూడా ప్రచారం చెయ్యడం ప్రారంభించారు. మా పత్రిక మొదటి సంచిక వెలువడగానే–మరో పత్రికలో ఈ విధంగా ప్రకటించారు.

"మనకో చెత్తపత్రిక అవతరించింది. దానిపేరు కూడా చెత్తగానేవుంది. ఈ పత్రిక సంపాదకుడు కూడా అలాంటి వాడే.

విశ్వవిద్యాలయంవారి నాలుగు పుస్తకాలు చదివి పాండిత్యం సంపాదించాడు.

న్యాయశాస్త్రం నాలుగు ముక్కలు చదివాడు. ఇవే అతని 'కొత్తభావాలు'. ఈ వ్యక్తి గత చరిత్ర అంతా కడునీచమైనది. ఇతని తల్లి మరణాంతం పుట్టింట్లోనే వుంది. మేనమామ సహాయంతో ఇతను చదువుకున్నాడు. కాని చివరికి ఆ మేనమామనే తిరస్కరించి కృతఘ్నుడైనాడు. కొంతమంది దగుల్బాజీ విద్యార్థుల్ని సేకరించి ఒక క్లబ్ స్థాపించాడు. వాళ్ళందరికీ ఉపన్యాసాలిస్తూ వుంటాడు. ఇవీ ఇతని 'కొత్తభావాలు'. తన కూతురికి ఇప్పటికీ పెళ్ళి చెయ్యకుండా వుంచి, మిషనరీ పాఠశాలకి పంపి చదువు చెప్పించిన పెద్ద మనిషి ఇతనికి సహాయకుడు. ఆ అమ్మాయి మరో సహాయకారి. ఇక ఇతని అక్క ఎలాంటిదో యింతకుముందే మేం పాఠకులకు తెలియజేశాం. 'కొత్తభావాలు' నడిపేవారి చరిత్ర ఇది. ఇకముందు వీరు చెయ్యబోయే ఘనకార్యా లేమిటో చూద్దాం."

ఈ రకంగా మా పత్రికకి స్వాగతం లభించింది. ఒక రోజు నా ఉపన్యాసంలో ఒక కథ చెబుతున్నాను. శ్రోతలంతా శ్రద్ధగా వింటున్నారు. ఇంతలో నామిత్రుడి పక్కన కూర్చున్న ఒక వ్యక్తి అడుగుతున్నాడు—"ఎవరీ ఉపన్యాసమిచ్చేఅతను? సంస్కర్తలాగా వున్నాడే ! కాని...."

"కాదు, కాదు. ఈయన సంస్కర్తకాడు. నేను చాల మాసాలుగా ఈయన ఉపన్యాసాలు వింటున్నాను. స్త్రీవిద్య గురించిగాని, పునర్వివాహాల గురించిగాని ఎన్నడూ ఈయన చెప్పలేదు. మీ రెప్పుడూ ఈయన ఉపన్యాసాలు వినలేదను కుంటాను. చరిత్ర; విజ్ఞానశాస్త్రాలకి సంబంధించిన నూతన భావాలు ఈయన ఉపన్యాసాల్లో కనిపిస్తూవుంటాయ్...."

"అయితే ఎవడో మిషనరీ అయివుంటాడు. ఇలాంటి వాళ్ళంతా ప్రజల్ని మోసం చేసి లోబరచుకుంటారు. ఇత నొక సంస్కర్తఅనీ దుర్మార్గుడనీ విన్నాను నేను. మా యింటి పక్కన వినాయకరావని ఒకతను వున్నాడు. వీళ్ళిద్దరూ ఒక స్కూల్లోనే చదివారట. ఇతని సంగతి వినాయకరావ్‌కి బాగా తెలుసు ; ఎప్పుడో ఒకరోజు వచ్చి ఇతని పని పడతానన్నాడు ; భలేగావుంటుందిలే, అలా జరిగితే !"

ఈ సంభాషణ విన్నప్పట్నించీ నేను మరింత జాగ్రత్తగా వుండటం ప్రారం

ఖించాను. నన్నెవరో ఏదో చేస్తారని కాదు. నా కృషికి ఏమీ ఆటంకాలు కలగకుండా వుండాలనే. అందువల్ల ఉపన్యాసాలు కూడా చాలా జాగ్రత్తగా యివ్వసాగాను. ఒకరోజు మా యింట్లో వాళ్ళంతా ఉపన్యాసం వినడానికొచ్చారు. ఆరోజు వచ్చిన వారిలో కొందరు నన్ను నిందించడానికి వచ్చినవారై వుండొచ్చు. తరువాతివారం ఉపన్యాసానికి ఇంకా ఎక్కువమంది జనం వచ్చారు. ఆ సమావేశంలో నా గురించి అబద్ధాలు ప్రచారం చేసే ఒక కరపత్రం ఎవరో పంచి పెట్టారు. అందులో నాపై చేసిన ఆరోపణలన్నీ అతిభయంకర మైనవి. ఆవేళ మాయింట్లో వాళ్ళెవరూ ఉపన్యాసానికి రాకపోవడం మంచిదైంది. ఇంతలో ఒక పోకిరీవాడు లేచి—"దీనిలో రాసివున్నది నిజమా, కాదా?"—అని అడిగాడు, నన్ను సంజాయిషీ అడుగుతున్నట్టుగా. అతని చుట్టూవున్న జనం చప్పట్లు కొట్టడం ప్రారంభించారు. నా ఉపన్యాసాల్లో ఇంతకు ముందెన్నడూ యిలాంటి సంఘటనలు జరగలేదు. గత ఉపన్యాసానికి, సుందరి,అక్క వాళ్ళు వచ్చివుండటం చేత, ఇవ్వాళకూడా వస్తారు; బాగా అల్లరి చేసి ఏడిపించ వచ్చుననే ఉద్దేశ్యంతో కొందరు వచ్చినట్టున్నారు.

నేను మౌనంగా, పుస్తకం పేజీలు తిరగేస్తూ వుండిపోయాను. "ఆ పుస్తకం ఎగరగొట్టండి"– అని అరిచారెవరో. ఇంకెవరో–"ఒరే, మీ ఆవిడకి నీ దగ్గరుండటం యిష్టంలేకపోతే, ఈయన దగ్గరకి పంపరా! చాలా ప్రేమగా చూసుకుంటాడు!"– అన్నారు, హేళనగా. ఈ మాటలన్నీ విని నాకు అమితమైన కోపం వచ్చింది. ఏం చెయ్యాలా అని సందిగ్ధావస్థలో పడ్డాను. "మాట్లాడకుండా కూర్చున్నావేం? ఉపన్యాసమివ్వు!" – అని అరిచారింకెవరో. ఆవిధంగా అందరూ తలో విధంగా వాగుతూనే వున్నారు. ఏం చెయ్యాలా అని ఆలోచించసాగాను. ధైర్యంగా లేచి బయటికి నడిచాను. నేను గనుక ధైర్యంగా లేకపోతే ఆ పరిస్థితిలో ఆ దుర్మార్గులు నన్నేం చేస్తారో నాకుతెలుసు. అలాచేసే వాళ్ళు పిరికి వాళ్ళయి వుంటారని కూడా నాకుతెలుసు. అందువల్ల నేను గనక ధైర్యంగావుంటే బయటికెళ్ళిపోవచ్చుననుకున్నాను. ఆ నిర్ణయంతోనే బయటికి నడిచాను. కొంత అల్లరి జరిగింది. నా తలపాగా పడగొట్టారు. కాని ఎలాగో అక్కడనుంచి బయటపడ్డాను !

ఇది నాకు కొత్త అనుభవం. నాకు చాలా నిరుత్సాహం కలిగింది.

ఇలాంటి సంఘటనల గురించి నేను ఇంగ్లీషు పుస్తకాల్లో చదివాను. కాని యిప్పుడు నాకే ప్రత్యక్షంగా అనుభవంలోకి వచ్చాయి. ఇలాంటి ఇబ్బందులు నాకు చాలా ఎదురవుతున్నాయి. జరిగిన గొడవంతా యింట్లో చెప్పాను. "ఇక ఉపన్యాసాలు మానేస్తేనే మంచిదేమో. అదీగాక ఇంతవరకూ ఉపన్యాసాలవల్ల పెద్ద లాభం కూడా ఏమీ కనిపించలేదు. ముందుముందు ఇంకేమైనా జరగ కూడని సంఘటనలు జరగవచ్చు"-అంది, సుందరి.

అక్క, వెంటనే- "ఏమన్నావు? ఉపన్యాసాలు ఆపివెయ్యటమా? మనం రక్షణకోసం కట్టుదిట్టాలు చేసుకోవచ్చు; ఇలాంటి వాళ్ళని రానివ్వకుండా చూడ వచ్చు; కాని మన కృషి నిలిపివెయ్యటం మాత్రం నాకిష్టంలేదు .... ఏం భావూ! నిజంగా ఉపన్యాసాలు ఆపివేస్తావా?"-అంది.

నేను అత్యంత గౌరవభావంతో అక్కవైపు చూస్తూ వుండిపోయాను. 'ఈ అమ్మాయి చిన్నప్పుడెంత పిరికిది! అమ్మ ముందుకి రావడానికే భయపడి పోయేది! అస్తమానం అమ్మమ్మ కొంగు పట్టుకుని, అమ్మమ్మ వెనక వెనకే నడిచే ఆ అమ్మాయేనా, ఈ అక్క?'

## చిక్కులు

బావగారు పోయిన తర్వాత చాలా మాసాల వరకూ ఆయన తరఫువారి నుంచి మా కనేక చిక్కులొచ్చాయి. ఎన్నోతిట్లూ, నిందలూ పడవలసి వచ్చింది. ఆ నిందలన్నీ విని మేం బాధపడ్డాం. ఆకాశరామన్న ఉత్తరాలు చాలా వొచ్చేవి. ఈలోగా-బావగారికి దురలవాట్లన్నీ నేర్పిన ఆ ముసలివాడు ఒక దొంగనోటు సృష్టించాడు. తనకి వెయ్యి రూపాయలు బాకీ వున్నట్టు ఆనోటు సృష్టించాడు. ఇది దొంగ ఋణమని మాకుతెలుసు. అయినా అది మా నెత్తిన పడింది. కోర్టులో అది దొంగ పత్రమని రుజావు చెయ్యడానికి ఆధారాలేవీ దొరకలేదు.

బావగారు వెర్రివాడుకాదు. ఆపత్రంమీద ఆయన సంతకముంది. కాని ఆయన ఈ వ్యక్తిదగ్గర వెయ్యి రూపాయలు తీసుకున్నాడా లేదా అనేదే అనుమానం. రుజువు లేమీలేవు. ఇలాంటివే అనేక సమస్యలు వచ్చిపడ్డాయి. నేను ఉపన్యాసా లిస్తూనే వున్నానుగాని, రానురాను నాకు ఇబ్బంది కలిగించేవాళ్ళే ఉపన్యాసాల కెక్కువగా రావడం ప్రారంభించారు. నాలో నిరాశ నిండింది.

బావగారి బంధువులూ, ఆ ముసలివ్యక్తిలాంటి మిత్రులూ అక్కకి సంక్రమిం చిన ఆస్తి అంతా ఏదోవిధంగా లాగేసుకోవాలని ప్రయత్నించసాగారు. అక్కకి కూడ విసుగు కలిగింది. "రుణాలన్నీ మనం తీర్చివేద్దాం. నాకు ఏమీ మిగ లక పోయినా ఫర్వాలేదు. కాని ఈ మానసిక వేదన మాత్రం నేను భరించ లేను." – అంది.

## ర హ స్య ం

ఇంట్లో అందరమూ కూడ ఈ సమస్యలతో, చిక్కులతో వ్యాకుల పడి పోయాం. ప్రజాసేవ చెయ్యాలన్న కోరిక మనసులో ప్రబలంగానే వుంది.కాని ఆ కోరిక ఎలా నెరవేర్చుకోవాలా అన్నదే సమస్యగా తయారైంది. నా ఆలో చన లెప్పుడూ పవిత్రంగానూ, నిర్మలంగానూ వుండేవి. కాని ప్రజలు నేను తలపెట్టిన పనులన్నిటికీ విఘ్నాలు కల్పిస్తున్నారు. ఉపన్యాసాల ద్వారా నేను యువకుల్ని పెడమార్గాల పట్టిస్తున్నానని పత్రికల్లో ప్రచారాలు చెయ్యటం ప్రారం భించారు. నా ఉపన్యాసాల ద్వారా, ఉపదేశాలద్వారా నావెంట నడిచే మిత్రులు చాలామంది లభిస్తారని ఆశించాను. కాని శత్రువులే ఎక్కువ మంది లభించారు.

నేను దారిన పోతూవుంటే జనం నా వైంక విచిత్రంగా చూసేవారు. ప్రజల దృష్టిలో నే నొక వింతవ్యక్తిగా తయారయ్యాను. నన్ను వెక్కిరించే వాళ్ళూ,

మోకాళోళాలు చేసే వాళ్ళూ, తిట్టేవాళ్ళూ ఎక్కువై పోయారు.

రోజురోజుకీ నాలో నిరుత్సాహం పెరిగిపోసాగింది. అసలు నా వల్ల ఏమైనా పని జరుగుతుందా లేదా అనే సందేహం కలుగుతోంది నాకు. ఒకరోజు సాయంత్రం నేను ఒంటరిగా షికారుకెళ్ళాను. చాలాదూరం వెళ్లాను. అలిసి పోయి ఒక బండమీద కూర్చున్నాను. వాతావరణం ప్రశాంతంగా వుంది. ఆలోచనల్లో మునిగిపోయాను. అందువల్ల ఇంటికి వెళ్ళాలనే సంగతే మర్చి పోయాను. వెన్నెల వచ్చింది. చల్లటిగాలి సాగింది. ఎంతసేపు ఆలోచించినా ఏ నిర్ణయానికీ రాలేకపోయాను. ఇక యింటికి వెళదామని లేచాను. జేబులోంచి గడియారం తీసిచూస్తే తొమ్మిదిగంటలైంది. నా కోసం యింట్లో వాళ్ళు కంగారు పడ్డారు. వచ్చేప్పుడు నే నెవరికీ చెప్పిరాలేదు. అదీగాక అంతపొద్దుపోయేదాకా నే నెప్పుడూ బయట తిరగలేదు. శివరామ్‌పంత్‌గారు నా కోసం వెదకడానికి వెళ్ళారు.

సుందరి, వాళ్ళమ్మా — కిందటిసారి జరిగినట్టు ఏం సంఘటన జరిగిందోనని భయపడ్డారు. వాళ్ళు నాకోసం ఎక్కడెక్కడ వెదికారో, అక్క, పంత్‌గారూ చెప్పారు.

ఆరాత్రి నా కంటిమీద కునుకే లేదు. ఏదో పెద్ద ప్రమాదం ముంచుకు రానున్నట్టనిపించింది నాకు. నిద్ర రావటంలేదు. చదువుదామని ఒకపుస్తకం తీస్తే, దానిమీదా మనసు నిలవలేదు. నా ఆశయాల్ని ఏ మార్గాన సాధించాలా అని ఆలోచిస్తున్నాను. మంచంమీదనుంచి లేచాను. నా పుస్తకాలు పెట్టు కునే ఒక చిన్న అల్మారావుంది. అందులో కొద్దిగానే పుస్తకాలున్నాయి. కాని అవన్నీ చాలా మంచి పుస్తకాలు. ఆ అల్మారా దగ్గరకెళ్ళి నిలబడ్డాను. శూన్య దృష్టితో పుస్తకాలవంక చూస్తూ వుండిపోయాను. మనసుకి ప్రేరణ కలిగించే ఉత్తమ గ్రంథాలు నేను చాలా చదివాను. కాని, ఇవ్వాళ ఆ పుస్తకాలుకూడా ఏమీ ఉపయోగపడకుండా వున్నాయి. నా బుర్ర తిరిగిపోతున్నట్టనిపించింది. నేను పిచ్చివాడి నౌతున్నానేమో అనిపించింది. లేదు. వీల్లేదు. నేను పిచ్చి వాడిని కాకూడదు.

ఒక విషయాన్ని గురించి అదేపనిగా ఆలోచించి దానికోసం పిచ్చివాళ్ళయి

పోయేవాళ్ళలో నేనూ చేరకూడదు. మౌనంగా కుర్చీలో కూర్చుండి పోయాను. రాత్రి రెండున్నర, మూడు గంటలైంది. చల్లగాలితిరిగింది. మనసు కాస్త చల్లబడింది. తోటలో పువ్వులు వికసించినట్టున్నాయి. పరిసరాలంతటా పరిమళం వ్యాపించింది. మనసుకి ఆనందంగా వుంది. మేము తోటలో నాలుగైదు కుర్చీలు వేసివుంచాం. వాటిలో ఒక కుర్చీమీద ఎవరో కూర్చుని వున్నట్టుగా అనిపించింది నాకు. కాని ఇంతరాత్రి అక్కడెవరు కూర్చుంటారు? ఇంతలో ఆ వ్యక్తి బరువుగా నిట్టూర్చడమూ, కొంచెం దగ్గటమూ కూడ జరిగింది. నేను పరీక్షగా చూశాను. కాని ఆ వ్యక్తి ఎవరో గుర్తు తెలియటం లేదు.

కొద్దిసేపటి తర్వాత ఆ మానవరూపం తోటలోనుంచి యివతలికొచ్చింది. నా కళ్ళని నేనే నమ్మలేకపోయాను. నేను ముందుకునడిచి– "ఇంతరాత్రిపూట నువ్విక్కడ ఏం చేస్తున్నావ్?"–అన్నాను. సమాధానం రాలేదు.

మేమిద్దరం ఒకరినొకరు చూడసాగాం. ఆమె నిశ్చలంగా నా ముందు నిలబడింది.

"ఏమిటే ఆలోచిస్తున్నావ్? మాట్లాడవేం?"–అని అడిగాను నేను మళ్ళీ.

అయినా సమాధానం రాలేదు.

ఏ ప్రశ్నకీ సమాధానం రాకపోయేసరికి తోటలోకి వెళ్ళి చూద్దామనుకున్నాను. ఆమె వెంటనే చెయ్యి పైకిలేపి నన్ను తోటలోకి రావద్దని వారించింది. ఆమె ముఖం ఆసమయాన కడు గంభీరంగా వుంది. ఆమెని చూసి నాకు కించిత్తు భయంకూడ కలిగింది. ఆ తర్వాత ఆమె చిరునవ్వు నవ్వింది. మళ్ళీ వెంటనే ఆమె మొహం తెల్లగా పాలిపోయింది. తోటలోకి ఇంకెవరైనా వచ్చారేమో నన్న అనుమానం వచ్చింది నాకు. అయితే అందుకు సంబంధించిన అసహజమైన ఆలోచనలేమీ రాలేదు.

నేను మరోసారి తోటలోకి వెళ్ళడానికి ప్రయత్నించాను. ఆమె మళ్ళీ వారించింది. నేనిక వూరుకోలేక పోయాను. "నువ్వింత రాత్రివేళ యిక్కడికెందుకొచ్చావ్? తోటలో ఏంచేస్తున్నావ్? నేను రెండుసార్లు తోటలోకి రాబోతే ఎందుకు వారించావు?"–అని అడిగాను కోపంగా.

అక్కడికీ సమాధానం రాలేదు.

ఆమె మౌనం చూసి నాకు మరికాస్త కోపం వచ్చింది. "నా మీద నీకు నమ్మకం లేదు. లేకపోతే ఇలా మౌనంగా ఎందుకుంటావు? సరే, ఇకముందు నేనూ నిన్ను నమ్మను....సరే, నే వెళుతున్నాను...."—అన్నాను.

నా కోపం పెరిగిపోయింది. ఆ కోపంలోనే మళ్ళీ అడిగాను—

"అక్కా, నీ మీద నాకు కోపం రావటమే నీకు యిష్టమా? నాకు నువ్వూ, నీకు నేనూ తప్ప యింకెవరున్నారు?" అయినా అక్క మాట్లాడలేదు. ఏడుస్తున్నట్టనిపించింది. అక్క కన్నీళ్ళు చూసి నాకు చాలా బాధకలిగింది. అక్క సముద్రంలాంటిదని నాకు తెలుసు. నేను ముందుకు నడిచి, అక్కచెయ్యి పట్టుకుని— "అక్కా ఏమిటిది? ఏమిటింత విచారంగా వున్నావు? ఎందుకేడుస్తున్నావు? నాకు చెప్పవా? నన్ను తోటలోకి ఎందుకు రానివ్వలేదు? ఇందులో యింత రహస్యమేముంది?"—అని అడిగాను, మెల్లగా.

"చెబుతాను....అంతా నీగురించే... నువ్వు నన్ను అనవసరంగా వేధించకు.... అవకాశం వచ్చినపుడు నేనే చెబుతాను...."

"అవకాశం ఏముంది? ఇప్పుడే చెప్పు...."

"చెబుతాను....కాని ఇప్పుడే కాదు...."

"సరే....తోటలో ఎవరైనా వున్నారా?"

"ఎవరూ లేరు."

"మరి నన్నెందుకు రానివ్వలేదు?"

"ఏంచేస్తావక్కడ?....అక్కడేమీలేదు...."

ఒకటి రెండు క్షణాలాగి — "బావూ! అక్కడేమైనా జరిగితే నేను జీవించి వుండను...."—అంది. నే నింకా ప్రశ్న లడుగుతానని కాబోలు—"లోపలికి పద, బావూ! నువ్వెప్పుడూ ఈ వేళప్పుడు మేలుకుని వుండేవాడివి కావు.... ఇవ్వాళింకా మేలుకునే వున్నావేం?"—అంది.

నే నాశ్చర్యంగా—"నే నెప్పుడూ మేలుకోనని నీకెలా తెలుసు?"—అన్నాను.

"ఎలా తెలియటమేమిటి? నువ్వు మేలుకుని వుండగా ఎప్పుడూ చూడలేదు...."

ఆ మాటలే పట్టుకుని, నేను వెంటనే—

"అయితే నువ్వు చాలా రోజుల్నించి తోటలోకి వస్తున్నావన్నమాట!"—

అన్నాను.

"చాల రోజుల్నించి కాదు....ఇవ్వాళ మూడోరోజు....కాదు-మూడోరాత్రి....లోపలికి పద....ఇంట్లో వాళ్ళు నిద్రలేస్తారు...."

ఈ రకంగా నా ప్రశ్నలకి సమాధానా లివ్వకుండా తప్పించుకుంది. మాట మార్చడానికిగ్గాను–"భావూ! ఇవ్వాళెందుకు విచారంగా వున్నావు? నీకు నిద్ర ఎందుకు రాలేదు? కిటికీ తెరుచుకుని, ఇక్కడ ఆలోచిస్తూ నిలబడ్డావా? మూడు పుస్తకాలు తెరిచిపెట్టావు....మూడూ ఒక్కసారే చదువుతున్నావా? పక్క చెదిరి నట్టేలేదు....రాత్రి తెల్లవార్లూ కూర్చునే వున్నావా?"–అంది, వెంటవెంటనే. అని కొద్దిగా నవ్వింది. అది తెచ్చిపెట్టుకున్న నవ్వులా వుంది. "భావూ, పెళ్ళిమీదికి గాలిమళ్ళిందా?"–అని అడిగింది మళ్ళీ. అక్క ఈ రకంగా పరిహాసా లాడుతుందని నేను వూహించలేదు. నేను మాట్లాడకుండా వూరుకోవటం చూసి–

"ఈ మాటడిగినందుకు కోపంగావుందా భావూ? నువ్వు నిజంగా ఈవిషయం గురించే ఆలోచిస్తూంటే....నాకు నిజంగా....చాలా సంతోషంగా వుంటుంది భావూ....నీకు తగిన...."–అంటూ ప్రారంభించింది.

ఇక నేను వినలేక పోయాను. వెంటనే–"అక్కా నీకివ్వాళ ఏమైంది? ఎందుకిలా పిచ్చిదానిలా మాట్లాడుతున్నావు? ఇంతసేపు మేలుకుని వుండటం వల్ల తల భారంగా వుందా?....లోపలికి పద....కాస్సేపు నిద్రపో....నువ్వు చెప్పకుండా నే నెప్పుడూ మళ్ళీ నిన్నావిషయం గురించి అడగను....కాని, యిలాంటి వెర్రిమాటలు మాట్లాడకు...."–అన్నాను.

తెల్లవారింది. ఇంట్లోవాళ్ళు లేస్తారేమోనని అక్క వెళ్ళిపోయింది. కాని నా మనోవేదన మాత్రం అలాగే వుండిపోయింది.

# దేవుడి కోపం

ఆ రాత్రి జరిగిన సంఘటన గురించి మళ్ళీ అడగనని అక్కకి వాగ్దానం చేశాను. మౌనంగా అక్క దినచర్య పరీక్షించ సాగాను. ఆమె జీవితంలో ఏదో మార్పు వచ్చినట్టు కనిపించసాగింది. అన్ని విషయాల్లోనూ కూడ అక్కకి ఆసక్తి తగ్గిపోయింది. తన కత్యంత ప్రియస్నేహితురాలైన సుందరితో కూడ ఎక్కువగా మాట్లాడటంలేదు. ఏకాంతంగా కూర్చుని ఆలోచనల్లో మునిగి పోతోంది. పనిపాటల్లో అంతకుముందు వుండే ఉత్సాహం తగ్గిపోయింది. ఆమె మనసులోని నైరాశ్యపుఛాయలు ఇల్లంతా ఆవరించాయి. నా మనసుకూడ బాధ పడసాగింది.

మేము తలపెట్టిన కార్యసాధన నాబోటివాడివల్ల అసలు అవుతుందా కాదా అని ఆలోచించ సాగాను నేను. ఇప్పటివరకూ కష్టపడి చదువుకున్నాను. చేతనైనంత వరకూ బీదలకి సాయంచేస్తున్నాను. ఇంట్లో నాపై ఎందరు ఆధార పడివున్నారో వారందరికీ సరిపడా డబ్బుసంపాదిస్తే చాలునని నా ఉద్దేశ్యం. అంతకుమించి డబ్బు అవసరంలేదు. వకీలుని కావటంవల్ల నా దగ్గరకి చాలా మంది క్లయింట్లు వస్తూండేవారు. వారిలో ఎవరైనా బీదవారుంటే వారి దగ్గర పైసా కూడ తీసుకోకుండా పనిచేసేవాడిని. దేశసేవ అనేది ఒక్కడివల్ల అయ్యే పని కాదని నిర్ణయించుకున్నాను నేను. నా భావాలకి అనుగుణంగా నడుచుకునే వాళ్ళు మరికొందరు నాకు తోడుగా వుంటే, మళ్ళీ ఉత్సాహంతో పని చెయ్యగలను. మిషనరీలను చూస్తే, స్వార్థ త్యాగమనేది వారిదగ్గరేవుందా అనిపిస్తుంది నాకు. దేశం పరాధీనమై పారతంత్ర్యంలో వుంది. కాని దేశంలో ఎవరూ స్వార్థం విడిచి పనిచెయ్యటానికి సిద్ధపడరు. నవయువకులు దేశమంతా తిరిగి ప్రజల్ని విద్యావంతులుగా చేసి వారి నెందుకు మేలుకొలపరు ? నేనీపని చెయ్యగలనా ? నాకెవరైనా అనుచరులు లభిస్తారా ? ఈ రకమైన ఆలోచనలతో పదిహేను రోజులు గడిపాను. ఒకరోజు అకస్మాత్తుగా నా కొక ఆలోచన వచ్చింది. నా మనసులో సూర్యోదయమైందా అనిపించింది. అప్పటిదాకా నాలో వున్న విస్తబ్ధత; ఉదాసీనత అన్నీ ఒక్కసారిగా పోయాయి. మనసు తేలికపడింది.

ఆర్యోక్తికి అనుసారంగా, అన్నివిధాలా యోగ్యమైనది, సనాతన ధర్మబద్ధమైనది ఏదైనా మార్గాన కృషిచెయ్యగలనా, అని ఆలోచించాను. ఈ ఆలోచన నాకు ఉత్సాహాన్నిచ్చింది. పగటికలలు కనడం ప్రారంభించాను. నాలో నేనే నవ్వు కుంటూ, చప్పట్లు చరవటం మొదలెట్టాను. ఏదో నూతన మార్గం దొరికినట్టయింది. ఇంతలో శివరామ్‌పంత్‌గారు వచ్చారు. నన్ను చూసి బహుశా ఆయనకి ఆశ్చర్యం కలిగివుంటుంది. చాలా రోజులుగా ఆయన నన్నీస్థితిలో చూడలేదు. "నీలో నువ్వే నవ్వుకుంటున్నావేమిటి ?"—అని అడిగారు.

"నా మనసులో వున్న ఒక రహస్యం బయటపడింది. అందువల్ల నవ్వొచ్చింది. మరేం విశేషంలేదు ?''

"రహస్యమా ? ఏం రహస్యం ?"

''ఇన్నాళ్ళనుంచీ ఆలోచన తెగక నేను బాధపడుతున్నాను; ఇవ్వాళ ఆ రహస్యం నాకు తెలిసిపోయింది''—అన్నాను. ఇంతలో అక్క వచ్చింది. ''అక్కా ! దాదా ! నా మనసులో ప్రవేశించిన ఉదాత్తభావాన్ని ఆచరణలో పెట్టడానికి మీ యిద్దరిముందూ సంకల్పం తీసుకుంటున్నాను. మీ యిద్దరి పాదాల సాక్షిగా చెప్తున్నాను; మీ రిద్దరూ నాకు గురుతుల్యులు ;''—అన్నాను, ఆవేశంగా.

నా యీ విచిత్రధోరణి చూసి వాళ్ళిద్దరూ ఆశ్చర్యపోయారు. నేను పిచ్చివాడిని కాలేదుగదా అనిపించింది వాళ్ళకి. 'సంకల్పం' 'పాదాలసాక్షి'—ఇవన్నీ వాళ్ళకి విచిత్రంగా వున్నాయి.

అక్క నా భుజం పట్టుకుని వూపుతూ—''భావూ ! ఏమిటీ మాటలు, పిచ్చివాడిలా ? ఏమిటి నువ్వు సంకల్పించిన కార్యం ? దాదా నీకు ఒక వార్త చెప్పడానికి వచ్చారు; ముందు ఆయన చెప్పేదేమిటోవిను....''-అంది.

''ఆయనమాట నేను విననవా నీ ఉద్దేశ్యం ?''

''ఏమో, నువ్వు నీ సంకల్పం గురించి చెబుతావేమో; మేం చెప్పదల్చు కున్నది చాలా సంతోషకరమైన విషయం, తెలుసా ?''

"సర్లే, ఇక నువ్వు మాట్లాడకు. దాదా, మీరు చెప్పదల్చుకున్నదేమిటో చెప్పండి...."

"భావూ ! నే నిప్పటిదాకా సుందరి వివాహం గురించి ఆలోచించలేదు.

ఆ సంగతి నీకూ తెలుసు. నారీజనాభ్యుదయం కోసం సుందరి కృషిచెయ్యా లన్నది నా ఆశయం. కాని సుందరి తనంతతానుగా ఏమీచెయ్యలేదు. ఇన్నాళ్ళూ నేను సుందరికి అండగా వున్నాను. నేను నిన్న డాక్టరుదగ్గరకె ళ్తే - నాకు గుండెజబ్బు వుందనితేలింది. నేను యింకా ఎన్నాళ్ళుంటానో నమ్మకంలేదు. నువ్వు సుందరిని చిన్నప్పట్నించీ ఎరుగుదువు ; మీ యిద్దరికీ, ఒకరంటే ఒకరికి యిష్టముంది. మీ యిద్దరికీ వివాహం చేద్దామని నేనూ, మీ అక్కా అనుకుంటున్నాం....."

రాత్రితో మాట్లాడితే ఏవిధంగా లాభముండదో, అలాగే శివరామ్‌పంత్‌గారి మాటలు నాపైన ఏమాత్రం పనిచెయ్యలేకపోయాయి. నేను మౌనంగా వూరుకున్నాను. ఇదేమాట ఆయన నిన్న చెప్పివుంటే ఎంతబావుండేది ! నేను తల వొంచుకొని నిలబడ్డాను. నేనలా వుండటంచూసి అక్క ఆశ్చర్యపోయింది. శివరామ్‌పంత్‌గారి మాటలు వినగానే నేను సంబరపడిపోతాననుకుంది. నా చిర కాల స్వప్నం ఫలించిందనుకుంది. అయినా నేను మాట్లాడకపోయేసరికి సిగ్గు పడుతున్నానేమో అనుకుంది. అందుకే—"చిన్నపిల్లాడిలా సిగ్గుపడతావెందుకు ? నీకీ సంగతి తెలియదేమిటి ? నేను మొన్నే అడిగానుగా ? ఇప్పుడు మాట్లాడవేం ?" - అని అడిగింది. నా కళ్ళనుండి రెండు కన్నీటి చుక్కలు రాలాయి. శివరామ్‌పంత్‌గారు, అక్క ఆశ్చర్యపోయారు. "ఏమిటి, ఖాయమేగా ?" - అని అడిగింది అక్క. నేను వెంటనే—"అసంభవం ! అసంభవం !" - అన్నాను.

"అసంభవమా !" - ఇద్దరూ ఒకేసారి అన్నారు-తెల్లబోతూ.

"అసంభవమా ; అదేమిటి ?"

"నే నింతకుముందే తీసుకున్న ప్రతిజ్ఞకి ఇది భంగం కలిగిస్తుంది !"

# పరీక్షా సమయం

అమితమైన ఆవేశం : విచారం ; బాధ....వీటన్నిటితోనూ ఆ మాటలన్నాను నేను. శివరామ్‌పంత్‌గారు చెప్పిన విషయం నా చిరకాల వాంఛనీ, ఆశల్నీ నెరవేర్చే విషయం. చిన్నతనంలో సుందరిని మొదటిసారి చూసినప్పుడే, ఆమె నా భార్యకావాలన్న కోరిక నాలో కలిగింది.

కాని శివరామ్‌పంత్‌గారికి ఆ అభిప్రాయం లేదేమోనన్న అనుమానంతో ఇన్నాళ్ళూ నా కోరికలూ ఆశలూ అన్నీ నాలోనే దాచుకున్నాను. ఇవ్వాళ నా ఆశలు ఫలించే అవకాశమొచ్చిన సందర్భాన – అది 'అసంభవం' అనవలసి వచ్చింది. ఈ విధంగా నా విధి వక్రించింది. ఒక్కరోజు ముందు శివరామ్ పంత్‌గారు నా కీ విషయం చెప్పివుంటే ఎంత బావుండేది! కాని యిలా జరగ వలసివుంది. నేను ప్రతిజ్ఞ తీసుకున్నాను. నోటినుండి వెలువడిన మాటల్ని వెనక్కి తీసుకోవడం ఎలా ?

నే నొక్క మాటకూడా మాట్లాడలేని స్థితిలో వున్నాను. ముగ్గురమూ మౌనంగానే వున్నాం. అక్క మెల్లగా–"భావా! ఏమిటి నువ్వనేది? ఇందులో అసంభవమైన విషయమేముంది? ...ఇంకెవరికైనా మాట యిచ్చావా?''–అంది.

ఆ మాటలు నన్నమితంగా బాధించాయి. మరో పిల్లకి నేను మాటయిచ్చా నన్న భావన అక్కకి రావటం నేను భరించలేకపోయాను. బాధగా–"అక్కా! నువ్వడిగేదేమిటక్కా?"–అన్నాను.

"మేం సంభవం అనుకున్న విషయాన్ని నువ్వు అసంభవమంటున్నావు; అందుకే నేను మరెవరికైనా మాటయిచ్చావా అని అడిగాను...." నా సమాధానం అక్క నమ్మకానికీ, ఆనందానికీ ఆఘాతం కలిగించింది. అందుకే మళ్ళీ ఆవేశంగా–"నీకు చిన్నతనంనుంచీ సుందరిని వివాహం చేసుకోవాలన్న కోరిక వుంది; ఒకసారి సుందరికోసం జబ్బుపడ్డావు; నీ మనసు మారిందంటే నేను నమ్మను; కాని నిజంగా గనుక నీమనసు మారివుంటే నీ అంతటి భాగ్యహీనుడు ప్రపంచంలో మరెవరూ ఉండడు! సుందరిలాంటి రత్నాన్ని పొందడానికి ఏడు జన్మలు తపస్సుచెయ్యాలి! ఇందులో అసంభవమేమిటి? చిన్నప్పుడు నువ్వు

సుందరికొక ఉత్తరం రాశావు గుర్తుందా? ఇప్పుడిలా అంటావా!" - అంది, గుక్క తిప్పుకోకుండా.

ఏం సమాధానం చెప్పాలో నా కర్థం కావటంలేదు. నా మనసుకి పరీక్షా సమయం వచ్చింది. నా జీవితమంతా కన్న కలలు ఫలింపజేసుకునే అవకాశం వచ్చింది. ఆ అవకాశాన్నందుకుని సుఖపడటమా? లేక తీసుకున్న ప్రతిజ్ఞ నెరవేర్చడమా ?

ఇలాంటి స్త్రీ మళ్లీ దొరకదు. సుందరితో నేను గడపగల సుందర జీవితపు దృశ్యాలన్నీ నా కళ్ళముందు కదులుతున్నాయి. నా నిర్ణయం కూడా నాముందే వుంది. ఒక నూతన సంస్థని స్థాపించి, పరోపకారంకోసం జీవితమంతాధారపోసే నిర్ణయమది. ఈ రెంటిలో ఏ మార్గాన్ని ఎన్నుకోవాలి ?

"నువ్వు తీసుకున్న ప్రతిజ్ఞ ఏమిటి? విధవా వివాహం చేసుకుంటానని కాదు గదా?"-అని అడిగింది, అక్క.

ఆ ప్రశ్న నన్ను చాలా నొప్పించింది. "అక్కా! నేను అంతా చెబుతాను. ఇప్పుడెవరి మనసూ ప్రశాంతంగా లేదు. అందరూ కాస్త తేరుకోనీ!"-అన్నాను. శివరామ్‌పంత్ గారి మానసిక స్థితికూడా సరిగాలేదని నేను గ్రహించాను. ఆయన లేచారు. లేస్తూలేస్తూ- "సత్యవ్రతాన్నిమాత్రం ఎన్నడూ విడిచిపెట్టకు. అందులోనే సర్వసుఖాలూవున్నాయి!"-అన్నారు.

అంతకుమించి మరేమీ మాట్లాడలేదాయన. ఆయన అన్న ఈ మాటలువిని నాకు కాస్త ధైర్యం కలిగింది.

## మానసిక సంఘర్షణ

నా మనసులో మహాగ్నిజ్వాలలు చెలరేగాయి. ఏకాంతంగా కూర్చుని ఎంతో ఆలోచించాను. కాని లాభంలేకపోయింది. ఒంటరిగా బయటికెక్కడికో షికారుకెళ్ళేవాడిని. ఒకసారి నదీతీరానికి ; మరోసారి ఏదో కొండమీదికి. ఆ

రకంగానైనా మనప్రేమైనా చల్లబడుతుందేమోనని ఆశ. మనసులో రెండు విరుద్ధభావాలమధ్య యుద్ధం ప్రారంభమైంది. అర్థంచేసుకుని ఆదరించేవారెవరైనా వుంటే నాసంక్షోభమంతా వారిముందు బయటపెట్టేవాడిని. అక్కకి చెప్పి లాభం లేదనిపించింది. ఇప్పుడు అక్క నా అభిప్రాయాలనీ, ఆలోచనల్నీ అర్థం చేసుకునే స్థితిలోలేదు. ఇప్పుడింక ఇంట్లో నాకు విశ్వాసమున్నది ఒక్క శివరామ్‌పంత్‌గారిమీదనే. ఆయనకూడా ఎంతవరకు నన్ను అర్థంచేసుకుంటారో, నాకు చేయూతనిస్తారో నన్నది అనుమానమే. అందువల్ల పుస్తకాల సహాయాన్నపేక్షించాను. కొన్ని పుస్తకాలు చదివాను; మరికొన్నిటి పేజీలు తిరగేశాను. కాని మనశ్శాంతి మాత్రం లభించలేదు. ఆలోచిస్తూ ఆలోచిస్తూవుండగా,—నామనఃఫలకంపైన – నా భవిష్యత్తు యొక్క రెండు చిత్రపటాలు గోచరించాయి.

ఆ చిత్రపటాల్లో నాయకుణ్ణి నేనే. మొదటి దానిలో—సుందరితో నా వివాహం జరిగిపోయింది. సంసారసుఖంలో మునిగితేలుతున్నాను. అక్క నా దగ్గరేవుంది. అక్క చాలా ఆనందంగావుంది. అక్కవొడిలో – అచ్చు నా పోలికలేవున్న ఒక చిన్నకుర్రవాడు కూర్చుని, అక్క చెయ్యి పుచ్చుకుని నవ్వుతున్నాడు. సుందరి తల్లిదగ్గర ఒక చిన్నపిల్ల కూర్చుని చిలకపలుకులు పలుకుతోంది. అక్క, సుందరి యిద్దరూకూడ ఇతర స్త్రీలకి క్లాసులో ఏ; బి; సి; డీలు నేర్పుతున్నారు. ఆ క్లాసులోనే మరొకపక్క కొందరు కుట్టుపనులు నేర్చుకుంటున్నారు. నే నెక్కడికో ఉపన్యాసమివ్వడానికి వెళ్ళాను. ఎవరికో ఏదో దరఖాస్తుపత్రం రాసిపెడుతున్నాను. మేము నడిపే పత్రికలో రచనలు తీసుకెళ్ళడాని కింతలో ఒక కుర్రాడొచ్చి నిలబడ్డాడు. ఇక రెండో చిత్రంలో – నా వేషం పూర్తిగా మారిపోయింది. నూతన మతం స్థాపించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. లోకహితానికిచెందిన కొన్ని చర్చలూ సంభాషణలూ జరుగుతున్నాయి.—నేను రెండు చిత్రాలూ చూస్తూవుండిపోయాను. ఒక దృశ్యం అమితమైన సుఖాలనిస్తుంది. రెండో దృశ్యం మానసిక సుఖాన్నిస్తుంది.

అందులో సంసారసుఖం అణుమాత్రమైనా లేదు. వ్యక్తి సుఖం నశించినా ఫర్వాలేదు. కాని సమాజసుఖం పెరగాలి. వ్యక్తి నశించడానికి ఎంతోకాలం అక్కర్లేదు. కాని సమాజం నశించడానికి కోట్ల సంవత్సరాలు పడుతుంది.

మనం హిందువులం; ఆర్యులం; వశిష్ఠవసుదేవుల-శ్రీరామ,హరిశ్చంద్రుల వంశా నికి చెందినవాళ్ళం; స్వార్థం మనకిలేదు; పరార్థచింతనే మనకి ముఖ్యం. ఈపరార్థ చింతన లేకపోవడంవల్లనే మన దేశానికి అథోగతి పట్టింది. మళ్ళీ దేశాన్ని ఉన్నతదశకి చేర్చాలంటే- అందుకవసరమైన గుణాలన్నిటినీ మళ్ళీ అలవర్చు కోవాలి. - ఇవే ఆలోచనలు రాత్రిం బవళ్ళు నా మనసునిండా ముసురు కుంటున్నాయి.

ఆలోచనలు పెరిగినకొద్దీ నాలో సంఘర్షణ పెరుగుతోంది. ఇంతలో నా దృష్టి కిటికీ వైపుమళ్ళింది. ఏవ్యక్తి గురించి నేను అహోరాత్రాలు ఆలో చిస్తున్నానో, ఏవ్యక్తి విషయంలో ఒక నిర్ణయానికి రాలేక సతమత మౌతు న్నానో, ఆవ్యక్తి - సుందరి - అక్కడ వొంటరిగా నిలబడివుంది : సుందరిని చూడగానే నామనసులోమళ్ళీ సంక్షోభం చెలరేగింది. అందరి యిష్టానికీ వ్యతిరే కంగా, ఐహికసుఖాలన్నిటినీ కాలదన్ని,పారమార్థికసుఖంకోసం జీవితాన్నిఅర్పిం చడమా?సంసారధర్మం నిర్వర్తిస్తూనే దేశసేవ చెయ్యలేమా?పరమార్థాన్ని అన్వే షిస్తూ నేను బయలుదేరితే, నాకెవరూ ఆ మార్గాన తోడు దొరక్కపోతే? నే నొక్కడినీ కృషిచెయ్యగలనా? చేసినా దాని ఫలితమెలా వుంటుంది ?

ఇలాంటి ఆలోచనలన్నీ నా మనసుని ముట్టడించాయి. నేను మోహ పాశాల్లో యిరుక్కుంటున్నానేమో అనిపించింది మళ్ళీ. ఆ భావన రాగానే, కిటికీ దగ్గర్నుంచి యివతలికొచ్చేశాను. నేను తీసుకున్న ప్రతిజ్ఞని వదల కూడ దని నాలో నేను నిర్ణయించుకున్నాను. అలా చెయ్యడం అవినీతి; ఆత్మ వంచన. అంతే. నిర్ణయం జరిగిపోయింది. శివరామ్‌పంత్‌గారికి నామనసులో వున్నదంతా చెప్పేద్దాం; ఏం జరిగితే అది జరుగుతుందని నిశ్చయించుకున్నాను. మెల్లిగాలేచి, ఆయన వున్నచోటికివెళ్ళాను. ఎలా మాట్లాడాలో, భయంగావుంది. కాగితంమీద రాసి చూపిద్దామా, నోటితోనే చెబుదామా అన్న ఆలోచనవచ్చింది. రాయడంకంటే చెప్పడమే మంచిదనుకున్నాను.

ధైర్యం కూడగట్టుకుని, ఆయన దగ్గరకెళ్ళి - "దాదా ! మీ కిష్టం లేని కొన్ని విషయాలు మాట్లాడ్డానికి నాకు అనుమతి యివ్వండి. ఇలాంటి విషయం చెప్పాల్సివచ్చినందుకు నాకు చాలా విచారంగావుంది. కాని

నేనేమీ చెయ్యలేను. మీరు ఆలోచించి నాకు చెప్పండి. మీరూ, అక్కా చెప్పిన విషయం ఎందుకు అసంభవమన్నానో నేను మీకు చెప్పాలనుకుంటున్నాను. మిమ్మల్ని అడగకుండా నేను వొట్టుపెట్టుకున్నాను. నా భావాలన్నీ చెబుతాను, వినండి. మీరొకసారి నా గదిలోకివస్తే, అన్ని విషయాలూ మీకు స్పష్టంగా చెబుతాను." – అన్నాను.

ఆయన మౌనంగాలేచి నా వెనకాల నడిచివచ్చారు. గదిలో నా కెదురుగా పడకకుర్చీలో కూర్చుని – ఆశ్చర్యంగా నావంక చూడసాగారు. నా మనసులో వున్న వుద్దేశ్యాలన్నీ ఆయనకి,వివరంగా చెప్పాను. విన్నతర్వాత ఆయన చాలా సేపటివరకూ మాట్లాడలేదు. నా మాట లాయనకి హాస్యాస్పదంగా అనిపించ లేదుగదా అన్న అనుమానంవచ్చింది నాకు. ఎంతసేపటికీ ఆయన సమాధానం చెప్పటంలేదు. ఇంతసేపు ఆయన ఏమాలోచిస్తున్నారు? ఆయన మౌనం కొద్ది నిమిషాలే అయినా, అవే నాకు గంటల్లా అనిపించాయి. చివరికింక ఉండబట్ట లేక – "దాదా! మీరేమీ మాట్లాడరేం? నేను చెప్పినవన్నీ శ్రద్ధగా విన్నారు గదా? ఈ రకమైన ఆలోచనలున్నవారు; తనువు; మనసు; ధనమూ అన్నీ అర్పించి కృషిచేసే యువకుల అవసరం ఈనాడు దేశాని కెంతయినా వుంది. ప్రజల్లో దేశభక్తి భావాలు; సామాజిక సేవాభావాలూ పాదుకొలపాలి;ఈరకమైన శిక్షణ మామూలు చదువులవల్ల లభించదు; ఇందుకోసం ఒక నూతన మతాన్ని నెలకొల్పాలి; ఒక నూతన మార్గాన్ని కనిపెట్టాలి; ఇందుకు జ్ఞానవంతులూ, సుశిక్షితులూ అయిన యువకులు వూరు వూరు తిరగాలి"–అన్నాను. ఆయన నా మాటలన్నీ విని, మెల్లిగా–"నీలో కలిగిన చైతన్యం అన్నివిధాలా యోగ్యమైనది. నువ్వు నిస్సందేహంగా ఈ కృషి ప్రారంభించు. దీనివల్ల నీకు కీర్తి గౌరవాలు లభించకపోవచ్చు; నీకు అనుచరులు లభించకపోవచ్చు; కాని-కనీసం నీ భావాలు ప్రజల్ని మేలుకొలుపుతాయి; స్వార్థత్యాగం వల్ల అనేక మహాకార్యాలు నేరవేరతాయ్! మేము నీకు సూచించిన మార్గం సుఖదాయకమే! కాని అది శాశ్వత సుఖంకాదు. మరణం వల్ల మనిషి శరీరం నశించిపోతుంది; కాని అతని ఆత్మ; అతని ఉన్నత భావాలూ అజరామరంగా నిలిచిపోతాయి."–అన్నారు. ఈ విధంగా అన్నతర్వాత ఆయన మళ్ళీ మౌనం

వహించారు.

ఆయన సమాధానం విని నే నాశ్చర్యపోయాను. నా ఉత్సాహాన్ని చంపడ మిష్టంలేక ఆయనిలాంటి సమాధాన మివ్వలేదు గదా? నేనాయనవైపే చూడ సాగాను. ఆశీర్వాద భావపు చిహ్నాలు ఆయన మొహాన స్పష్టంగా కనిపిస్తున్నాయి.

## ఆ తర్వాత....

నే నత్యంత గౌరవంతో ఆయనవైపే చూడసాగాను. నా కళ్ళలో నీళ్ళు నిండాయి. నిజంగా ఆయన ఒక అసామాన్య వ్యక్తి. ఆయన వదనాన కించిత్తు ఖిన్నభావం గోచరించింది. ఆయన కిందికి చూస్తున్నారు; నే నాయనవైపు చూస్తున్నాను. ఏ వ్యక్తి ఆశ్రయంవల్ల నేను పెద్దవాడినయ్యానో, నేను విద్యావంతుడినయ్యానో ఆ వ్యక్తి సామాన్యుడు కాదు–ఆయనొక మహావ్యక్తి! ఈయన లాగా మౌనంగా సమాజ ప్రగతికోసం కృషిచేసే వారెందరుంటారా అని నే నాలోచించసాగాను. ఇలాంటి వ్యక్తుల వల్ల ప్రపంచానికెంతలాభమో అస లెవరైనా ఆలోచిస్తారా?

ఇలాంటివారే నిజమైన గురువులు! నిజమైన కార్యకర్తలు! కొంతసేపటి కాయన క్షీణ స్వరంతో–"నీ మార్గాన నువ్వు బయలుదేరేముందు, నేను నీతో ఒక మాట చెప్పాలనుకుంటున్నాను. నీ కిప్పటికే చాలా అనుభవాలు కలిగాయి. క్షణికమూ, సార్వకాలికమూ అయిన వాటి మధ్య గల భేదం నువ్వు తెలుసు కోవాలి. అందువల్ల – ఇంకెక్కడా వుండటానికి చోటులేని నిరుపయోగకరమైన మనుషుల్ని నీ దగ్గరకి చేరనీకు! జ్ఞానప్రవాహంలో దూకడానికి త్రికరణ శుద్ధిగా కోరుకునే వారినే నువ్వు చేరదియ్యి."–అన్నారు.

అని, మళ్ళీ మౌనం వహించారు. సుందరి గురించీ, అక్కగురించీ నాకు ఆలోచనలొచ్చాయి. "దాదా! అక్కని సమాధాన పర్చడం ఎలా? నా అభిప్రాయాలకి అక్క అంగీకరిస్తుందా? ఒప్పుకోకపోతే ఆమెకి

వచ్చజెప్పడం ఎలా ?"—అని అడిగాను.

"నీకాబెంగ అక్కర్లేదు. ఆమెది కొంచెం మూర్ఖస్వభావం. ఆమెకి నేను నచ్చజెపుతాను. నేను నీకు మరోసంగతి చెప్పాలనుకుంటున్నాను. నువ్వు అనుసరించబోయే మార్గంమీద నువ్వెక్కువగా ఆశలు పెట్టుకోగూడదు. ఏ మహావృక్షపు బీజాలు నువ్వు నాటదల్చుకున్నావో—ఆ వృక్షం ఆర్నెల్లలోపు, పెరిగి, పెద్దదయ్యేదికాదు. కొన్ని సంవత్సరాల తర్వాతగాని ఆ బీజాలు అంకురించవు. ఆ తర్వాత ఇంకెన్నో సంవత్సరాలకి గాని, ఆకులూ కొమ్మలూ రావు. పుష్పించడానికి మరికొన్ని సంవత్సరాల కాలం పడుతుంది. ఆ చెట్టు ఫలాల గురించి నువ్వసలు వూహించనైనా వూహించకూడదు. బీజం నాటిన తర్వాత—అంకురదశని నువ్వు చూడగలిగావంటే నువ్వు గొప్ప అదృష్టవంతుడి వన్నమాటే!....సరే, ఇక నేవెళుతున్నాను....నీ మార్గాన అవరోధాలేమీ రాకుండా వుండాలనీ, నీ ఉత్సాహం తగ్గకుండా వుండాలనీ నేను మనసారా కోరుకుంటు న్నాను. ఇదే నీకు నా ఆశీర్వాదం....ఉపదేశం."

ఆయన నేత్రాలు అశ్రుపూరితాలైనాయి. స్వరం గద్గదమైంది. "నేను వున్నంతకాలం ఫర్వాలేదు; కాని ఆ తర్వాత—నేను రెండు బాధ్యతలు నీకూ మీ అక్కకీ అప్పగించి వెళుతున్నాను. మొదటిది—నేను ఎన్నుకున్న సేవామార్గం; రెండోది....సుందరి బాధ్యత. సుందరికి నీ భార్య అయ్యే అదృష్టం లేకుండా పోయింది. ఇక కేవలం నీ సోదరిగా ఆమెని చూసుకో ! సుందరికి తనంత తానుగా బ్రతకగల శక్తిలేదు. అందుకే మరొకరి ఆధారం కావాలి. నువ్వూ, నీ అక్కా మీరిద్దరే సుందరికి ఆధారం...."—ఆయనింక మాట్లాడలేక పోయారు. వెంటనే లేచి బయటికి వెళ్ళిపోయారు.

ఆయన మాటలు నా మనసులో అలజడిని కలిగించాయి. చాలాసేపు అలాగే కూర్చుండిపోయాను. కొంతసేపటికి భోజనానికి రమ్మని పిలుపువచ్చింది. భోజనాల దగ్గర అంతా మౌనంగానే వున్నారు. ఒక్కరు కూడా నోరు విప్పలేదు. అక్కకి నా నిర్ణయం యింకా తెలీదు. కాని ఆ సాయంత్రం అన్ని విషయాలూ చెప్పేశాను. అక్క తననితాను చాలా సంభాళించుకుంది. ఆ రోజు నాగదిలోకి వచ్చి—"భావూ ! నాకు నీ మీద కోపంవుందని అనుకోకు; దాదా నా కంతా

చెప్పారు: నీ కర్తవ్యం నువ్వు నెరవేర్చు: అదే శ్రేయస్కరం. అదే పాఠం నేను నేర్చుకున్నాను. కాని భావూ, ఇప్పుడు నీ వల్ల ఏర్పడిన పరిస్థితి గురించి ఏమైనా ఆలోచించావా ? నేను అర్ధరాత్రివేళ తోటలో ఎందుకు తిరుగుతున్నానో తెలుసా, భావూ ? అది నీ గురించే....!"—అంది.

"నా గురించా ?....అందులో నాకు సంబంధ మేముంది ?" — అన్నాను, ఆశ్చర్యంతో.

"అమ్మ ఆత్మ—నీకేదో పెద్ద ఆపద రానున్నదని నన్ను హెచ్చరించింది !"

నాకు నవ్వొచ్చింది. "అక్కా! నువ్వుకూడా 'ఆత్మ'ల్ని నమ్ముతున్నావా?"—అన్నాను, నవ్వుతూ నే.

"నువ్వు నమ్ము; నమ్మకపో. ఇది మాత్రం నిజమే; నాకు బాగా నమ్మకం కలిగింది."

"ఎలా ?"

"ఒకసారి కలలోనూ; మూడుసార్లు ప్రత్యక్షంగానూ !"

"కలలసంగతి విన్నాను....కాని ప్రత్యక్ష నిదర్శనమేమిటి ?"

"ఒకరోజు అమ్మ నా కలోకి వచ్చింది. నొసట పెద్ద కుంకుమబొట్టువుంది. నీకు పెద్ద ఆపద కలగబోతోందని నాతో చెప్పింది. వాణ్ణి జాగ్రత్తగా చూసుకో మని నన్ను హెచ్చరించింది. అలా మూడుసార్లు చెప్పింది....ఆ తర్వాత నాకు మెలకువ వచ్చింది. నేను విచారంతో అర్ధరాత్రి తోటలో తిరుగుతూ వుండగా.... అమ్మ నాకు ప్రత్యక్షంగా నే కనబడింది ! మూడు రాత్రులనుంచి నేను అమ్మని చూస్తున్నాను....మాటి మాటికీ అమ్మ అదే మాట చెబుతోంది....!"

"ఏమని ?"—అని అడిగాను. అక్క మొహాన వున్న గాంభీర్యం చూసి, ఇది నవ్వులాటకాదనీ, ఇందులో తప్పక ఏదో రహస్యం వుందనీ గ్రహించాను.

"అమ్మ చెప్పినమాట నిజమే అయింది! నువ్వు పెళ్ళి చేసుకుని సుఖంగా వుండవలసినవాడివి....అకస్మాత్తుగా నీమార్గం మార్చుకున్నావు. ఇది ఒకరకంగా ఆపదేగా?"—అంది అక్క.

ఆ మాటలకి నాకు నవ్వొచ్చింది. నా నూతనమార్గం గురించి అక్కకి వివరంగా చెప్పాను. నా మాటలు పూరికేవింది. చాలా రోజులవరకూ అక్క

విచారంగానేవుంది. సుందరితల్లి కీ విషయాలన్నీ తెలీవు. బహుశా సుందరికి తెలిసి వుండొచ్చు. అక్క ఏదోవిధంగా సంతోషంగావుంటే చాలనుకున్నాను నేను. కాని అక్క అలాగే, విచారంగానేవుంది.

## రెండు ముఖ్యమైన ఉత్తరాలు

అక్కతో మాట్లాడిన తర్వాత – సుందరితో కూడా నా ఆలోచనల గురించి చెబుదామనిపించింది నాకు. అక్క అన్ని విషయాలూ యిప్పటికే సుందరికి చెప్పేసింది. కాని నా నోటితో నేను చెబితే బాగుంటుందనిపించింది. కాని సుందరితో ఈ మాట ఎలాచెప్పడం ? ఏ మోహం పెట్టుకుని సుందరితో ఈ మాట చెబుతాను? నాకేమీ తోచక అక్క సలహా అడిగాను. "నువ్వాపని చెయ్యకు; సుందరి ఎంత బాధపడుతోందో నీకు తెలీదు"–అంది, అక్క.

అక్క, సుందరి– వారిద్దరి మనసూకూడ నా నిశ్చయానికి అనుకూలంగా లేక పోవడం నేను గమనించాను. నేను స్థాపించదల్చుకున్న నూతన వ్యవస్థ గురించి ఆలోచించసాగాను. ఇంతలో మామయ్య దగ్గర్నుంచి ఒక ఉత్తరమొచ్చింది. మా మధ్యవున్న సంబంధాలు దాదాపు తెగిపోయినట్టే. సంవత్సరానికి ఒక సారో రెండుసార్లో మామధ్య ఉత్తరాలు నడుస్తున్నాయి. అంతే. మామయ్య రాసిన ఉత్తరంలో నాకొత్త నిర్ణయాన్ని గురించే ఉండటం చూసి నే నాశ్చర్య పోయాను. ఈ సంగతి ఆయన కెలా తెలిసిందో నాకర్థం కాలేదు. ఎందుకంటే ఇంట్లోవాళ్ళకి తప్పితే మరెవరికీ నే నీ సంగతి చెప్పలేదు. మరి అలాంటప్పుడు వెంటనే మామయ్య ఈ సంగతిగురించి ఎలారాశాడు? ఆ ఉత్తరంలో–

"ఆశీర్వాదాలు. చాలామాసాలుగా మనం ఒకరికొకరు ఉత్తరాలు రాసుకో లేదు. అమ్మ ఆరోగ్యం రోజురోజుకీ క్షీణిస్తోంది. ఇక ఎక్కువ రోజులు బ్రతకదు. మీ మాటలు విన్నప్పుడల్లా మీ గురించి ఎంతో బాధ పడుతూ

వుంటుంది అమ్మమ్మ. ఇప్పుడు నువ్వు పెద్దవాడివయ్యావు, పెద్దచదువు చదువు కున్నావు.

అందువల్ల నువ్వేపనిచేసినా,చెయ్యకూడని పని ఏదీ చెయ్యవని మాకు నమ్మక ముంది. నువ్వు ఈ కాలపువాడివి. ఎన్నో కొత్త ఆలోచనలు నీ మనసులో వుంటాయి; నేను నీ అభిప్రాయాలకీ, ఆలోచనలకీ ఎన్నడూ అడ్డు చెప్పలేదు; అగౌరవపర్చలేదు. కాని ఈ మధ్య నీ గురించి చాలా విషయాలు విన్నమీదట, అమ్మ కోరికపై నీకీ ఉత్తరం రాస్తున్నాను. పాతతరంవాళ్ళు పూర్తిగా మూర్ఖులనీ, కొత్తతరం వారి ఆలోచనలు వాళ్ళకి గిట్టవనీ నువ్వనుకుంటే అది పొరపాటు. నా అభిప్రాయాలు పనికిరానివనితోస్తే, ఈ ఉత్తరం చింపిపారెయి.

నువ్వు వకీలు వృత్తి వదిలేసి, సన్యాసం పుచ్చుకుని కొత్త ఆశ్రమాన్ని,ఒక కొత్తమార్గాన్నీ నిర్మించబోనున్నట్టు నాకిప్పుడే తెలిసింది. మాయిష్టప్రకారం గాకపోయినా,నీ యిష్టప్రకారమైనా పెళ్లి చేసుకుంటావేమోనని మేము ఆశించాం. కాని కొత్త ఆలోచనలపేరుతో-సర్వస్వమూ త్యజించి, ఆశ్రమ స్థాపనచెయ్యడం అన్ని విధాలా వెర్రితనమని నా ఉద్దేశ్యం. నువ్వు ఈవిషయంలో ప్రతిజ్ఞ తీసు కున్నావనీ దాన్ని విడిచిపెట్టవనీకూడ నేను విన్నాను.

కాని అవివేకంవల్ల పెట్టుకున్న వొట్టు - ఇంట్లోవాళ్ళకి హితంకంటే, అహితాన్నే ఎక్కువ కలిగిస్తుంది. మనం సామాన్య మానవులం. దేవతలం కాము. భీష్మడిలాంటి వాడిలోవున్న దైవికశక్తులు మనలోలేవు. సంసార ధర్మాన్ని నిర్వరిస్తూకూడా ఆశ్రమ స్థాపన చెయ్యవచ్చు. పురాణాల్లో మనం చదువుకున్న ఆశ్రమాల్లోవుండే పవిత్రత నీ కొత్త ఆశ్రమంలో వుంటుందా? ఆశ్రమం అన్నపేరునే నువ్వు కళంకపరుస్తున్నావు. అందువల్ల ఈ వెర్రి తనమంతా వదిలేసి, పెళ్ళిచేసుకుని నీ వంశాన్ని వృద్ధిచేసుకో. ఇదే నీకు మంచిది...."

నా నూతనభావాల గురించి అక్కకీ, శివరామ్‌పంత్‌గారికీ తప్ప ఇంకెవరికీ తెలియదు. అందువల్ల ఈ విషయాలన్నీ మామయ్యకెలా తెలిశాయా అనే నా ఆశ్చర్యం. అక్కమీద నా కనుమానంగా వుంది. నా అనుమానాన్ని నేను అక్కకి చెప్పలేదు. మామయ్య దగ్గర్నుంచి ఉత్తర మొచ్చిందని కూడా

చెప్పలేదు. మామయ్యకి ఉత్తరం రాయాలావద్దా అని ఆలోచించాను. చివరికి— ఏమైనా సరే నా ఆలోచనలన్నీ విపులంగా తెలియజేస్తూ, ఉత్తరం రాయాలనే అనుకున్నాను.

కాగితం, కలం తీసుకొని ఉత్తరం రాశాను....

పూజ్యులైన మామగారికి—

పాదాభివందనాలు. నీ కసలు ఉత్తరం రాయాలా వద్దా, రాస్తే ఏం రాయాలీ అని ఆలోచిస్తున్నాను. ఎందుకంటే ఇంట్లో పెద్దవాళ్ళకి పిన్నలమీద కోపం వచ్చినపుడు, పిల్లలు తమతప్పులేదని నిరూపించడానికి ప్రయత్నించినా ప్రయోజనం వుండదు. అందువల్ల పెద్దల కోపం మరింత పెరిగే ప్రమాదం కూడా వుంటుంది. ఉత్తరాల్లోకూడా యిదే జరుగుతూ వుంటుంది. ఉత్తరం మామూలుగా సరళంగానే వున్నా అవతలి వారికి అందులో విపరీతార్థాలు గోచరిస్తాయి. నా ఉత్తరం విషయంలో కూడ అలా జరగదని ఆశిస్తున్నాను. చిన్నతనంనుంచీ నాకున్న అనుభవాలన్నీ నిన్ను ఉదారుడిగానూ, సరళ స్వభావుడిగానూ చూపించాయి. అందువల్ల నామనసులో వున్న భావాలన్నీ నీకు స్పష్టంగా పూర్తిగా చెప్పదలచుకున్నాను.

ఇప్పటి వరకూ నా ప్రవర్తన మీకూ, అత్తకీ, అమ్మమ్మకీ ఆమోద యోగ్యంగా లేదన్న విషయం స్పష్టమే. నీ సహాయంవల్ల, ఆశ్రయం వల్ల నే నే నీ స్థానానికి రాగలిగానని నాకుతెలుసు.

నేను కృతఘ్నుడినని మీరనుకుంటున్నారు. అయితే ఆ విషయం మీరెప్పుడూ నాతో చెప్పనూలేదు. ఉత్తరాల్లో రాయనూలేదు. ఏది ఏమైనా, మొదట్నుంచీ కూడ నా జీవితాన్ని నే నొక విభిన్నదృక్పథంలోంచి చూశాను. అయిదారు సంవత్సరాలనుంచీ నా కొక గురువు లభించారు. ఆయన భావానుసారంగా నడుచుకోవటంలో నా జీవితదృక్పథమే మారిపోయింది. నేను చూస్తున్న కోణం సత్యమైనదేనని నా అభిప్రాయం. నాకు సత్యమని తోచిన వన్నీ నేను ఆచరించాను. లోక హితానికి ఉపకరిస్తాయనుకున్నవన్నీ స్వీకరించాను. దీన జనానికి నా శక్తి కొద్దీ సేవ చేశాను. భగవత్కృప వల్ల ఏదో కొద్దిగా జ్ఞానం కూడా సంపాదించాను. అవసరాన్ని మించి డబ్బు సంపా

దించాలన్న ప్రలోభానికి నేనెన్నడూ లోనుకాలేదు. ప్రజల ప్రశంసలవల్ల నేనెన్నడూ గర్వపడలేదు. ఎప్పుడూ సత్యంవైపే మొగ్గుచూపుతూ వచ్చాను నేను. నా న్యాయవాద వృత్తిలో కూడ – నీరుకి నీరూ, పాలకి పాలూ వేరుచేసి చూపడమే నా ధర్మంగా పెట్టుకున్నాను. అందువల్ల చాలామందికి నేను యిష్టం లేకుండా పోయాను.

ఇప్పటి వరకూ నేనిలాగే నడుస్తూవచ్చాను. నా ప్రయాత్నాల్లో ఎన్నోసార్లు పరాజయాన్ని పొందాను.అయితే మాత్రం ఏం? సద్వివేకంతో జ్ఞానాన్ని ప్రచారం చెయ్యాలన్నదే నేను కోరుకునేది. నేను సర్వసంగపరిత్యాగినై ఆశ్రమ స్థాపన చెయ్యాలనుకోవడంలోవున్న ఉద్దేశ్యం – మీరనుకున్నట్టుగా – కాషాయబట్టలు కట్టుకొని 'నారాయణ; నారాయణ'—అంటూ నలుగుర్నీ మోసం చెయ్యటం కాదు. ఇలాంటి కపట వేషాలు నేను జీవితంలో ఎన్నడూ వెయ్యలేదు. సత్యం; శివం—ఈ రెండే నా జీవితవలయంలో కేంద్రాలు. నేను వివాహం చేసుకోకుండా నామిత్రులకి బోధించేది ఒక్కటే—మన స్వార్థత్యాగాల ఉద్దేశ్యం—మన బోధనల వల్ల ప్రజలకి సుఖంకలగాలనే. దేశమంతా తిరిగి ఇవే భావాలు ప్రచారం చేస్తాం. పురాతన సంప్రదాయాలవల్లా, అంధవిశ్వాసాలవల్లా ప్రజలకి కష్టనష్టాలు కలిగే సందర్భాల్లో అలాంటి వాటిని నిర్మూలించడానికి ప్రయత్నిస్తాను. ఇలాంటి భావాలున్నవారు, నాకొత్త మార్గంలోకీ, నాకొత్త ఆశ్రమంలోకీ అడుగు పెట్టవచ్చు. ఈ కృషిలో నాకు సాఫల్యం లభించినా లభించక పోయినా సరే, నేను నా కర్తవ్యాన్ని నిర్వర్తిస్తూనే వుంటాను.

ఈ కార్యం కేవలం ఒక వ్యక్తిదికాదు. ఒకటి రెండు తరాల కృషి ఇది. అందువల్ల నా చేతనైన ప్రయత్నం చెయ్యడమే నా కర్తవ్యంగా భావిస్తాను నేను.

ఇప్పటివరకూ నాలా బాగా చదువుకున్నవారు తినడం; త్రాగడం; నిద్ర పోవటం; గౌరవప్రతిష్ఠలు సంపాదించుకోవడం తప్ప ఇంకేం చేశారు? అదే వారి కర్తవ్యమని వారి ఉద్దేశ్యం. బీదల కష్టాలు తొలగించడానికి మనం ప్రయత్నించలేదు. జాతిభేదాలు రూపుమాపడానికి ప్రయత్నించలేదు. మన సుఖాల్లో మనం మునిగిపోయివున్నాం. నా యీ అభిప్రాయాలు నీకు రుచించక

పోవచ్చు. కాని మామయ్యా, మధ్యేమార్గం లేదనే నా ఉద్దేశ్యం. అందుకే నేనీ మార్గాన్ని ఎన్నుకున్నాను. ఇందుకోసం నేను నా ప్రతిభ; నాబుద్ధి; శక్తి అన్నీ అర్పించాను. అందువల్లనే నీవంటి పూజ్యనీయులు నా మార్గానికవరోధం కాకూడదని నేను కోరుకుంటున్నాను. నన్ను ఆశీర్వదించు. నన్ను క్షమించు".

ఇదీ, నేను మామయ్యకి రాసిన ఉత్తరం. ఈ రకంగారాసి ఉత్తరంపోస్టు చేశాను.

ఆశ్రమ స్థాపనతర్వాత, విద్యార్థి సభలో నేనొక ఉపన్యాసమిచ్చాను. ఆ తర్వాత బొంబాయి వైద్య విద్యార్థుల సమావేశంలో మరో ఉపన్యాసమిచ్చాను. "రోగబాధితులకి మీరు ఆరోగ్యదానం; జీవనదానంచేసి వారి వారి కుటుంబాలకీ మిత్రులకీ సంతోషాన్ని చేకూరుస్తూ వుంటారు మీరు. నిర్మలబుద్ధి; నిర్మలమైన కార్యాచరణా, ఇవి మీకు సహజసిద్ధాలు. ఇంత మహనీయకార్యం మీ వల్ల జరుగుతూ వుంటుంది. అందువల్ల—మిత్రులారా! ఈనాడు దేశానికి మీ అవసరం ఎంతయినావుంది." – అని ఉపన్యసించాను.

నాఆశ్రమంలో ఎవరైనా డాక్టర్ వచ్చిచేరాలని నాకోరిక.నేను హృదయపూర్వకంగాయిచ్చిన ఉపన్యాస ప్రభావం శ్రోతలపైన పడింది. ఉపన్యాసం పూర్తయిన తర్వాత నేనువెళ్ళబోతూ వుండగా—నా వెనక ఒకయువకుడు వచ్చాడు.అతనేదో చెప్పడానికి ప్రయత్నిస్తున్నట్టుగా వున్నాడు. అతని విశాలనేత్రాల్లో వెలుగుతున్న కాంతి చూసి నా కానందం కలిగింది. కొద్ది క్షణాలపాటు మే మిద్దరమూ మౌనంగానే వున్నాం. "మీరేమైనా అడగాలనుకుంటున్నారా? అడగండి...." – అన్నాను, నేను.

"నేను మీతో చాలాచాలా విషయాలు మాట్లాడాలనుకుంటున్నాను. మీరునన్ను మీ అనుచరుడిగా స్వీకరించండి. మీ బసకి వచ్చి మీతో మాట్లాడాలనుకుంటున్నాను...."–అని, ఇంగ్లీషులో సమాధానం యిచ్చాడా యువకుడు.

## ప్రారంభం

"నేను హైస్కూల్లో వుండగానే మీపేరు విన్నాను. మీ అభిప్రాయాలు; మీ రచనలు; మీ చరిత్ర; వీటన్నిటి ప్రభావం నా మనసుపైన బాగా పడింది. మీ దర్శనం చేసుకోవాలన్న కోరిక యిన్నాళ్ళకి ఫలించింది. మీ మార్గాన నడవాలనీ, మీ సాన్నిధ్యాన గడపాలనీ అనుకుంటున్నాన్నేను. కాని మాతల్లి దండ్రులు ఒప్పుకోవడం లేదు. కిందటి సంవత్సరమే నా పెళ్ళి చేద్దామను కున్నారు. కాని నేను పట్టుపట్టడంచేత ఒక సంవత్సరంపాటు ఆప్రయత్నాలు ఆగిపోయాయి. ఇప్పుడు మళ్లీ పెళ్లిచేసుకోమంటున్నారు. నేను మీలాగే వ్రత స్వీకారం చెయ్యాలనుకుంటున్నాను. నా డాక్టర్ చదువు చివరి పరీక్ష కాగానే నేను మీ దగ్గరకి రావాలనుకుంటున్నాను. నాకు యిద్దరు తమ్ముళ్ళున్నారు; వాళ్ళు నా తల్లిదండ్రుల దగ్గరవుంటారు"-అన్నాడా యువకుడు.

అతనికి మహావుంటే పంధొమ్మిదేళ్ళో యిరవయ్యేళ్ళో వుంటాయి. అతని మాటలు; అతని ఉత్సాహం; అతని స్ఫూర్తి గమనించి నేను ఆనందించాను. ఒక మంచి అనుచరుడు లభించాడని సంతోషం కలిగింది. అతని యింటి విషయాలన్నీ అడిగాను నేను. నా అభిప్రాయాల గురించి అతనూ అడిగాడు. ఒక గంట గడిచేసరికి మేమిద్దరమూ చాలా సన్నిహితులమై పోయాం. బాల్య స్నేహితులు చాలా సంవత్సరాల తర్వాత తిరిగి కలుసుకున్న ఆనందం, అను భూతీ కలిగాయి మాకు. ఆవేళ మరికొందరు కూడా విద్యార్థులువచ్చి కలిశారు. నా అభిప్రాయాల గురించి అడిగారు. త్వరలోవచ్చి నాతో చేరుతామన్న కోరిక వెళ్ళబుచ్చారు. కాని అంత మాత్రాన నేను సంబరపడిపోలేదు. ఒకటి రెండు చోట్ల ఉపన్యాసాలివ్వడానికి రమ్మని ఆహ్వానాలూవచ్చాయి. ఉపన్యాసాలివ్వడానికి ఎవరు పిలిచినా సరే, కాదనకూడదన్నది నానియమం. అనేక విషయాలపైన ఉపన్యాస లివ్వడం ప్రారంభించాను. ఎవరైనా నన్నుపొగిడితే, నేనా ప్రశంసలు స్వీకరించే వాడినికాదు.

ఈ రకంగా రోజులు గడుస్తున్నాయి. రోజూ ఉదయం నాలుగు గంటలకి లేచేవాడివి. నాలుగున్నర గంటలకి కూర్చుని రచనలు చేసేవాడిని. 'కొత్త

ఖావాలు' పత్రికకి రచనలు చేస్తూనే వున్నాను. ఉపన్యాసాలివ్వడానికి వెళ్ళి నపుడు ఉపన్యాసం కూడా పూర్తిగా రాసుకునేవాడిని. ఆ తర్వాత కొన్నాళ్ళకి 'దేశానికి మేలు—కీడు' అన్నవిషయం మీద ఒక పుస్తకం రాయాలనుకున్నాను. అందుకు కావలసిన సమాచారమంతా సేకరించడం ప్రారంభించాను. ఉదయం ఆరున్నరనుంచి, ఏడున్నర గంటలదాకా గ్రంథరచన చేసేవాడిని. ఆ తర్వాత నగరంలోకి వెళ్ళి, సామాన్య ప్రజలయిళ్ళకి వెళ్ళి కొన్ని విద్యావిషయాలు వారికి బోధించేవాడిని. పది గంటలకి భోజనం చేసి ఆ తర్వాత చదివేవాడిని. సాయంత్రం మళ్ళీ విద్యాబోధనకి వెళ్ళేవాడిని. రోజంతా చేసే పనులగురించి మిత్రులతో చర్చలు జరిపే వాడిని. దినచర్య రాసుకునేవాడిని. అప్పుడప్పుడూ ఉత్తరాలు కూడా రాస్తూవుండేవాడిని. రాత్రి ఒక గంటసేపు ఆధ్యాత్మిక విషయాలు చదివి, దాదాపు పదకొండు గంటలకి నిద్రపోయేవాడిని.

శని, ఆదివారాలు స్కూళ్ళకీ, ఆఫీసులకీ, కర్మాగారాలకీ శెలవుదినాలు గనక ఆ రెండురోజులూ ప్రచారంకోసం బయటికి వెళ్ళేవాడిని. శనివారంమధ్యాహ్నం స్కూలు పిల్లల్ని సమావేశపరిచి వారికి ఉపయుక్తమైన విషయాల గురించి ఉపన్యాసాలిచ్చేవాడిని. ఈ నిత్య కార్యక్రమంలో అప్పుడప్పుడూ ఆటంకాలు కూడ కలుగుతూ వుండేవి. అయినా నేను వాటిగురించి పట్టించుకునేవాడిని కాదు. అక్కకి ఎప్పుడూ ఉత్తరాలురాస్తూ, ఆమె చెయ్యవలసిన కృషికి ప్రేరేపించేవాడిని.

బీద విద్యార్థులకి ఉచితంగా విద్యాబోధనచేసే పథకాలు కొన్ని రూపొందించాను. ధనవంతులు, వ్యాపారస్థుల వద్ద విరాళాలు సేకరించి పాఠశాలలు నెలకొల్పాం. కొన్నిచోట్ల నెలకొల్పిన పాఠశాలలు బాగా నడుస్తున్నాయి.

ఈ రకంగా మూడు సంవత్సరాలు గడిచాయి. ఈలోగా నాకు అయిదుగురు అనుచరులు లభించారు. మొదటి మిత్రుడు బొంబాయివాడు. పరీక్షలు రాయగానే నాదగ్గర కొచ్చేశాడు. అతని తల్లిదండ్రులు బాగా తిట్టారు. అవమానం చేశారు.

అతను నా కత్యంత సన్నిహిత మిత్రుడయ్యాడు. ఆ తర్వాత బి. ఏ. ప్యాసయిన యువకు లిద్దరు వచ్చి చేరారు. మరి కొన్నాళ్ళకి—ఒక మెట్రిక్

పాసయిన విద్యార్థి;కాలేజీలో. రెండు సంవత్సరాలు చదివిన మరో విద్యార్థి వచ్చి చేరారు. మాలో మాకు భేదాభిప్రాయాలు లేవు. మా ఆరుగురిలో ఒకతనికి భగవద్గీత అంటే చాల యిష్టం; మరొకతనికి భౌతికవాదం యిషం; మరొకతను వేదాంతి. అందరం కలిసి అనేక విషయాల గురించి చర్చించే వాళ్ళం. మా మతానికి కేంద్రస్థానం చూడాలన్న ఆలోచన వచ్చింది మాకు. ఒక ఆశ్రమం కావాలి; దానితోపాటు మా మార్గానికి ఒక పేరుకూడా పెట్టాలి. ఇవి లేకుండా ఒక గుర్తింపు లభించడం కష్టం. ఆశ్రమం; పేరూ అవసరమని యిప్పటిదాకా అనుకోలేదు నేను. కాని నా అనుచరుల్లో ముగ్గురు అత్యంత ఉత్సాహంతో పనిచేస్తున్నారు. నా తర్వాత కూడా ఈ మార్గాన్ని సజీవంగా వారు నిలిపివుంచ గలరన్న నమ్మకం కలిగింది నాకు. ప్రచారం బాగా జరిగితే, ఎంతో కొంతదేశానికి మేలు జరుగుతుంది గదా అన్న ఆలోచన వచ్చింది.

ఒక రోజు నాకు బాగా తలనొప్పివచ్చింది. అందువల్ల బయటికి వెళ్ళకుండా మఠంలోనే కూర్చుని చదవటం, రాయటం చేస్తున్నాను. మధ్యాహ్నసమయం కావటంవల్ల నాకు మరీ బాధగావుంది. కొన్నాళ్ళనుంచి నా ఆరోగ్యం పాడయి పోయింది. నేనేదో రాసుకుంటున్నాను. ఇంతలో గది తలుపు తెరుచుకొని— రామానంద్ లోపలికి వచ్చాడు. "దాదాపు నెలరోజులనుంచీ మీతో ఒక ముఖ్య మైన విషయం చెప్పాలనుకుంటున్నాను"— అన్నాడు. అతనలా అనడం నా కాశ్చర్యాన్ని కలిగించింది. ఇతను నన్ను వదిలి వెళ్ళిపోవడం లేదుగదా అను కున్నాను. అతని మొహం ఆందోళనతోనూ, బాధతోనూ నిండివుంది. నేనొక్క క్షణం మౌనం వహించాను. నాకు అనుమానం కలిగింది. నలుగురు మిత్రులు బయట నిలబడి వున్నారు. వారి అలికిడి విని—"రామానంద్! నావల్ల ఏదైనా పొరపాటు జరిగినా, నా ప్రవర్తనలో ఏదైనా దోషం కలిగినా నిస్సంకోచంగా నాతో చెప్పు. నేనేమైనా అనుకుంటానని సందేహించకు. ఈ రకంగా నువ్వు ఈ మార్గాన్ని విడువకు, నీ మనసులో వున్నమాటేమిటో చెప్పు...."— అన్నాను.

నా మాటలు విని అతను చలించి పోయాడు. కొంతసేపాగి, మెల్లిగా— "భావానంద్! మీ ప్రవర్తనలో దోషాలెత్తిచూపడ మన్నది మీశత్రువులకి కూడ సాధ్యంకాదు. మేము మీ ప్రియశిష్యులం; మీలో దోషాలేమీ లేకుండానే ఎలా

వెళ్ళిపోతాం ? నే నిక్కడికొచ్చింది; మా అందరి తరపునా మీ కొక్క విన్నపం చెయ్యడానికి...."—అన్నాడు;

"నాకు విన్నపమా !....రామానంద్ ! మనమంతా ఒకే పనిలో వున్నాం; ఒకే మార్గాన నడుస్తున్నాం; మనలో గురుశిష్య సంబంధాలుగాని; ఎక్కువా తక్కువలుగానిలేవు. నీ మనసులో వున్నదేమిటో స్పష్టంగా చెప్పు; నువు చెప్పదల్చుకున్నది చెప్పడానికి – 'ప్రార్థన'; 'వినతి' యిలాంటి పదాలు వాడ వలసిన పనిలేదు."—అన్నాను, నేను.

"భావానంద్; మీరు రెండుమాసాలపాటు పూర్తిగా విశ్రాంతి తీసుకోవాలి...."

నాకు ఆశ్చర్యం కలిగింది. "పూర్తిగా విశ్రాంతి ? రామానంద్ ! మనం అవలంబిస్తున్న మార్గం విశ్రాంతి కోసంకాదు; విశ్రాంతికి పరలోకం వుంది; మనం నిర్వర్తించవలసిన మహాకార్యానికి యింకా ప్రారంభమే జరగలేదు.

నువ్వు విశ్రాంతి తీసుకోమంటున్నావా ? ఈ శరీరంలో ప్రాణం వున్నంత వరకూ విశ్రాంతి తీసుకోవటమనే ప్రసక్తేలేదు. ప్రతిక్షణమూ మనదికాదు; దేశానిది. మనవల్ల ఎంత ఎక్కువ పని అయితే అంత ఎక్కువ పని చెయ్యాలి. ఇదే మన కర్తవ్యం"—అన్నాను.

చివరిమాట అంటూ నేను లేచి నిలబడ్డాను. కాని కళ్ళుతిరిగి పడిపోయాను.

రామానంద్ నాకు ఉపచారాలు చేశాడు. నాకు కొంతసేపటికి తెలివివచ్చింది. బయట నిలబడ్డ నలుగురూ కూడ లోపలికి వచ్చారు. "భావానంద్ ! మీరు కొన్నాళ్ళపాటు విశ్రాంతి తీసుకోక తప్పదు. మీరు విశ్రాంతి తీసుకునేట్టు చేస్తాం...."—అన్నారంతా.

"దాదాపు నెలా పదిహేనురోజుల నుంచీ మీ ఆరోగ్యం పూర్తిగా పాడయిపోయింది; మీ కళ్ళు నిస్తేజమై పోయాయి; మీ కంఠం బలహీనమై పోయింది; మీకు తెలియదా ఆ సంగతి ? మీవంటి వారి జీవితం త్వరగా పరిసమాప్తి చెందితే....ముందు ముందు ఈ కార్యం ఎలా నెరవేరుతుంది ? మీరు లేకుండా మే మిదంతా ఎలా నిర్వహించగలం ? మీరు శాంతంగా కూర్చోండి. చెయ్యవలసిన దేమిటో మాతో చెప్పండి....మీరు మాత్రం కొన్ని రోజులు విశ్రాంతి తీసుకోక తప్పదు...."—అన్నారు రామానంద్.

అతని మాటలు విని నాకు నవ్వొచ్చింది.

## చి వ రి కి....

వాళ్ళ దృక్పథం ప్రకారం వాళ్ళు నాకు నచ్చచెప్పడానికి ప్రయత్నిస్తున్నారు. నేను నిర్వికారంగా వింటున్నాను. "మీ రెన్నివిధాల చెప్పినా నేను వినిపించుకోను. మామూలు జలుబు; దగ్గు యిలాంటి వాటికి నేను భయపడను; ఇలాంటి చిన్న చిన్న విషయాలకి ప్రాధాన్యత యివ్వడం వల్లనే పనికి ఆటంకాలు కలుగుతాయి. మీరిక వెళ్ళండి. నేను నా వ్యాసం పూర్తిచేసుకోవాలి. మాటలవల్ల సమయం వృథా చెయ్యకండి. నేను నాలుగు గంటలకి ఒకచోటికి ఉపన్యాస మివ్వడానికి వెళ్ళాలి...."—అన్నాను.

నేను రాసుకోవడం ప్రారంభించాను. వారందరి మొహాల మీదా నిరాశ కనిపిస్తోంది. వారేదో చెప్పాలనుకుంటున్నారు గాని, నా కఠిన ప్రవర్తన వల్ల చెప్పలేక పోతున్నారు.

చివరికి రామానంద్ ధైర్యం చేశాడు—

"నేను స్టెతస్కోపుతో మీ గుండె పరీక్షించాలి; అప్పటి వరకూ నేను మిమ్మల్ని బయటికి వెళ్ళనివ్వను"—అన్నాడు.

"నాపని నన్ను చేసుకోనివ్వు; వెళ్ళి నీ పని నువ్వు చూసుకో. సాయంత్రం అందరి గుండెలూ తీరిగ్గా పరీక్ష చేద్దువుగానిలే"—అన్నాను, నేను హేళనగా నవ్వుతూ.

అక్కడితో రామానంద్‌కి కోపంవచ్చి వెళ్ళిపోయాడు. మిగతావాళ్ళు కూడ వెళ్ళిపోయారు.

నా పని పూర్తిచేసుకుని ఉపన్యాస మివ్వడానికి వెళ్ళాను. కాని ఆ రోజు మంచే—నాలో ఏదో మార్పు జరుగుతోందని నా కనిపించడం ప్రారంభించింది. మాటి మాటికీ కళ్ళు తిరిగి పడిపోతున్నాను. తల నొప్పివస్తోంది. మొదట

ఉన్నంత ఉత్సాహం లేదు. అయినా నా కర్తవ్యాన్ని నేను నిర్వర్తిస్తూనే వున్నాను. రామానంద్ రోజూ నా దగ్గర కొచ్చి నా ఆరోగ్యం గురించి పోరు పెడుతూనే వున్నాడు. నేను ఈ విధంగా జబ్బు పడతానని నేను వూహించనైనా లేదు. అక్కడ చెప్తేనే నేను వింటానని నా అనుచరులు భావించారు. ఆ విషయం గురించి నన్ను అడిగారు. నా కెందుకో ఒక్కసారి కోపం వచ్చింది.

"మీరు పనిచెయ్యడానికొచ్చారా? ఇలాసమయం వృథాచెయ్యడానికొచ్చారా!"- అని బిగ్గరగా అరిచాను. నేనేం మాట్లాడుతున్నానో నాకే తెలియకుండా మాట్లాడాను. ఒక్కసారిగా కళ్ళుతిరిగి కిందపడిపోయాను. నా కెప్పుడు తెలివొచ్చిందో, ఎలావచ్చిందో నాకేమీ తెలియదు. కాని ఆ రోజునుంచీ-నా ఆశయాల ఆరాటం; శారీరక అనారోగ్యాలమధ్య సంఘర్షణ చెలరేగింది.

## రామానంద్ కథనం

"కాని ఆరోజునుంచీ-నా ఆశయాల ఆరాటం; శారీరక అనారోగ్యాల మధ్య సంఘర్షణ చెలరేగింది" - ఇవేమాటలు భావానంద్ తమ ఆత్మకథలో రాశారు. ఆ తర్వాత ఆత్మకథ రాసేసమయం ఆయనకి లభించలేదు. ఆయన ఆరోగ్యం కాస్త బాగుపడిన తర్వాత-డైరీ రాసుకోవడానికి మాత్రం ఆయనకి అనుమతి యిచ్చాం మేము. కాని ఆయన చాలా తక్కువ రాస్తున్నారు. ఆయనిప్పటివరకూ రాసిందికాక-ఆతర్వాత ఆయన ఆత్మకథలో రాయదగ్గ సంఘటనలేవీ జరగలేదు. చిన్నతనంనుంచి ఇప్పటిదాకా ఆయన ఆత్మకథ పూర్తిగా పరిశీలిస్తే—

ఆయన మానసికశక్తి చాలా దుర్వినియోగమై పోయిందేమోననిపిస్తుంది. జీవితయాత్ర ఇంతత్వరగా ముగిస్తున్న ఈ వ్యక్తి ఇన్నాళ్ళుమాత్రం ఎలా బ్రతికి వున్నాడన్నది, నా వైద్యజ్ఞానం ప్రకారం చూస్తే నాకాశ్చర్యం కలిగిస్తుంది.

ఆయన తన డైరీలో రాసుకున్న సంఘటనే దాదాపు చివరిదని చెప్పవచ్చు.

ఆవేళ ఆయన చాలసేపు స్పృహలేకుండా పడివున్నారు. ఆయన ఉపన్యాసం మివ్వడానికి బయలుదేరారు. మేము ఎంతచెప్పినా వినలేదు. ఎట్టి పరిస్థితుల్లోనూ ఉపన్యాసం యిస్తానని యిచ్చినమాట తప్పనన్నారు. మీబదులు నేను వెళ్ళి ఉపన్యాసమిస్తానన్నాను నేను. కాని ఆయన అందుకుకూడా ఒప్పుకో లేదు. ఉపన్యాసమివ్వడానికి బయలుదేరారు. జబ్బుతోవున్న ఒక కార్మికుడి యింటికివెళ్ళి అతనికి మందులుకూడా యిచ్చివచ్చారు. తమ ఆరోగ్యాన్ని లెక్క చెయ్యకుండా రోజూ అలాగే వెళ్ళటం ప్రారంభించారు. మే మింక చేసేదిలేక, మా పనులన్నీ మానేసి ఆయన వెంటనే తిరగటం ప్రారంభించాం. అది ఆయనకిష్టంలేదు. కాని మే మాయన్ని విడిచి వుండటానికెంతమాత్రం అంగీకరించలేదు.

ఈ రకంగా ఆయన తమపట్టు విడవకుండా చాలాసార్లు ఉపన్యాసాలివ్వడానికి వెళ్ళారు. జబ్బుతోవున్న ఆ కార్మికుడి యింటికివెళ్ళి అతనికి సేవలు చేశారు. ఒకరోజు ఉత్తరంపోస్టుచెయ్యడానికని రాత్రివేళ బయటికివెళ్ళారు. తిరిగొచ్చే టప్పుడు వర్షం పడింది. బాగా తడిసివచ్చారు. మర్నాటి ఉదయానికి మాట కూడా సరిగారాని స్థితిలో వున్నారు. జ్వరంకూడా బాగా వచ్చింది. "ఇవ్వాళ మిమ్మల్ని ఎట్టి పరిస్థితుల్లోనూ ఉపన్యాసానికి వెళ్ళనివ్వను నేను. ఇలాగే మరి కొన్నాళ్లు చేశారంటే, త్వరలోనే మీరు మరణిస్తారు" - అన్నాను, కాస్త కోపంగా.

ఆయన వెంటనే-"అయితే ఏం? ఆశ్రమంలో తీసుకుని తీసుకుని చచ్చేకంటే దేశసేవాకార్యంలో మరణించడం మంచిదేగా? వెర్రివాడా! ఉపన్యాస మిచ్చినంత మాత్రాన ఎవరైనా మరణిస్తారా? ఇవ్వాళ నా ఆరోగ్యం బాగానేవుంది. ఇవ్వాళ నేను ఉపన్యసించబోయే విషయంకూడా చాలా మంచిది! పండితులు కూడా కొందరు నా ఉపన్యాసం వినడానికి వస్తున్నారు. ఇవ్వాళ బాగా మాట్లాడతాను! నువ్వు వైద్యుడివి కావటంచేత ఎప్పుడూ అశుభమే ఆలోచిస్తూవుంటావ్.... వెళ్ళు, వెళ్ళు.... వెళ్ళి నీ పని చూసుకో!"-అన్నారు.

ఆవేళ ఆయనకేమైందో తెలీదు; మా మాట ఎంతమాత్రం వినిపించుకోలేదు. నేను వద్దన్నాకూడా వినకుండా ఉపన్యాస మివ్వడానికి వెళ్ళారు. ఉపన్యాస

మిస్తూవుండగా, ఆయనకి అమితమైన ఉత్సాహం వచ్చింది. భారత ప్రాచీన వైభవాన్ని అద్భుతంగా వర్ణించారు. ఆయన పాండిత్యం చూసి శ్రోతలంతా ముగ్ధులైపోయారు. ఆవేశంతో ఆయన కంఠంకూడా పెద్దదైంది. ఇదే ఆయన చివరి ఉపన్యాసమని మేము కలలోకూడ అనుకోలేదు. ఆ రోజు ఉపన్యాస మిచ్చినతర్వాత, ఆశ్రమంలో మేమందరమూ ఆయన్ని బాగా ప్రశంసించాం. ఆయన బాగా అలసివుండటంచేత త్వరగా నిద్రపొమ్మని మేము బ్రతిమాలాం. ఆయనకూడా కాదనలేదు. మాట్లాడకుండా వెళ్లి పడుకున్నారు. మా మాట కాదనకుండా ఆయన ఎలా అంగీకరించారో నాకు ఆశ్చర్యంగావుంది. నేను నా గదిలోకి పడుకోవటానికి వెళ్ళేముందు, ఆయన గదిలోకి తొంగి చూశాను.ఆయన గాఢ నిద్రలో వున్నారు.

నిద్ర పోవటంవల్ల ఆయనకి కాస్త విశ్రాంతి లభిస్తుందిగదా అని నేను కూడ సంతోషించాను. నేను నా గదిలోకి వెళ్ళిపోయాను. ఎంతసేపటికీ నిద్ర పట్టలేదు. ఉపన్యాసమిచ్చే సమయంలో అసమానతేజంతో వెలిగిపోయిన ఆయన మొహం కళ్ళముందు కనిపించింది. ఆయన మమ్మల్ని విడిచి వెళ్ళిపోతే మేం చేపట్టిన మహత్కార్యం ఏమౌతుందా అన్న ఆలోచన వచ్చింది. అర్ధరాత్రి వేళ రెండుమూడుసార్లు ఆయన గదిలోకి వెళ్ళిచూశాను. ఆయనలాగే నిద్ర పోతున్నారు. నాకు మూడుగంటల తర్వాతగాని నిద్రపట్టలేదు. తెల్లవారి లేవగానే ఆయన గదిలోకి వెళ్ళి చూశాను. ఆయనింకా నిద్రలేవలేదు. మొహాన కళలేదు. నేను వెంటనే నాడి పరీక్షించాను. స్టెతస్కోపుతో గుండె పరీక్షించాను. హృదయస్పందన, చాలా మందంగావుంది. ఛాతీ పరీక్షించిన తర్వాత వీపుమీదకూడ స్టెతస్కోపు పెట్టి పరీక్షించబోయాను. ఇంతలో ఆయన లేచారు. ఆదుర్దాగా– "ఎవరు? ఏమిటి?" – అన్నారు బిగ్గరగా. "నేనివ్వాళ మీ గుండె; నాడి పరీక్షించాలి"–అన్నాను, నేను వినయంగా. ఆయనందుకు వెంటనే అనుమతి యిచ్చారు.

"నాకేం జరిగింది?"–అని అడిగారాయన. నేను మౌనం వహించాను. కాని ఆయన నా మనోభావం గ్రహించారు. వెంటనే– "నా మరణం సమీపించింది. నువ్వాసంగతి దాస్తున్నావుగదా? నువ్వాసంగతి దాచిపెట్టవలసిన అవసరం లేదు.

నాకా సంగతి ఎప్పుడోనే తెలుసు; ఆ బల్ల మీద చూడు, ఏముందో.... !" – అన్నారు.

ఆమాట వినటంతోటే నేను ఆశ్చర్యపోయాను. వ్యాకులపడ్డాను.

"నువ్వేమీ గాబరాపడకు. నేను ప్రయాణానికి సిద్ధంగావున్నాను. ఇంకా పని చెయ్యగల అవకాశం నాకు లభిస్తే బాగానే వుండును. కాని నీ బోటి కార్య కర్త లా బాధ్యత వహించినప్పుడు నాకింక ఆచింతలేదు...."–అన్నారాయన.

నేను బల్లదగ్గరకి వెళ్ళిచూసాను. అక్కడొక పెద్దకవరూ, దానిపక్కనే ఇంకా పెద్దకవరూ వున్నాయి. ఆ కవరుమీద నాపేరే రాసివుంది. కవరు మీద ఒకమూల పెద్దపెద్ద అక్షరాలతో– నా మరణానంతరం చదవవలెను" – అని రాసివుంది.

ఆయన ఆత్మస్థైర్యానికి నేను చకితుడినై పోయాను.

ఆరాధనా భావంతో ఆయనవంక చూడసాగాను. ఆయన ఈ ఉత్తరా లెప్పుడు రాశారో నాకర్థంకాలేదు. నా ప్రశ్న గ్రహించారా అన్నట్టుగా, ఆయన వెంటనే–"నేను సుమారు ఒంటిగంటకి నిద్రలేచాను. ఇంక ఎక్కువరోజులు బ్రతకననిపించింది నాకు. నాగుండె అతివేగంగా కొట్టుకోసాగింది. కాస్త శాంతించగానే–ఉత్తరాలు రాయాలనిపించింది. దాదాపు నాలుగింటివరకూ ఇవన్నీ రాసి, బల్లమీదపెట్టి, పడుకున్నాను....ఇక మరణం ఎప్పుడైనా రావచ్చు నను కున్నాను!"–అన్నారు.

"ఇలాంటి మాటలెందుకు మాట్లాడతారు? ఇంకా మీరు చెయ్యవలసిన పని చాలావుంది. నిజానికి మీకేమీ జరగలేదు. కాస్త బలహీనత–అంతే. కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకుంచేచాలు! బొంబాయిలో వుంటే మీకు విశ్రాంతి దొరకదు. రేపే బయలుదేరి ఏదైనా గ్రామానికి వెళ్దాం. ఇన్నాళ్ళూ మేము మీ ఆజ్ఞలన్నీ పాటించాం; ఇక మీరు మా ఆజ్ఞ పాటించక తప్పదు!"–అన్నాను నేను.

ఎంతో సేపు నచ్చజెప్పిన తర్వాత ఆయన మామాట అంగీకరించారు.

"మీరు ఎలా చెబితే నే నలా వింటాను; కాని మీ ప్రయత్నాలన్నీ వ్యర్థం. పనిచేస్తూ చేస్తూ మరణించాలన్నది నా కోరిక. నా కోరిక మీరు నెరవేరనివ్వటం లేదు...."–అన్నారాయన.

ఆ తర్వాత ఆయన మౌనంవహించారు. ఇంత త్వరగా ఏదైనా జరుగుతుందని ఎవరూ అనుకోలేదు. ఏదైనా ఉపాయ మాలోచించాలనుకున్నాను నేను. అందుకే బొంబాయి విడిచి వెళ్ళే ప్రయత్నాలు ప్రారంభించాం. ఎట్టి పరిస్థితుల్లోనూ ఆయన మాట వినకూడదని నిశ్చయించుకున్నాం. మర్నాడు మేమంతా ఒక గ్రామానికి వెళ్ళిపోయాం.

ఆయన ఆరోగ్యం గురించి మేము బాగా శ్రద్ధ తీసుకున్నాం. అయినా ఆయన తమ పట్టు విడిచిపెట్టకుండా ఏవో పనులు చేస్తూనే వున్నారు. కాస్త విశ్రాంతి దొరికి, ఆరోగ్యం కాస్త బాగుపడితే చాలు—వెంటనే చుట్టుపక్కల రైతులందర్నీ పిలిచి వారితో మాట్లాడేవారు. ఎండలో వెళ్ళి కూర్చునేవారు. గాలిలో తిరిగేవారు. పిల్లల్ని పోగుచేసి వారికేవో పాఠాలు నేర్పుతూ వుండేవారు. మే మేదైనా చెప్పబోతే మా మీద కోప్పడేవారు. ఈ రకంగా అక్కడికి వెళ్ళినా కూడా ఆయనకి విశ్రాంతి లభించలేదు. ఆయన బలహీనత క్రమక్రమంగా పెరిగిపోయింది. అసలు స్వరూపమే మారిపోయింది.

శివరామ్‌పంత్‌గారినీ, భావనంద్ అక్కగారినీ, సుందరినీ—అందర్నీ రప్పించాలని మేము నిర్ణయించుకున్నాం.

## రామానంద్ కథనం

మా ఉత్తరం అందగానే ఆ రోజే అందరూ వచ్చారు. వారందర్నీ చూసి భావానంద్‌కి చాలా ఆనందం కలిగింది. ఆయన పరిస్థితి చూసి-సుందరి; ఆయన అక్కా రాళ్ళుద్రవించేలా ఏడిచారు. శివరామ్‌పంత్‌గారు ఆయన పక్కన కూర్చున్నారు. ఆయన మొహం నల్లబడిపోయింది. పుత్రుడిని చివరిసారిగా చూస్తున్నపుడు తండ్రి హృదయం ఏవిధంగా అల్లాడిపోతుందో, శివరామ్ పంత్‌గారి హృదయం కూడా అదే విధంగా అల్లాడిపోతోంది.

భావూరావ్-భావానంద్ – ఆయనకి పుత్రసమానుడుకాదు- పుత్రుడే. భావా

నంద్ అక్క విపరీతంగా ఏడుస్తోంది. భావానంద్ మౌనంగా చలించకుండా వున్నారు. కొంతసేపటికి మెల్లిగా—"అక్కా! నువ్విక్కడికి వచ్చి యిలా చేస్తావని నేనూహించలేదు; నువ్వు ధైర్యస్థురాలివి; నువ్వు నిర్భయంగా వుండాలి; నువ్వు నిర్వహించవలసిన కార్యాలు ముందుముందు యింకా ఎన్నో వున్నాయి...." – అన్నారు.

"భావూ, భావూ! అలాంటి మాటలు మాట్లాడకు.... నువ్వుగనక లేకపోతే నావల్ల ...."

భావానంద్ మధ్యలోనే ఆమెమాటకడ్డుతగిలి, ఆమె భుజం పట్టుకుని – "ఛీ,ఛీ! పిచ్చిదానిలా ఏమిటామాటలు? నువ్విలా ధైర్యం కోల్పోతే అంతా నవ్వుతారు....దాదా! మీరుకూడా అలావున్నారేమిటి? మీరైనా అక్కకి నచ్చ జెప్పండి....అది చూడండి....అక్కడ...."

ఆపైన ఆయనింక మాట్లాడలేక పోయారు. అందరికీ ధైర్యం చెప్పారు గాని, ఆయన ధైర్యం దిగజారిపోయింది. కంఠం గద్గదమైంపె. కళ్ళలో నీరు తిరిగింది.

ఈ రకంగా ఆయన కుటుంబసభ్యులు వచ్చిన మొదటి రోజంతా దుఃఖ పూరితంగా గడిచింది. ఎట్టి పరిస్థితుల్లోనూ ఆయన్నింకేమీ పని చెయ్యనివ్వ కూడదని ఆ మార్నాడు మేం నిశ్చయించుకున్నాం. చుట్టుపక్కల గ్రామాల ప్రజలూ, రైతులూ ఆయన అనారోగ్యంగా వున్నారని తెలిసి చూడ్డానికి రావడం ప్రారంభించారు. ఆయన పాండిత్యం; సన్యాసాశ్రమ స్వీకరణ; స్వార్థత్యాగం– వీటన్నిటి ప్రభావం ప్రజల మనసులపై గాఢ ముద్రవేసింది. ఆయన దర్శనం కోసం వచ్చేవారి సంఖ్య రోజురోజుకీ పెరిగిపోసాగింది. ప్రజల్నిరాకుండా చేద్దామని మేంప్రయత్నించాం. కాని భావానంద్ మామాట వినలేదు. ఒక్కో రోజు జ్వరంవచ్చి, వారంరోజులదాకా అలాగే వుండిపోయేది. మేం మందు లిస్తూనే వున్నాం. కాని ఆయన ఏదో ఒక పనిచేస్తూనే వుండటంవల్ల, ఆమందులవల్ల ఫలితమేమీ లేకుండా పోయింది. ఒకరోజు ఆయనకి నూట నాలుగున్నర డిగ్రీల జ్వరం వచ్చింది. అయినా లెక్కచెయ్యకుండా పత్రికకి వ్యాసం రాయాలి; ఎక్కడో స్కూల్ తెరవాలి; ఇలాంటివన్నీ చెప్పడం

ప్రారంభించారు. ఆయన మనోబలం నిజంగా అపారం.

మేమాయన ప్రాణాలు కాపాడ్డానికి నిరంతరం ప్రయత్నిస్తూనే వున్నాం. కాని అధిక శ్రమకారణంగా ఆయన శరీరంలోని శక్తి రోజురోజుకీ సన్నగిల్లడం ప్రారంభించింది. ఒకనాడు అయిదుగురు వ్యక్తులు ఆయన్ని కలవడానికి వచ్చారు. వారిలో ఒకవ్యక్తి – "మీరు సంస్కర్తగా మారిపోయారుగాని, లేకపోతే ఈ పాటికి ప్రభుత్వంలో పెద్ద ఆఫీసరు పదవి మీకు లభించి వుండేది?"– అన్నాడు. ఆ మాట వినగానే భావానంద్ చలించిపోయారు. అమితమైన ఆవేశంతో – "ఆఫీసర్ పదవా! ఉన్నతస్థానమా!.... నాకిప్పుడున్న స్థానం ఉన్నతమైంది కాదా? దేశభక్తుడిగా, దేశసేవకుడిగా వుండటం వున్నతమైంది కాదా?.... ఛీ,ఛీ! ఏమిదౌర్భాగ్యం" – అంటూ బిగ్గరగా మాట్లాడం ప్రారంభించారు. చివరికి మేమా వ్యక్తుల్ని బయటికి పంపివేయవలసి వచ్చింది.

ఆ రాత్రి ఆయనకి జ్వరం బాగా పెరిగి పోయింది. నేను తోఎం ప్రయత్నించాను. కాని జ్వరం తగ్గలేదు. ఆ జ్వరంలో ఏదేదో మాట్లాడం ప్రారంభించారు. మధ్యాహ్నం ఆ వ్యక్తులతో అన్నమాటలే మాటిమాటికీ అనడం ప్రారంభించారు. మధ్యమధ్యలో – "రామానంద్! నీ అభిప్రాయమేమిటి?"– అని నన్నడగటం ప్రారంభించారు.

మధ్యమధ్యలో లేచికూర్చుంటూ, ఇంగ్లీషులో అతివేగంగా ఏదేదోమాట్లాడం ప్రారంభించారు. ఆ రాత్రి మేమంతా చాలా భయపడిపోయాం. వంతులవారీగా ఆయన మంచం దగ్గర కాపలా కాశాం. సుందరి ఆయన అక్కగారూ తెల్లవార్లూ ఆయన పక్కన అలాగే కూర్చున్నారు. "మీరిలా కూర్చున్నారంటే మీ ఆరోగ్యం కూడా చెడిపోతుంది"– అని,అక్కగారికి నచ్చచెప్పడానికి ప్రయత్నించాను నేను. కాని ఆవిడ వినిపించుకోలేదు. "నాకేమీ ఫర్వాలేదు. ఎవరి అవసరం ఎక్కువగా వుంటుందో అలాంటివాళ్ళే వెళ్ళిపోతారు. నాలాంటి పనికిరాని వాళ్ళకి నూరేళ్ళ ఆయువిస్తాడు, దేవుడు!" – అంది. తన భర్త అంత్యకాలంలో అక్కగారు ఎంతోసేవ చేసిందని భావానంద్ తన ఆత్మకథలో

రాసుకున్నారు. కాని అంతకు వందరెట్లు ఎక్కువగా ఆవిడ యిప్పుడు తమ్ముడికి సేవ చేసింది. భావానంద్ మేనమామ కూడా వచ్చారు. అర్ధరాత్రి వేళ ఆయన నన్ను బిగ్గరగా పిలిచి – "నీకా దేశభక్తుకి మాటలు గుర్తున్నాయా?"– అంటూ, ఆ వృత్తాంతమంతా చెప్పడం ప్రారంభించారు.

చివర్లో భయంకరంగా నవ్వి–"ఇదీ దేశాభిమానం"–అని, ఒక్కసారిగా కిందపడి పోయారు. ఒకటి రెండు నిమిషాల తర్వాత–లాంగ్‌ఫెలో ప్రసిద్ధ కవితాఖండికని బిగ్గరగా చదవటం ప్రారంభించారు. అలాంటి స్థితిలో కూడ ఆయన జ్ఞాపకశక్తిని చూసి మేమంతా ఆశ్చర్యపోయాం. చెబుతూ, చెబుతూ మధ్యలో నన్ను పిలిచి–"రామానంద్ ! ఈ పంక్తులు వినిపించు!"–అన్నారు. అలా అంటూ స్వయంగా తామే బిగ్గరగా వినిపించడం ప్రారంభించారు–

**Let us then be up and doing.**
**With a heart for any fate.**
**Still achieving still pursuing**
**Learn to labour and to wait.**

బిగ్గరగా చదవటం వల్ల ఆయనకి అలసట వచ్చింది. కళ్ళు తెరుచుకుని నిస్తబ్ధులై వుండిపోయారు.

ఈ లక్షణాలన్నిటికీ అర్ధమేమిటో నాకు తెలుసు. కాని చెప్పలేకపోతున్నాను. మహా బ్రతికితే యింకా పన్నెండుగంటలకంటే ఆయన ఎక్కువ బ్రతకరని నేను గ్రహించాను. మేమంతా ఆయన దగ్గరే కూర్చున్నాం.

ఒక్కొక్క గంటా గడిచిన కొద్దీ నా గుండెదడ పెరగసాగింది. మర్నాడు ఉదయం ఆరుగంటల ప్రాంతానికి–నేననుకున్నదానికి విరుద్ధంగా జరిగింది. తెల్లవారేసరికి క్రమక్రమంగా ఆ మహానుభావుడి ప్రాణజ్యోతి ఆరిపోతుందనుకున్నాను నేను. కాని అలా జరగలేదు. జ్వరం తగ్గిపోయింది. ముఖం ప్రసన్నమైంది. అక్కని దగ్గరకి పిలిచి–"అక్కా! నేను నిన్ను విడిచి వెళ్ళిపోతున్నాను; మహా అయితే ఇవ్వాళ రేపూ వుంటాను–అంతే. చిన్నతనంనుంచీ ఇప్పటిదాకా నేను నీ కేదైనా కష్టం కలిగిస్తే, ఏమైనా తప్పులు చేస్తే, నీ యిష్టానికి వ్యతిరేకంగా నడిస్తే–వాటన్నిటికీ నన్ను క్షమించు...."–అన్నారాయన.

"భావూ, భావూ! ఏమిటి నువ్వనేది?...."—అంటూ అక్కగారు బిగ్గరగా ఏడవటం ప్రారంభించింది. భావానంద్ శివరామ్‌పంత్‌గారిని దగ్గరగా పిలిచి—"మీరు నా పితృదేవులు....మీరు నాకు ఎంతో ఉపకారం చేశారు; ఆ ఋణమంతా నేను తీర్చుకోలేక పోయాను...."—అన్నారు. ఆ తర్వాత ఆయన—అత్యంత ప్రేమ పూరితమైన దృష్టితో సుందరి వంక చూశారు. ఆయన చెప్పదలచుకున్న దంతా ఆ ఒక్క చూపులోనే యిమిడివుంది.

కొంతసేపు ఆయన ఏమీ మాట్లాడలేదు. తర్వాత నన్నూ, అక్కగారినీ తప్ప మిగతా అందర్నీ గదిలోంచి బయటికెళ్ళమని పంపివేశారు. అందరూ బయటి కెళ్ళిన తర్వాత, నాతో—"రామానంద్! ఈ ప్రపంచాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోతున్నందుకు నాకు చాలా బాధగావుంది. ఇంత బాధ నా జీవితంలో ఒక్కసారి మాత్రమే అనుభవించాను—ఈ కార్యం ప్రారంభించాలని ప్రతిజ్ఞ తీసుకున్నప్పుడు! ఈ మహత్కార్యానికి సంబంధించి నీతో చెప్పవలసినదంతా ఉత్తరంలో రాసివుంచాను."—అన్నారు.

ఈ మాటలంటూ వుండగానే ఆయన ఉచ్ఛ్వాస నిశ్వాసాల వేగమూ, అలసటా పెరిగిపోయాయి. కాళ్ళూ చేతులూ చల్లబడ్డాయి. ఈ మహాత్ముడింక నాలుగైదు గంటలకి మించి జీవించివుండడని నేను గ్రహించాను. ఆ భావన రాగానే నా కళ్ళనుంచి నీళ్ళు కారసాగాయి. నేను బిగ్గరగా ఏడవటం ప్రారంభించాను. నన్ను నేను నిగ్రహించుకోలేక పోయాను. ఆయన మరికొద్ది సేపట్లోనే మమ్మల్నందర్నీ విడిచి వెళ్ళిపోతారు! ఆయన ఉపన్యాసాలూ ఉపదేశాలూ యిక మీదట మాకు వినిపించవు!

లోకహితానికి చెందిన చింతన; సహాయత; ఉపదేశాలు; పరిశ్రమ; ఉత్సాహం; స్ఫూర్తి; ఏకాగ్రత ఇవన్నీ ఆయనతో పాటే వెళ్ళిపోతాయి. ఆయన నాడి చూస్తూ వుండిపోయాను. క్రమ క్రమంగా ఆయన పరిస్థితి భయంకరంగా పరిణమించ సాగింది. నిద్రవచ్చినపుడు మనిషి స్థితి ఎలా వుంటుందో, అలాగే ఆ మహానుభావుడు, మహా పరాక్రమవంతుడు—దీర్ఘనిద్రకి ఉపక్రమించినట్టుగా తోస్తోంది. నేనాయన్ని బిగ్గరగా పిలవడం ప్రారంభించాను. ఆయన కళ్ళు తెరవడానికి ప్రయత్నిస్తూ, క్షీణస్వరంతో—"నువ్వు చెప్పాలనుకుంటున్నదేమిటో

చెప్పు...."—అన్నారు. చెప్పడానికేముంది? ఆయన తెలివిలో వున్నారో లేదో తెలుసుకోవడానికే నేవలా పిలిచాను.

"భావానంద్! ఇప్పుడు మేమంతా ఏమైపోతాం? ఆశ్రమం ఏమైపోతుంది?"—అన్నాను.

ఈ ప్రశ్నకి ఆయన సమాధాన మివ్వలేరేమో అనుకున్నాను. కాని కొద్ది క్షణాల తర్వాత ఆయన మెల్లిగా కళ్ళువిప్పి, మాట్లాడ్డానికి ప్రయత్నించారు. ఆయన పెదిమలు వణకుతున్నాయి.

"మీరు మాట్లాడలేకపోతే మాట్లాడకండి...."— అన్నాను నేను. కాని ఆయన నోటినుంచి ఏవో శబ్దాలు వెలువడుతున్నాయి. నాచెవి ఆయన నోటి దగ్గరకిచేర్చాను.

"ఒకవ్యక్తి వెళ్ళిపోతేమాత్రం ఏం? ఒక సైనికుడు మరణిస్తే, మరో సైనికుడు కరవాలం చేతబట్టాలి....".

ఇవే ఆయన చివరిమాటలు! మరో రెండుగంటల లోపలే ఆ దేశభక్తుడి ఆత్మ పరమాత్మలో లీనమైపోయింది!

## తరువాత....

"ఒకవ్యక్తి వెళ్ళిపోతేమాత్రం ఏం? ఒక సైనికుడు మరణిస్తే మరో సైనికుడు కరవాలం చేతబట్టాలి...." సమరభూమిలో సేనాపతి తన సైనికులకి ఇదే సందేశమిస్తాడు. ఈ ఉపదేశంవల్లనే సైనికుల ధైర్యం బలపడుతుంది. ఇవే ఆయన ఆఖరిమాటలు!

ఈ మాటలువిని నాలో ఒక విచిత్రమైన మనోస్థితి ఏర్పడింది. ఆయన మరణంవల్ల నిరాశ; విచారమూ మనసంతా క్రమ్ముకున్నాయి. చివరిక్షణం వరకూకూడ ఆ పుణ్యపురుషుడు తన జీవనధ్యేయంగురించీ, తన ఆశ్రమం గురించీ ఆలోచిస్తూనేవున్నారు.

ఆయన అంతిమవాక్యాలు ఎంత భావగంభీరమైనవి! ఆమహాత్ముడి ప్రాణాలు వెళ్లిపోయాయి. కాని ఆయనమాటలు మా ఆత్మల్లో విలీనమైపోయాయి. ఆ వాక్యాలవల్ల నాకు ధైర్యం లభించింది. ఇంకా యిలాంటి వ్యక్తులనేకులు తమ ప్రాణాలర్పించడానికి సమరాంగణంలోకి దూకాలి! ఒక్కరివల్ల ఏమీకాదు. ఇలాంటి ఆలోచనలన్నీ నా మనసులోకి రావడం ప్రారంభించాయి. నా దుఃఖం క్రమక్రమంగా తగ్గసాగింది. ఆయన మరణంవల్ల ఆయన కుటుంబమంతా కూడ వేదనతో కుమిలిపోయారు. వారందరికీ ధైర్యం చెప్పే బాధ్యత నాభుజ స్కంధాల మీద పడింది. అక్కగారిని ఓదార్చడమన్నది అసంభవం! శివరామ్ పంత్‌గారు పైకి ప్రశాంతంగావున్నట్టు కనిపించినా, ఆయన హృదయంలో వేదనాజ్వాల మండుతూనే వుంది. సాగర గంభీరమైన హృదయం ఆయనది! భావానంద్ కన్ను మూయగానే, సుందరి అక్కడినుంచి లేచి వెళ్ళిపోయింది. ఆమె మనోస్థితి ఏవిధంగావుందో ఆవిడకే తెలియాలి! భావానంద్ అక్కగారికీ, శివరామ్‌పంత్‌గారికీ కలిగిన వేదనకంటే సుందరి అనుభవించిన వేదన వెయ్యారెట్లు అధికం!

భావానంద్ మృత్యువు సుందరి మృత్యువుతో సమానం! అందువల్ల ఆమెని ఓదార్చడం అసంభవమై పోయింది.

భావానంద్ దహనక్రియలు ప్రశాంతంగా జరిగిపోయాయి. చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలంతా వచ్చి ఆ మహాత్ముడి అంతిమ దర్శనం చేసుకున్నారు. ఎవరినోటవిన్నా ఆయన్ని గురించిన ప్రశంసలే!

రెండుమూడు రోజులు గడిచాయి. దుఃఖోద్వేగం కాస్త తగ్గింది. ఇతర విషయాల గురించి ఆలోచించగల మానసికస్థితి ఏర్పడింది. ఆయన రాసి పెట్టిన ఉత్తరం చదవాలని ఈరెండు మూడు రోజుల్లోనూ నాకు చాలాసార్లు అనిపించింది. కాని నన్ను నేనే నిగ్రహించుకున్నాను. శివరామ్‌పంత్‌గారు, సుందరి, అక్కగారు, అందరి ఎదుటా ఈ విషయం చెబుదామనుకున్నాను. రెండుమూడు రోజుల తర్వాత నా మిత్రుల్నీ, శివరామ్‌పంత్‌గారినీ పిలిచాను. సుందరినీ, అక్కగారినీకూడా పిలిచి ఉత్తరాల సంగతి చెప్పాను. ఆ ఉత్తరంలో ఏముందో వినాలని అందరికీ కుతూహలంగా నేవుంది. అంతా వేదనాపూరిత

హృదయాలతో కూర్చున్నాం. ఎవరి నోటివెంటా ఒక్క అక్షరం కూడా బయటికి రావటంలేదు.

అంతా తలలు వంచుకుని మౌనంగా కూర్చున్నారు. ఆ కవరు తియ్యడానికి నా చెయ్యి ముందుకు సాగడంలేదు. వేళ్ళు వణుకుతున్నాయి. కాని ఎంతసేపు అలా వుంటాం? చివరికి ఆ కవరందుకున్నాను. ఆశ్రమ భవిష్యత్తు గురించే ఆ ఉత్తరంలో రాసి వుంటారనుకున్నాను.

కవరు తెరిచాను. అందులో వేర్వేరుగా మూడు ఉత్తరాలున్నాయి. ఒకటి నా పేరవుంది; రెండోది అక్కగారిది. ఆ రెండుపేర్లూ చూసి నా కాశ్చర్యం కలగలేదు గాని, సుందరిపేర కూడ మరో ఉత్తరం ఉండటం చూసి ఆశ్చర్య పోయాను. మౌనంగా మూడు ఉత్తరాలూ బయటికి తీశాను. నా ఉత్తరం నా దగ్గరే వుంచుకుని, అక్కగారి ఉత్తరం ఆమెకిచ్చాను; సుందరి ఉత్తరం సుందరి చేతి కిచ్చాను. ఉత్తరం తీసుకునే సమయాన ఆమె నేత్రాలు అశ్రుపూరితాలైనాయి. ఆ ఉత్తరం తన తండ్రి కందించింది. శివరామ్‌పంత్‌గారు గద్గదస్వరంతో—"నువ్వు ఏకాంతంగా ఈఉత్తరం చదువుకో; నాకు చూపనక్కర్లేదు...."—అని ఆ ఉత్తరం మళ్ళీ కూతురికిచ్చేశారు.అంతకంటే ఆయనింకేమీమాట్లాడలేకపోయారు.

నేను నా దుఃఖాన్ని అణుచుకుని, ఉత్తరం విప్పి నాలో నేను చదువుకున్నాను. ఒకసారి పూర్తిగా చదువుకున్న తర్వాత అందరికీ వినబడేలా చదివాను.అక్కగారుకూడా తన ఉత్తరం విప్పి చదువుకుంది. సుందరి మాత్రం తన ఉత్తరం విప్పలేదు.

ఉత్తరం చదివే సమయంలో చాలాసార్లు నా కళ్ళవెంట అశ్రువులురాలాయి. అక్షరాలుకూడ అస్పష్టంగా కనిపించాయి. కళ్ళు తుడుచుకుని అందరినీ వినమని పైకి చదివాను —

-శ్రీ-

ఆశీర్వాదాలు. రామానంద్! ఇంక నే నెక్కువరోజులు బ్రతకను. ఆసంగతి నీకూ తెలుసు. నా ఉత్సాహం, నా శారీరకశక్తి, మానసికశక్తి, అన్నీ ఖర్చు పెట్టేశాను. అందుకే యింక ఎక్కువరోజులు బ్రతకను. విశ్రాంతి తీసుకోమని మీరంతా చాలారోజుల్నించి నాకు చెబుతున్నారు. కాని—ప్రియమిత్రమా!

నేను విశ్రాంతి తీసుకున్నాకూడ నా ఆయువు పెరగదు. ఈ ఉత్తరంతో పాటుగా వున్న కాగితాల్లో నా స్వీయచరిత్ర అంతా రాశాను. నా జీవితకథ చెప్పమని మీరంతా చాలాసార్లు అడిగారు. నా కథ ఎవరూ రాయడం యిష్టం లేక నేను చెప్పలేదు.

మీలో ఎవరైనా నా కథ రాస్తే నా మీదవున్న గౌరవంవల్ల పక్షపాతబుద్ధితో రాస్తారు. నా మార్గం ఇష్టం లేనివారు నా కథరాస్తే వారూ పక్షపాతం చూపుతారు. ఇవన్నీ నా కిష్టం లేక చాలా మాసాలుగా నా అంతట నేనే స్వీయ చరిత్ర రాసుకుని వుంచాను. నిజానికి స్వీయచరిత్ర రాసుకోవడం నా కిష్టం లేదు. కాని మీరంతా అనేక పర్యాయాలు అడిగివున్నందువల్ల ఇది రాశాను. నా కథ నీ కధీనం చేస్తున్నాను. అయితే ఒక షరతు. నేను మరణించిన తర్వాత పన్నెండు సంవత్సరాల వరకూ నా యీ స్వీయ చరిత్ర ప్రచురించవద్దు. నేను నాటిన బీజాలు మొలకెత్తాలి. ఆ మొక్క మహావృక్షమై పెరిగితే మంచిదే. ఆ దశవచ్చి, నా యీ కథ ప్రజలు చదువుతారని నువ్వూ నీ మిత్రులూ భావిస్తే,ప్రజలుకూడ ఆసక్తిచూపితే,అప్పుడు దీన్ని ప్రచురించు. దీనికి సంబంధించిన సర్వాధికారాలూ నీ కప్పగిస్తున్నాను. నా తర్వాత కొద్దిరోజులకే నా ఆశ్రమం పతనమై, నీకెవరూ సహచరులు దొరక్కపోతే, నా యీ కథని నిస్సంకోచంగా కాల్చివెయ్యి. నేను ప్రారంభించిన మహాకార్యం భవిష్యత్తులో ఏమవుతుందో నాకు తెలియదు. కాని నా మార్గాన ముందుముందు మరింత కృషి జరగాలనే నా కోరిక.

ఈ కార్యం యింతటితో నశించదని నే నాశిస్తున్నాను. కాని అంతా వ్యతిరేకంగా జరిగితే? అందువల్లనే నా యీ ఆత్మకథని నా కుటుంబ సభ్యులకీ, ఆశ్రమంలోని మిత్రులకీ తప్ప మరెవరికీ చూపవద్దు. నేను రాసింది రాసినట్టుగానే వుంచుతావని ఆశిస్తున్నాను. ఈ కవరులో మరో కవరు కూడా వుంటుంది. ఆ కవరు ఎవరిది? అందులో ఏముంది? ఇవన్నీ నా ఆత్మకథ చదివిన మీదట తెలుస్తాయి. అవి తెలిసిన తర్వాత, ఆ ఉత్తరం అక్కకందజెయ్యి.

అదికాక మరోపెద్ద కవరుకూడ దీనితోపాటు వుంది. "దేశంయొక్క ఔన్నత్యం-పతనం" -అన్నవిషయంమీద నేను రాసిన పరిశోధనా వ్యాసాలందులో

వున్నాయి. ఈ వ్యాస రచనకి నేను కొన్ని సంవత్సరాల కాలం వెచ్చించాను. నా మరణానంతరం సాధ్యమైనంత త్వరలో ఈ వ్యాసాలు ప్రచురితంకావాలన్నది నా కోరిక. నేను అవలంబించిన మార్గాన్ని సమర్థిస్తూ ఈ వ్యాసాలు రాశాను. పంధొమ్మిదో శతాబ్దంలో రాజకీయ ఔన్నత్యానికి నూతన భావాలతో పని చెయ్యాలి. రానున్న మహాసంగ్రామం — తుపాకులతోనూ, ఫిరంగులతోనూ కాదు — భావాలతో జరగాలి. మన శత్రువులు రాజులు కారు — అజ్ఞానులు. శత్రువిజయం కోసం మనం విజ్ఞాన ప్రచారం చెయ్యాలి. ఇందుకు ముందుగా మనం జ్ఞానవంతులం కావాలి. అజ్ఞానుల్ని జ్ఞానవంతుల్నిగా చెయ్యడానికి మనం ఆత్మార్పణ చెయ్యాలి. నేను చదివిన చరిత్రలవల్ల — జ్ఞానబలంతోనే ప్రపంచం ముందుకు నడుస్తున్నట్టుగా నేను గ్రహించాను. ఒకప్పుడు జ్ఞాన విషయంలో ప్రపంచమంతటిలోకీ మనదేశమే అగ్రగామిగా వుండేది. ఆ తర్వాత ఈజిప్టు జ్ఞానాన్ని పొందింది. ఆ తర్వాత రోమ్ జ్ఞానవంతమైంది. ఆపైన వరుసగా ఫ్రాన్స్, జర్మనీ, ఇంగ్లండు, అమెరికాలు జ్ఞానాన్ని సంపాదించాయి. ఇప్పుడిప్పుడు జపాన్‌కూడా ముందుకు నడుస్తోంది. కాలచక్రానుసారంగా, జ్ఞానాన్నిబట్టి మనస్థానం మారుతూవుంటుంది. జ్ఞానం ఒక స్థానంనుంచి మరోస్థానానికి మనల్ని తీసుకువెళ్తుంది. జ్ఞానం అవినాశమైనది. అది నిరంతరం వృద్ధిచెందుతూనే వుంటుంది. ఏదేశంలో అయితే జ్ఞానం లోపిస్తుందో, ఆదేశం యొక్క వైభవం అంతరిస్తుంది. ఈ సిద్ధాంతానుసారంగానే నేను నా భావాల్ని ప్రతిపాదించాను. అందుకే, ఈ గ్రంథం త్వరగా ప్రచురితం కావాలని నేను కోరుకుంటున్నాను. దీనివల్ల లాభం కలుగుతుంది. మన భావాల్ని ప్రజలముందుంచడమే మన కర్తవ్యం. దీనివల్లనే మనకి ఆత్మశాంతి లభిస్తుంది.

ఇక మూడో విషయం — మన ఆశ్రమానికి సంబంధించినది. నా తర్వాత ఈ కార్యభారాన్ని మీ కప్పగించి వెళుతున్నాను. తనువు; మనసు; ధనమూ అన్నీ దేశాని కర్పించండి. రాత్రింబవళ్ళు మీ కార్యశక్తి, ఆలోచనా శక్తి, వాక్శక్తి — అన్నీ దేశానికి ధారపోయండి. శరీరరక్షణకి అవసరమైన సమయం తప్ప, మిగతా సమయమంతా ఈ మహత్కార్యానికై వెచ్చించండి. మీకు నా ప్రార్థన యిదే. మీరు భవిష్యత్తు నిర్మాతలు. మీ బాధ్యతలు మీరు తెలుసుకోండి.

ఒకవేళ మీ ప్రయత్నాలుగనుక నిష్ఫలమైతే – నిరాశచెంది, ఈ మహాత్కార్యాన్ని మధ్యలోనే విడిచిపెట్టకండి. రామానంద్ ! అయిదు పది సంవత్సరాల్లో పూర్తయ్యే పనికాదిది. వ్యవసాయంలో గనుక – భూమిని సారవంతం చెయ్యడానికి ఎరువులూ, నీరూ మొదలైనవి ఎలా అవసరమో, దేశసంక్షేమ కార్యమనే వ్యవసాయంలోకూడ కార్యకర్తలంతా ఎరువులుగా నీరుగా ఉపయోగపడాలి. ఫలప్రాప్తి కోసం ఎందరో కార్యకర్తలు తమ జీవితాలు ధారపొయ్యవలసి వుంటుంది. మన భారతభూమి ఎన్నో సంవత్సరాలుగా బంజరుగా పడివుంది. ఇప్పుడీ బంజరు భూమిని విదేశీయు లాక్రమించుకున్నారు.

ఈ క్షేత్రాన్ని తిరిగి సారవంతం చెయ్యడానికి ఎందరో పరిశ్రమింపవలసి వుంటుంది. మిత్రులారా ! మీవంటి వారు కొన్ని వందలమంది, వేలమందీ కృషి చేసినప్పుడే ఈ కార్యం నెరవేరుతుంది. మన ఈ కృషియొక్క ఫలాలు ముందు తరంవారి కందుతాయి. అందువల్ల ఈ కృషి జరపడం మన కర్తవ్యం. మన ప్రయత్నాలు తప్పక ఫలిస్తాయి. అందువల్ల బాగా కష్టపడి పనిచెయ్యండి.

నే నీ ఉత్తరంలో ముఖ్యంగా ఆత్మత్యాగం గురించి మీ అందరికీ చెప్పాను. స్వార్థత్యాగం చెయ్యలేని ఏవ్యక్తీ కూడ ఈ మార్గాన నడవలేదు. సాంసారిక వ్యామోహాల్లో మునిగిపోయిన వ్యక్తి వల్ల మహాకార్యాలేవీ కూడ నెరవేరవు. రామానంద్ ! నువ్వు నీ స్వార్థాన్ని త్యజించావు; తల్లిదండ్రుల ప్రేమని కూడ త్యజించి ఈ మార్గం స్వీకరించావు. అందువల్ల త్యాగశీలత గురించి నీకు వేరుగా చెప్పనక్కర్లేదు. కాని–తల్లిదండ్రుల బంధంకంటే సుందరమైన బంధం మరొకటుంది. అది తెంచుకోవడానికి అమితమైన ధైర్యం కావాలి. అది తెంచుకుని ఎంత మంది ఈ కార్యానికి పూనుకుంటే, ఈ కార్యమంతగా సఫలమవుతుంది. అందువల్ల ఈ మఠంలో ఎంతమంది అవివాహితులు చేరితే అంత మంచిది. యువకులు మన కార్యక్రమానికి మూలస్తంభాలు. వారి ఆధారాన్ని సంపాదించడానికి ప్రయత్నించు. పరమార్థమంటే ఏమిటి ? మన దేశం యొక్క చిరకాల సౌభాగ్యమే, శ్రేయస్సే పరమార్థం.! మోక్షమంటే ఏమిటి? మనదేశాన్ని దాస్య శృంఖలాలనుంచి విముక్తం చెయ్యడమే మోక్షం. ఈ రెంటి సాధన కోసం, నిరంతరం నిర్విరామంగా పరిశ్రమించడమే మనం చేపట్టిన మహాత్కార్య

లక్ష్యం. రామానంద్! నృసింహానంద్! యితర మిత్రులారా! ఇదే నా చివరి ఉత్తరం. నా ప్రాణాలు మరికొద్ది గంటలకంటే ఎక్కువ నిలవవు. కాని నా ఆత్మ ఎప్పుడూ మీ చెంతనే వుంటుంది. మీకు నిజంగా నా మీద గౌరవం వున్నట్లయితే, ఈ మతాన్ని సక్రమంగా నడిపించండి. జ్ఞానాన్ని పంచిపెట్టండి. బీదలదగ్గరకు వెళ్ళి వారి ఆశలూ ఆలోచనలూ తెలుసుకోండి. ఈ కార్యసాధనలో- మీరు కారాగారానికి వెళ్ళవలసి వచ్చినా, అపవాదులకి గురికావలసి వచ్చినాకూడా మీధైర్యాన్ని విడనాడకండి. ప్రజల ఆలోచనల్ని జాగృతం చేసే సమయంలోనే నిజమైన యుద్ధం జరుగుతుంది. ఇది మనకి పరీక్షాసమయం. ఈ పరీక్షా సమయంలో వుండలేక పోతున్నాననే నాకు బాధగా వుంది. మిమ్మల్ని నిరాశ పర్చాలని నే నీ మాటలు చెప్పడంలేదు. మీ ధైర్యాగ్ని నలుమూలలకీ వ్యాపించి అంతటా ఆ అగ్ని అంటుకోవాలనే నేను కోరుకునేది. ఏదైనా చెరువులో నీరు ఎండిపోతే; ఎంత ప్రయత్నించినా నీరు ఎండిపోతూనే వుంటే, అది భూత పిశాచాల ప్రభావమనీ, ఒక పుణ్యాత్ముడిని బలియిస్తే, ఆ భూతాల బెడద తప్పి పోతుందనీ ఒక అంధ విశ్వాసముంది. అలాగే మన ఈ మహాత్కార్యసిద్ధి కోసమై,-జననింద, స్వార్థం-ఈ రెండు పిశాచాల్నీ బలియివ్వాలి.

ఇప్పటికే చాలా విషయాలు చెప్పాను. మీరీ ఉత్తరం చదువుకునే సమయానికి నే నీ లోకంలో వుండను. నా స్మృతి మాత్రమే మీకు మిగిలి వుంటుంది. ఈ స్మృతి ఎల్లవేళలా వుంచుకోవలసిందని కడసారిగా మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను."

మేమంతా ఈ ఉత్తరాన్ని మతగ్రంథంగా భావించసాగాం. ఆయన ఆదేశాలు మాహృదయపుటలపై స్వర్ణాక్షరాలతో ముద్రించబడ్డాయి. భావానంద్‌ని మా నాయకుడిగా భావించుకునేవాళ్ళం. కాని ఈరోజునుంచీ ఆయనను మా మత గురువుగా, పరమగురువుగా ఎంచుకుంటున్నాం. మేం మా కార్యాన్ని ధైర్యంగా నిర్వహించాం. నేను రాస్తున్నదంతా సత్యమే రాస్తున్నాను. ఇప్పుడు మా మతం ప్రగతిపథాన నడుస్తోంది. మతం యొక్క అయిదు శాఖలు వేర్వేరు చోట్ల స్థాపించబడ్డాయి. భావానంద్ వర్ణించిన సమస్యలే మాకూ ఎదురైనాయి. మా ఆశ్రమవాసులు లోకనింద నెదుర్కోవలసి వచ్చింది. అవమానాలు భరించ

వలసి వచ్చింది. కొందరు విశ్వాసఘాతుకులయ్యారు. కొందరు వెళ్ళిపోయారు. కాని అదంతా ఆశ్రమానికి లాభదాయకమే అయింది. భావానంద్ తన స్వీయ చరిత్రని ప్రచురించడానిగ్గాను పెట్టిన పన్నెండు సంవత్సరాల గడువు పూర్తి అయింది. ఆపైన యింకా కొన్ని సంవత్సరాలుకూడా గడిచాయి. మా ఆశ్రమం రోజురోజుకీ పురోగమిస్తోంది. అది చూసిన తర్వాతనే, నేనీ కథని ప్రచురించాను. భావానంద్ వంటి మహావినయశీలి కథ యిది. ఇందులో అతిశయోక్తులకి తావులేదు. కాగా, ఇందులో ఒక దోషం వుంది.

భావానంద్ చేపట్టిన కార్యం ప్రారంభమైన చోటినుంచీ, ఆత్మస్తుతి భయం వల్ల ఆయన అన్నీ కూడ సంక్షిప్తంగా మాత్రమే రాశారు. అక్కడక్కడా 'ఫుట్‌నోట్స్' యిచ్చి, ఆ కార్యాన్ని యింకా వివరిద్దామని నే ననుకున్నానుగాని, అది సముచితంగా వుండదని వూరుకున్నాను. తను చెప్పినదంతా ఆచరించి చూపిన మహావ్యక్తి—భావానంద్! ఆయన స్వీయచరిత్రని మీకు సమర్పిస్తూ, ఆయన గురించి నేను ఒక్కటే మాట చెప్పదల్చుకున్నాను—

'BEHOLD THE MAN'

(సమాప్తం)

# వెలువడిన పుస్తకములు

## భారతదేశము — ప్రజలు

| | | వెల రూ. | పై. |
|---|---|---|---|
| భారతదేశ ఖనిజములు | .... | 5 | 75 |
| పెంపుడు జంతువులు | ... | 4 | 50 |
| సామాన్య వృక్షములు | .... | 4 | 25 |
| నికోబార్ దీవులు | .... | 5 | 50 |
| జనాభా | .... | 3 | 75 |
| ఉద్యాన పుష్పములు | .... | 6 | 00 |
| భారతదేశ ఆర్థిక భూగోళము | .... | 5 | 25 |
| ఋతుపవనములు | .... | 3 | 25 |
| అడవులు-అటవీశాస్త్రము | .... | 6 | 00 |
| ఔషధీ భూజములు | .... | 5 | 75 |
| మొక్కల తెగుళ్ళు | .... | 4 | 75 |
| పూలచెట్లు | .... | 5 | 50 |
| భారతదేశము-ఒక పర్యాలోకనము | .... | 5 | 50 |

## జాతీయ జీవిత గ్రంథమాల

| | | | |
|---|---|---|---|
| సముద్రగుప్తుడు | .... | 1 | 25 |
| రాణీ లక్ష్మీబాయి | .... | 2 | 00 |
| శంకరాచార్యులు | .... | 2 | 00 |
| అహిల్యాబాయి | .... | 2 | 00 |
| చంద్రగుప్త మౌర్యుడు | .... | 1 | 50 |
| సుబ్రహ్మణ్య భారతి | .... | 2 | 25 |
| గురునానక్ | .... | 2 | 25 |
| త్యాగరాజు | .... | 1 | 75 |
| హర్షుడు | .... | 2 | 00 |

| | | | |
|---|---|---|---|
| కబీరు | .... | 1 | 75 |
| నానాఫడ్నవీస్ | .... | 2 | 00 |
| రామానుజాచార్యులు | .... | 2 | 25 |
| ఈశ్వరచంద్ర విద్యాసాగర్ | .... | 1 | 75 |
| స్వామి రామతీర్థ | .... | 2 | 50 |

## ఆదాన్–ప్రదాన్

| | | | |
|---|---|---|---|
| పంజాబీ కథలు | .... | 3 | 50 |
| స్మృతిరేఖలు | .... | 6 | 50 |
| బన్‌గర్‌వాడి | .... | 6 | 25 |
| తమిళ కథలు | .... | 4 | 00 |
| జీవితసంగ్రహము–వీరేశలింగము | .... | 4 | 25 |
| తెల్లనిరక్తం | .... | 4 | 75 |
| మరణానంతరం | .... | 4 | 00 |
| కవి | .... | 4 | 75 |
| అగ్నిధార | .... | 6 | 75 |
| హిందీకథలు | .... | 4 | 25 |
| జీవితం ఒక నాటకరంగం | .... | 4 | 50 |
| ప్రాచీన లక్నో | .... | 7 | 00 |
| తెలుగు కథానికలు | .... | 6 | 50 |

## ఇతర పుస్తకములు

| | | | |
|---|---|---|---|
| భారతదేశము; నేడు–రేపు | .... | 0 | 75 |
| కల్కి : లేక నాగరకత భవిష్యత్తు | .... | 0 | 75 |
| జ్వాలాముఖి | .... | 3 | 75 |
| ఏకప్రపంచము భారతదేశము | .... | 0 | 75 |
| జ్యాడీలక్ష్మి | .... | 1 | 50 |
| పోతన | .... | 2 | 75 |

